# నవ్య

ఆంధ్రజ్యోతి ప్రచురణ

www.navyaweekly.com

వీక్లి

18-1-2017

₹:20

- సంక్రాంతి వచ్చిందే తుమ్మెదా!
- సరదా కథలు ప్రారంభం



# ఒకే ఒక్క 'పాట'

## -రాయ్ లక్ష్మీ



**ఒకే ఒక్క పాట పది సంవత్సరాల కెరీర్‌ను మార్చి వేసింది. హీరోయిన్‌గా రాని గుర్తింపు ఆ ఒక్క పాట తీసుకొచ్చింది. ఇంతకీ ఆ పాట ఏంటి? ఆ నటి ఎవరు? అన్న అనుమానం వస్తోందా? ఆనటి రాయ్ లక్ష్మీ, ఆ పాట 'సర్దార్ గబ్బర్ సింగ్' లోని 'తప్పు తప్పే శుద్ధ తప్పే' అన్న పాట. ఆ పాటతో రాయ్ లక్ష్మీలోని అందాలే కాదు... ఆమె స్టామినా కూడా సినీజనాలకు తెలిసి వచ్చింది. దాంతో అవకాశాలు క్యూ కట్టాయి. 'ఖైదీ నంబర్ 150'లోని రాయ్ లక్ష్మీ పాట స్టిల్‌ని ఓ హిందీ సినిమా ప్రమోషన్‌కి వాడుకుంటున్నారంటే అమ్మడి రేంజ్ ఎంతగా పెరిగిపోయిందో అర్థం చేసుకోవచ్చు. ఈ సినిమాలో ఛాన్స్ తనకు భగవంతుడు ఇచ్చిన అపురూపమైన వరం అంటున్న రాయ్ లక్ష్మీతో...**

**ఐటెంసాంగ్స్‌తో ఫుల్ జోష్‌లో ఉన్నట్టున్నారు?**

ఎలా వచ్చినా ఈ రంగంలో గుర్తింపు అనేది చాలా ముఖ్యం. ఒక్కొక్కరికీ ఒక్కో గుర్తింపు వస్తుంది. నాకు పాటల ద్వారా వచ్చింది. ఈ గుర్తింపు నాకు ఆనందాన్నే ఇస్తోంది.

**హీరోయిన్‌గా వచ్చి ఐటెంసాంగ్స్ చేయడం బాధగా అనిపించడం లేదా?**

బాధ లేదు. హీరోయిన్లు ఎంత మంది ఉన్నా, స్పెషల్ సాంగ్స్ డిజైన్ చేస్తున్నారంటే మా గ్లామర్ గొప్పదనే కదా అర్థం! అలాగని హీరోయిన్లని కించపరచడం లేదు. స్పెషల్ సాంగ్స్ ప్రత్యేకతను వివరించడమే నా ఉద్దేశం. దక్షిణాదిన స్పెషల్ సాంగ్స్ అంటే చిన్నచూపు ఉంది కానీ, ఉత్తరాదిన వీటికి బాగా డిమాండ్‌తో, గుర్తింపూ ఉన్నాయి. హీరోయిన్‌కన్నా సాంగ్స్ చేసేవారి రెమ్యునరేషన్ ఎక్కువగా ఉంటుంది. ఇప్పుడిప్పుడే దక్షిణాదిన కూడా ఆ పద్ధతి వస్తోంది.

**'ఖైదీ నంబర్ 150'లో పాట గురించి...**

ఈ సినిమాలో అవకాశం రావడం భగవంతుడు నాకు ఇచ్చిన అపురూపమైన వరం. ఈ పాటలో నేను అందంగా కనిపించానంటే అది నా అందం గొప్పతనం కాదు... సుస్మితగారు డిజైన్ చేసిన కాస్ట్యూమ్స్ గొప్పతనం. చిరంజీవిగారితో స్టెప్పులు అంటే మొదట్లో కొద్దిగా భయం అనిపించింది. కానీ రెండోరోజుకి అలవాటైపోయింది. నేనేమీ మెయిన్ హీరోయిన్‌ని కాను. అయినా నన్ను ఎంతో ఆప్యాయంగా పలకరించేవారు.

**సినిమా ముందు క్యాథరిన్ కాస్ట్యూమ్స్ విషయంలోనే గొడవ పడ్డారట కదా?**

ఆ సంగతి నాకు తెలియదు. క్యాథరిన్ ఎందుకు డ్రాప్ అయిందో నేను అడగలేదు. ఆ విషయాలు నాకు అనవసరం కదా? అందుకే మౌనంగా ఉండిపోయాను.

**మిగతా మెగా హీరోల సినిమాల్లో కూడా స్పెషల్ సాంగ్స్ చేస్తున్నారా?**

ఇప్పటివరకైతే ఏమీ లేదు. అవకాశం వస్తే తప్పకుండా చేస్తాను. మెగా హీరోలనే కాదు. మిగతా హీరోల సినిమాలలో చేయడానికి నాకేమీ అభ్యంతరం లేదు. సినిమాలో స్పెషల్ సాంగ్ ఉందీ అంటే సినిమాకు అదనపు ఆకర్షణ తీసుకురావడానికే కదా! ఆ అదనపు ఆకర్షణ నాదే అయితే అభ్యంతరం ఎందుకు?

**బాలీవుడ్‌లో మొదటిసారి చేస్తున్నట్టున్నారు?**

లేదు. గత సంవత్సరం 'అకీరా'లో చిన్న పాత్ర చేశాను. మొదటిసారి 'జూలీ 2'లో హీరోయిన్‌గా చేస్తున్నాను. అక్కడ అవకాశాలు వస్తున్నాయి కానీ, ఇంకా వేటికీ ఓకే చెప్పలేదు. త్వరలోనే మరో సినిమా చేసే అవకాశం ఉంది. గత సంవత్సరం నటిగా నాకు బాగా కలిసి వచ్చింది. దక్షిణాదిన, ఉత్తరాదిన నన్ను గుర్తించారు. ఈ సంవత్సరం మరింత గుర్తింపు దక్కుతుందని ఆశపడుతున్నాను.

**దక్షిణాదిన సినిమాలు చేస్తున్నారా?**

'ఖైదీ నంబర్ 150'లో చేసిన తరువాత చాలా మంది అడిగారు. కానీ బాలీవుడ్‌లో సినిమా పూర్తి కాకపోవడంతో ఎవరికీ ఓకే చెప్పలేదు. త్వరలోనే తెలుగులోనూ, తమిళంలోనూ ఓ సినిమా చేసే అవకాశం ఉంది. డిస్కషన్స్ జరుగుతున్నాయి. అన్నీ ఫైనల్ కాగానే నేనే చెబుతాను.

-భరత్ కుమార్

నవ్య వీక్లీ-ఉపాధ్యాయుల భాస్కరరావు స్మృతిసాహితి సంయుక్త నిర్వహణలో

# కథల పోటీ

| | | |
|---|---|---|
| ప్రథమ బహుమతి | : | రూ. 10,000 |
| ద్వితీయ బహుమతి | : | రూ. 8,000 |
| తృతీయ బహుమతి | : | రూ. 7,000 |
| 7 విశేష బహుమతులు (కథ ఒక్కొంటికి) | : | రూ. 5,000 |

## కథ: నిబంధనలు

- కథ తెలుగు వారి జీవితానికి అద్దం పట్టేలా ఉండాలి.
- ప్రపంచంలోని ఏ ప్రాంతమైనా కథకు నేపథ్యం కావచ్చు. అయితే అది తెలుగువారి జీవితానికి సంబంధించినదై ఉండాలి.
- కథలు అరటావు సైజులో 10 పేజీలకు మించకుండా ఒకవైపునే రాసి పంపాలి. దస్తూరి చక్కగా అర్థమయ్యేలా ఉండాలి. డి.టి.పి. చేసిన పక్షంలో అది 6 పేజీలకు మించరాదు.
- కథను పంపేటప్పుడు రచయిత/రచయిత్రి పేరు అందులో ఉండరాదు. పేరు, పూర్తి చిరునామా వేరే కాగితం మీద రాసి జత పరచాలి. అనుకరణ, అనుసరణ కాదని, బ్లాగుల్లోనూ, వెబ్ మాగజైన్స్‌లోనూ రాలేదని హామీ పత్రం విధిగా జత చేయాలి. కవరు మీద 'నవ్యవీక్లీ - ఉపాధ్యాయుల భాస్కరరావు కథల పోటీకి' అని స్పష్టంగా పేర్కొనాలి.
- విదేశాల నుంచి కథలు పంపించే రచయితలు/రచయిత్రులు మాత్రమే ఈ-మెయిల్ (navyaweekly@andhrajyothy.com)కి పంపగలరు.
- బహుమతి పొందిన కథలు 'నవ్య' వీక్లీలో ప్రచురితమవుతాయి.
- పోటీ గడువు తేదీని పొడిగించేందుకు కానీ, అర్హమైన రచనలు రాకపోతే బహుమతుల్లో మార్పులు చేసేందుకు కానీ 'నవ్య వీక్లీ' యాజమాన్యానికి సర్వహక్కులూ ఉన్నాయి.
- కథల ఎంపిక విషయంలో తుది నిర్ణయం నవ్య సంపాదక వర్గానిదే! ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలకు కాని, వాద ప్రతివాదాలకు కాని తావు లేదు. ప్రచురణకు అనర్హమైన కథలను తిప్పి పంపడం సాధ్యం కాదు.

**కథలు పంపవలసిన చిరునామా**

**నవ్య వీక్లి**
ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్
ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70
అశ్వనీ లే అవుట్,
హుడా హైట్స్
జూబ్లీహిల్స్
హైదరాబాద్-500033

కథలు చేరవలసిన ఆఖరు తేది

# 31 జనవరి 2017






*ముఖచిత్రం: హరిలో రంగ హరి*
*ఆర్ట్: కడలి సురేష్*


రచనలు, కథలు పంపవలసిన చిరునామా
**నవ్య వీక్లీ**, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం.76, అశ్వనీ లేఅవుట్, హుడా హైట్స్, రోడ్ నెం.70, జూబ్లీహిల్స్, హైదరాబాద్-33. **email: navyaweekly@andhrajyothy.com**





### ఫ్రీ

ఓ నలభై ఏళ్ల వ్యక్తి, అతని చేయిపట్టుకుని ఓ ఏడేళ్ళ కుర్రాడూ ఇద్దరూ బార్బర్‌షాపులోనికి వచ్చారు. ముందు ఆ వ్యక్తి షేవ్, షాంపూ, హెయిర్ కట్, మానిక్యూర్ ఇంకా చాలా చేయించుకున్నాడు. అతనివన్నీ పూర్తి కాగానే కుర్రాణ్ణి ఛైర్ మీదికి ఎక్కించి కూర్చోపెట్టాడు. చెప్పాడిలా.

"నేనిప్పుడే టీ తాగి వస్తాను, నువ్వు అల్లరి చెయ్యకుండా జాగ్రత్తగా కటింగ్ చేయించుకో"

"సరే" అన్నాడు కుర్రాడు.

కాసేపు గడిచింది. కుర్రాడి కటింగ్ పూర్తయింది. అయినా వెళ్ళిన వ్యక్తి ఇంకా తిరిగి రాలేదు.

"ఏంటిబాబూ! టీ తాగడానికి వెళ్ళి మీ డాడీ ఇంకా రాలేదు. కొంపదీసి నిన్నూ, నన్నూ మరచి పోలేదు కదా?" అడిగాడు బార్బర్.

"వాడు మాడాడీ ఏం కాదు."

"మరి"

"నేను వీధిలో ఆడుకుంటుంటే నాతో వస్తావా, ఫ్రీగా హెయిర్‌కటింగ్ చేయిస్తానన్నాడు. సరేనన్నాను." అన్నాడు కుర్రాడు.

### రహస్యం

పెళ్లయ్యింది. తొలిరాత్రి. ఓ చిన్న సూట్‌కేస్‌తో గదిలోనికి ప్రవేశించింది భార్య. సూట్‌కేస్‌ను మంచం కింద ఉంచింది. గమనించాడది భర్త.

"ఎందుకది?" అడిగాడు.

"ఎందుకన్నది నేను చెప్పను. అలాగే అందులో ఏం ఉన్నదీ నువ్వు చూడడానికి వీల్లేదు." అన్నది భార్య.

ముప్పయి అయిదేళ్లు గడిచాయి. ఓ రాత్రి ఇక తట్టుకోలేక సూట్‌కేస్ తెరచి చూశాడు భర్త. అందులో మూడు ఖాళీ బీర్‌బాటిల్సూ, ఓ యాభైవేల నగదూ ఉన్నాయి. తను చేసిన తప్పును నిర్భయంగా భార్య ముందు ఒప్పుకున్నాడు భర్త.

"నువ్వు క్షమించాలి. నీ సూట్‌కేస్ నేను తెరచి చూశాను. అందులో మూడు ఖాళీ బీర్‌బాటిల్సూ, యాభైవేల నగదూ ఉంది. ఏంటదంతా?" అడిగాడు.

"ఏంటంటే నిన్ను చీట్ చేసిన ప్రతిసారీ నేను ఓ బీర్ తాగేదాన్ని. ఖాళీ బాటిల్ అందులో దాచేదాన్ని." అన్నది భార్య.

"మరి ఆ డబ్బు?"

"సూట్‌కేస్‌లో ఖాళీబాటిల్ పట్టనప్పుడల్లా అది అమ్మితే వచ్చే పైకాన్ని అందులో దాస్తూ వచ్చాను." అన్నది భార్య.

-వైనతేయ

www.navyaweekly.com

పుస్తక పఠనం ఎంతటి బాధనయినా మరపిస్తుంది.

నవ్య

సంపుటి: 13 సంచిక: 46

18-1-2017

మేనేజింగ్ డైరెక్టర్
వేమూరి రాధాకృష్ణ

ఎడిటర్
ఎ.ఎన్.జగన్నాథశర్మ



మొదటి పేజి

# బోగిమంట

మూర్తికీ, సుందరికీ పాతికేళ్లుగా మాటలు లేవు. భార్యాభర్తలు మాట్లాడుకోకపోతే కష్టం కదా అంటే ఏం కాదన్నట్టుగా బతికేస్తున్నారిద్దరూ. సైగలతో సంసారాన్ని లాగేస్తున్నారు. అసలిద్దరికీ ఎందుకు మాటల్లేవంటే...

పాతికేళ్లక్రితం, తెల్లారితే బోగి అనగా చలిచలివేళ మూర్తిని కేకేసి లేపారు నేస్తులు. మంట వేద్దాం రారా మహానుభావా అన్నారు. మూర్తి కుటుంబీకులే అగ్రహారంలో మంటవేయడం ఆనవాయితీ. నేస్తులు కేకేయడం ఆలస్యం, పందిరి మంచం మీంచి గుర్రంలా కిందికి దూకాడు మూర్తి. ఆ శబ్దానికి సుందరి పొత్తిళ్లలో పడుకున్న ఏణ్ణర్థం వాసుకి మెలకువ వచ్చింది. మెలకువ వచ్చిందే తడవు వాడు ఏడుపు లంకించుకున్నాడు. ఇప్పుడు వీణ్ణి ఎవరు భరిస్తారు? అడిగింది సుందరి. నేను భరిస్తానన్నాడు మూర్తి. ఏడుస్తున్న కొడుకుని భుజాన వేసుకుని, వీధిలోనికి నడిచాడు. ఒక పక్క వాసు ఏడుపు, మరో పక్క చలి, ఇంకో పక్క పచ్చికట్టెలేమో! సరిగ్గా మండక పొగలు. మూర్తికి మంచుపడదు. ఒకరోజు చలిలో తిరిగాడంటే మూడు రోజులు తుమ్ముతూ, దగ్గుతూ మంచం పట్టాల్సిందే! అందుకే మంటలూ, మంచులూ వద్దంటుంది సుందరి. మూర్తి వినడు. ఆ వినకపోవడంతోనే వచ్చింది తంటా. మంచులో తడవడంతో మూర్తికే కాదు, వాసుకి కూడా బాగా జలుబు చేసింది. ఆ జలుబు జ్వరానికి దారి తీసింది. ఆ జ్వరంతో వాడు ఉంటాడో, పోతాడో అనిపించాడో క్షణం. ఆ ఆందోళనలో మూర్తిని గట్టిగా 'మీకు బుద్ధి లేదు! మీకు బుద్ధిరాదు! మీరో పెద్ద ఇడియట్' అంది సుందరి. అంతే! అప్పటి నుంచి ఇద్దరికీ మాటలు లేవు.

పెరిగి పెంకిఘటం అయ్యాడు వాసు. తల్లి తిడితే తండ్రి దగ్గరకు, తండ్రి తిడితే తల్లి దగ్గరకు చేరి, ఒకరి మీద ఒకరికి చాడీలు చెప్పాడు. తల్లిదండ్రుల్ని మరింత దూరం చేశాడు. తను చేసింది తప్పన్నది వాసుకి టెన్త్‌క్లాస్ పాసయినప్పుడు తెలిసింది. సరిదిద్దుకునేందుకు ప్రయత్నించేంతలో ఇంటర్మీడియట్ చదివించేందుకు వాణ్ణి పట్నానికి తీసుకుపోయాడు మేనమామ. ఇంటర్మీడియట్, డిగ్రీ, పిజీ చేసి, తర్వాత లెక్చరర్‌గా నిలదొక్కుకుని ఇంటికి వచ్చాడు వాసు. పాతికేళ్ళు గడిచాయి అప్పటికి. ఆనాటికి కూడా మాటల్లేకుండా తల్లిదండ్రులు ఇంట్లో మసలడం గమనించాడు వాసు. బాధపడ్డాడు. తన కారణంగానే అమ్మానాన్నా మాట్లాడుకోవట్లేదు. వాళ్ళు మాట్లాడుకోవాలి. ఏం చెయ్యాలి? అని ఆలోచనలో పడ్డాడు.



సుందరితో మూర్తి గొడవపడ్డ దగ్గర నుంచీ అగ్రహారంలో బోగిమంట లేదు. మంట వెయ్యడం మానుకున్నాడు మూర్తి. నేస్తులు కూడా అతన్ని ఒత్తిడి చెయ్యలేదు. ఎర్రమంట కళ్ల చూడకపోతే కలసి రాదంటారు. అయినా చూడలేదెవరూ. సంగతి అంతా తెలుసుకుని రంగంలోకి దూకాడు వాసు. మిత్రుల్ని చేరదీశాడు. గొడ్డలిపట్టాడు. అడవిలోనికి నడిచాడు. ఆ కొమ్మా ఈ రెమ్మా నరికాడు. ఆ కంపా ఈ కంపా కలిపాడు. తెచ్చి ఇంటి ముందు కుప్పపోశాడు. తెల్లారితే బోగి అనగా చలిచలివేళ లేచాడు. మంట వేశాడు. పాతికేళ్ల తర్వాత అగ్రహారంలో బోగిమంట. చిన్నాపెద్దా చేరారక్కడకి. వెచ్చగా మంటకాగారు. మీ నాన్నని కూడా పిలవరా! చూసి ఆనందిస్తాడంటే ఆ మాటకోసమే ఎదురు చూస్తున్నట్టుగా వెళ్లి మూర్తిని లేపాడు వాసు. మంట వేశాం రండన్నాడు. రానన్నాడు మూర్తి. ఈ వయసులో మళ్లీ భార్యతో గొడవపడడం ఇష్టం లేదతనికి. అమ్మ మిమ్మల్నేమీ అనదు, మంట చూడడానికి అమ్మ కూడా వస్తుంది, రండి అని ఓ చేత్తో తండ్రినీ, మరో చేత్తో తల్లినీ పట్టుకుని మంట దగ్గరకు తోడుకుని వచ్చాడు వాసు. ఎన్నేళ్లయిందో బోగిమంటను చూసి. చూడగానే చేతులు జోడించి మూర్తి దానికి నమస్కరించాడు. జేబులో వెదకి, రెండు రూపాయి నాణాలను తీశాడు. ఒకటి తను మంటలో వేసి, రెండోది సుందరికి ఇచ్చాడు. ఆమె కూడా మంటలో రూపాయినాణెం వేసి నమస్కరించింది. కాసేపటికి మూర్తిని మంచుపట్టేసింది. వరుసగా తుమ్మసాగాడు. చూసి భయపడింది సుందరి. వెంటనే మూర్తి తల మీద తన చీరకొంగు కప్పి, దగ్గరగా తీసుకుందతన్ని. మఫ్లర్ తెచ్చుకోవచ్చు కదా? అంది. తెచ్చుకోకపోవడమే అందంగా ఉంది అని నవ్వాడు మూర్తి. ఇద్దరూ మాట్లాడుకున్నారు. మాట్లాడుకున్నామని తెలిసి నవ్వుకున్నారిద్దరూ. వాసు ఆనందించాడు దానికి. చిన్నపిల్లాడిలా చప్పట్లు కొట్టాడు.

నవ్య




## పిలవని పేరంటాళ్లు

అబ్బాయికో, అమ్మాయికో పెళ్ళి కుదిరిందంటే చాలు.. ముందుగా ఎవరెవరిని పిలవాలా అని లిస్టు తయారుచేస్తుంటారు. స్నేహితులు, బంధువులు అందరినీ కలబోస్తారు. ఒకవేళ విదేశీయులు పెళ్ళికి వచ్చి వేడుకలో సందడి చేస్తే ఎలాఉంటుంది? అందరిచూపూ వాళ్ళమీదే ఉంటుంది కదా! ఇద్దరు ఆస్ట్రేలియా యువతులతో కలిసి పల్లవీ సావంత్ కూడా అదే పని చేస్తోంది జాయిన్‌మైవెడ్డింగ్ ద్వారా! విదేశీయుల్ని మన పెళ్ళిళ్ళకి ఆహ్వానించి కొత్త జంటకు డబ్బులు ఇప్పిస్తుంది. అదే జాయిన్ మైవెడ్డింగ్ ప్రత్యేకత.

ఆస్ట్రేలియా, సిడ్నీలో జరిగిన ఓ స్టార్టప్ సమావేశంలో ఓర్సీ, మార్టీలతో పరిచయం ఏర్పడింది పల్లవికి. భారతదేశ పెళ్ళిళ్లు చూడాలన్న తమ కోరికను ఆమెతో చెప్పారు. అప్పుడే మన దేశ పెళ్ళిళ్లపై ఓ అధ్యయనం నిర్వహించింది పల్లవి. మన దేశంలో స్తోమత లేకపోయినా సరే వివాహ ఖర్చుకు ఏమాత్రం వెనుకాడరట. ఇదే అంశాన్ని దృష్టిలో ఉంచుకుని, ఏడాదిన్నర క్రితం జాయిన్ మైవెడ్డింగ్.కామ్ పేరుతో వెబ్‌సైట్ ప్రారంభించింది పల్లవి. 'ఈ సైట్‌లోకి వెళ్ళి కాబోయే దంపతులు తమ వివరాలతోపాటు పెళ్ళి ఎక్కడ? తదితర వివరాలన్నీ తెలియజేయాలి. ఎంతమంది విదేశీయుల్ని ఆహ్వానించాలనుకుంటారో వివరించాలి. అలా రావాలనుకున్న విదేశీయుల నుంచి కొంత డబ్బును టికెట్ రూపంలో తీసుకుంటాం. ఆ డబ్బులో కొంత మొత్తాన్ని పెళ్లి చేసుకునేవారికి ఇస్తాం. విదేశీయుల్ని ఆ పెళ్ళిళ్ళకు తీసుకెళ్తాం. టికెట్టు ధరని కాబోయే వధూవరులే నిర్ణయించుకోవచ్చు. అయితే వచ్చే అతిథులకు మాత్రం ఉండటానికి కావాల్సిన విడిది సౌకర్యాలు, భోజనం ఏర్పాట్లూ తప్పనిసరి. ఒకవేళ పెళ్ళిలో ఏవైనా ఆచారాలు పాటించాల్సి వస్తే... అంటే ప్రత్యేక వస్త్ర ధారణ వంటివి ఉంటే ముందుగానే వివరించాలి...' అంటుంది పల్లవి. ఇప్పటివరకూ మరాఠీ, ముస్లిం, కన్నడ, మలయాళం, గుజరాతీ పెళ్ళిళ్ళకు దాదాపు మూడువందల మంది విదేశీయుల్ని తీసుకొచ్చింది పల్లవి. ఇలా చేసినందుకు జాయిన్‌మైవెడ్డింగ్ బృందం 15 శాతం రుసుముగా తీసుకుంటుంది. ఇప్పుడిప్పుడే ట్రావెల్ ఏజెన్సీలతో ఒప్పందాలు ఏర్పాటు చేసుకుంటున్నాం. భారీ ఎత్తున జరిగే వివాహ వేడుకల వివరాలు విదేశీయులకు అందించి, ఆసక్తి ఉన్నవారినే ఇక్కడకు తీసుకొస్తాం. అన్ని ఏర్పాట్లూ చేస్తాం...' అని చెబుతోంది పల్లవి.



నవ్య

# మెయిల్ బాక్స్

### కథలు బాగున్నాయి

నవ్య వీక్లీకి నూతన సంవత్సర శుభాకాంక్షలు. జనవరి 4వ తేదీ సంచికలో కథలు చాలా బాగున్నాయి. 'అమృతవర్షిణి' కథ సరసంగా అద్భుతంగా ఉంది. 'హరివిల్లు' కథ కుటుంబంలో మమతానురాగాల భార్యాభర్తల కథ. కనువిప్పు కలిగిస్తుంది. ప్రేమించి పెళ్ళిచేసుకున్న జంటలకు పెళ్ళయ్యాక కనిపించే లోపాలను భూతద్దంలోంచి చూస్తారు. ప్రతివారం నవ్యవీక్లీ చక్కటి కథలు అందిస్తోంది. చల్లాభాగ్యలక్ష్మిగారి కోటశ్రీనివాసరావు జీవిత కథ, హరనాథ్‌గారి సినిమా ఇంటర్వ్యూలకోసం వారం వారం ఎదురు చూస్తూ ఉంటాం.

-కోలపాక శ్రీనివాస్, బెల్లంపల్లి

### వెరైటీ ఇంటర్వ్యూలు

ముగ్గురు నటీమణులు జీవిత, శ్రద్ధాకపూర్, కంగనారనౌత్‌ల ఇంటర్వ్యూలు దేనికవే వెరైటీగా ఉన్నాయి. పెద్దలు మారాలి, మార్పు తెచ్చే చిత్రాలు నిర్మించాలి అని జీవిత చెప్పడం బాగుంది. సినిమా నేపథ్యంలేని కుటుంబం నుంచి వచ్చి 15 కోట్లు పారితోషికం అడిగే స్థాయికి కంగనా రనౌత్ ఎదగడం ఆషామాషీ విషయం కాదు. ఆమెను అభినందించాల్సిందే. ఇక శ్రద్ధాకపూర్ లతాజీని చూసి ఇన్‌స్పైర్ కావడం, పాటలు పాడటం అభినందనీయం.

-టి.ఉమామహేష్, హైదరాబాద్

### శీర్షికలు బాగు బాగు

జనవరి నాలుగవతేదీ సంచికలో శీర్షికలన్నీ బాగున్నాయి. 'ఇవన్నీ నిజాలే' శీర్షికద్వారా ఎన్నో విషయాలు తెలిశాయి. సినిమా నటుల ముఖచిత్రాలు చాలా అందంగా, నీట్‌గా చాలా బాగుంటున్నాయి. రివ్యూలో 'విలువైన కాలం వృథా', ఆరోగ్యమే మహాభాగ్యం శీర్షికలు బాగున్నాయి. అందరూ చదువుకునేవిధంగా చక్కని శీర్షికలు అందిస్తున్నారు.

-రాపర్ల లోకబాంధవ, మచిలీపట్నం

### సురభి సూపర్

పొంగల్ ప్రసాదం తినే శాకాహార మొసలి, బ్రహ్మచారులకు ఊరటనిచ్చే గ్రాఫిక్‌బొమ్మ ఇల్లాలు వంటి సురభిలో చెప్పిన అంశాలు ఆకట్టుకున్నాయి. అసెంబ్లీ, పార్లమెంటు సమావేశాలకు ఆటంకం కలిగించి చర్చలు జరగకుండా చేసే వారిని రాజ్యాంగ అధినేతలైన రాష్ట్రపతి, గవర్నరులు చొరవతీసుకుని హద్దుమీరిన సభ్యుల సౌకర్యాలు, వేతనాలు కట్ చేసేవిధంగా ప్రయత్నం చేయాలి. మనుషుల్ని 'దొంగలుకాని దొంగలు'గా మార్చే రుగ్మత గురించి ఆసక్తికరంగా చెప్పారు.

-శాంతిసమీర, వాకలపూడి, తూ.గో.జిల్లా

### బాయ్‌కాట్ అంటే మనిషి పేరా!

బాయ్‌కాట్ అనేది ఒక వ్యక్తి పేరని తెలుసుకుని ఆశ్చర్యపోయాం. హరివంశం ప్రారంభమైనందుకు చాలా సంతోషంగా ఉంది. జీవితమే ఒక ప్రతిఘటన ద్వారా కోట శ్రీనివాసరావుగారు తన సినీరంగ అనుభవాలను చక్కగా వివరిస్తున్నారు. 'ఆ నలుగురు' కథ బాగుంది.

-ఎస్.ప్రసాద్, చెన్నై

### ఆరంభమే అద్భుతం

విష్ణు కథ హరివంశం ప్రారంభం ఎంతో బాగుంది. నవ్య వీక్లీలో రామాయణ, మహాభారతం ఆధ్యాత్మిక కథలు సీరియల్స్‌గా అందిస్తున్న అరణిగారికి ధన్యవాదాలు. అన్ని శీర్షికలూ బాగుంటున్నాయి.




మేం ఎప్పుడూ వినని హరివంశం కథాక్రమం ఆరంభమే అద్భుతం.

సృష్టి వివరణ సంగ్రహంగానే అయినా అలరించింది. హరివంశం మాకొక మహావరం. ఎవరి కష్టాలు వారివిగానీ, ప్రతివాడూ ఎదుటివాడికి హాయిగా ఉన్నట్టు కనిపిస్తాడు. అందరికీ కష్టాలున్నాయన్న నగ్నసత్యాన్ని మొదటిపేజీలో గొప్పగా వివరించారు.

-వెంకట్రావు, విజయవాడ

-చంద్రిక, రాజేంద్రనగర్, తూ.గో.జిల్లా

### కనీవినీ ఎరుగం

రామాయణం పూర్తైన సందర్భంగా అరణిగారి కలం నుండి జాలువారిన 'హరివంశం' ప్రారంభంలోనే ఎంతో ఉత్కంఠభరితంగా సాగింది. ఎందరెందరివో కనీవినీ ఎరుగని పేర్లు తెలుసుకోగలిగాం. అందాల బొమ్మ, దివినుండి భువికి దిగివచ్చిన అప్సరసలాంటి ప్రణీత ఎంతో ఆకర్షణీయంగా ఉంది. వారం వారం కథలకోసం ఉవ్విళ్లూరుతుంటాం. సుహాసిని ఇంటర్వ్యూ ఎంతో హాయి గొలిపింది.

-పక్కి. బాలకృష్ణారావు, గాజువాక

### వీక్లీకి ఫేమ్ టీనేజ్‌ట్యూన్స్

భర్తగారి బాధ ఝలక్‌తో మార్నింగ్ కాఫీ అలరిస్తే, మనసు నలగని జీవితమే జీవితం అని మొదటిపేజీ నివేదించింది. 'నీడబ్బు-నాడబ్బు' కథాకర్త డి.వి.రమణిగారికి అభినందనలు. రాజశుక రివ్యూతో శతశాతం ఏకీభవిస్తున్నాం. మరో నవ్య వీక్లీ ఫేమ్ అనదగ్గ ధారావాహికం 'టీనేజ్‌ట్యూన్స్'గా చెప్పవచ్చు. సలోని చిరు ఇంటర్వ్యూ బాగుంది. వెట్టి సీరియల్ చదువుతుంటే అద్భుతమైన సినిమా చూస్తున్నామనిపిస్తోంది. స్టాలిన్ అసలు పేరు ఇవన్నీ నిజాలే ద్వారా తెలుసుకున్నాం.

-నేమాన సుభాష్‌చంద్రబోస్, విశాఖపట్నం

## ఆరోగ్యదాయకం అరిటాకు భోజనం

పూర్వం అరిటాకుల్లోనే భోజనాలు చేసేవారు. ఇప్పుడంటే రకరకాల మార్పులవల్ల చాలాచోట్ల తగ్గిపోయినా, ఇప్పటికీ కొందరు శుభకార్యాలకు అరిటాకే వాడుతున్నారు. కొన్ని హోటల్స్‌లో ఇప్పటికీ అరిటాకు భోజనమే. వండిన పదార్థాలకు రుచి తీసుకువచ్చే అరిటాకులో భోజనం చేయడంవల్ల రకరకాల ఆరోగ్య ప్రయోజనాలు ఉన్నాయి.

భారతీయ సంప్రదాయంలో ముఖ్యంగా దక్షిణాదిలో అరిటాకు భోజనం సహజం. అరిటాకు భోజనం మనకు అనాదిగా వస్తున్న ఆచారం. దీన్నొక సంప్రదాయంగా పాటిస్తారు. అరిటాకుపై వేడి వేడి అన్నం, పప్పు, నెయ్యి తదితర వంటకాలు వడ్డించుకుని భుజిస్తే ఆ రుచి వర్ణనాతీతం. అయితే అరిటాకుపైనే ఎందుకు వడ్డన? అని ప్రశ్నిస్తే అందుకు కారణాలు ఎన్నో. అవేంటో ఒకసారి చూద్దాం!

1. పచ్చటి అరిటాకులో వేడి వేడి ఆహారపదార్థాలు వడ్డించడంవల్ల ఆకుపైన ఉండే పొర కరిగి అన్నంలో కలుస్తుంది. దీనివల్ల భోజనానికి మంచిరుచి వస్తుంది.
2. ఈ ఆకులో అనేక రకాల పోషకాలు ఉంటాయి. వేడి పదార్థాలు ఆ ఆకుపైన పెట్టుకుని తిన్నప్పుడు ఆకులోని విటమిన్లు అన్నీ మనం తినే ఆహారంలో కలిసి మంచి పోషకాలను అందచేస్తాయి. వేడి వేడి పదార్థాలు అరిటాకులో తినడంవల్ల కఫ, వాతాలు తగ్గి శరీరానికి బలం చేకూరుతుంది, ఆరోగ్యం చక్కబడుతుంది. శరీరం కాంతిమంతమవుతుంది. ఆకలిపుడుతుంది. ఎన్నో రకాల జబ్బులను నిరోధించే శక్తి అరిటాకులో ఉండడం విశేషం.
3. రావి, మోదుగలాంటి ఆకులను ఎండబెట్టి విస్తర్లు తయారు చేస్తారు. కానీ భోజనానికి పచ్చి అరిటాకులనే ఉపయోగిస్తారు. అరిటాకుల్లో తినడంవల్ల ఆహారం త్వరగా జీర్ణమవుతుంది.
4. నల్లటి కురులను మనసొంతం చేస్తుంది అరిటాకు భోజనం. క్రమం తప్పకుండా 'అరిటాకుల్లో భోజనం' చేస్తే బూడిదజుట్టుతో ఉన్నవారు నల్లనిజుట్టు పొందుతారు.



5. కేరళలో కొన్ని ఇడ్లీలు, కొన్ని రకాల నాన్‌వెజ్ వంటలు అరిటాకుల్లోనే వండుతారు. అన్ని విటమిన్లూ అందడంవల్ల శరీరం ఆరోగ్యంగా ఉంటుంది. పైగా ఇది పర్యావరణ హితం కూడా!
6. ఆకలితో ఉన్నప్పుడు శత్రువుకైనాసరే అన్నంపెట్టే సంస్కృతి మనది. అలా శత్రువుకి భోజనం పెట్టినప్పుడు అన్నంలో విషం కలిపారన్న భయం ఉంటుంది. అదే అరిటాకులో భోజనం పెట్టినప్పుడు, ఒకవేళ విషాహారం పెడితే, అరిటాకు నల్లగా మారిపోతుంది. అన్నంలో విషం ఉందని బహిర్గతమైపోతుంది.
7. అరిటాకుల్లో పాలీఫినాల్స్ ఉంటాయి. ఇవి ఎక్కువగా యాంటీ ఆక్సిడెంట్స్‌ను కలిగి ఉంటాయి. వీటిపై వేడివేడి పదార్థాలు వడ్డిస్తే ఇవి కూడా భోజనంలో కలిసిపోతాయి. దీనివల్ల శరీరానికి పోషకాలు అందుతాయి.
8. ఏదైనా పదార్థంలో ఉప్పు ఎక్కువైతే, దాన్ని తినలేక బైటపడేయకండి. ఉప్పు ఎక్కువైన పదార్థం ఉన్న ఆ పాత్ర మూత తీసి ఆ స్థానంలో అరిటాకును పళ్లెంలాగా బోర్లించాలి. అలా కొంచెంసేపు పొయ్యిమీద పెట్టి ఆ పదార్థాన్ని వేడిచేయడంవల్ల అందులోని ఉప్పుశాతం తగ్గి రుచిగా తయారవుతుంది.
9. అరటి ఆరోగ్య ప్రదాయిని. అరటిమొక్కలోని అన్ని భాగాలను అనేక రకాలుగా ఉపయోగిస్తారు. పువ్వును వంటల్లో ఉపయోగిస్తారు. అరటిపండులోని పొటాషియం శరీర కండరాలను ఆరోగ్యంగా ఉంచుతుంది. శరీరానికి శక్తిని ఇస్తుంది.



# సంక్రాంతి వచ్చిందే తుమ్మెదా! సరదాలు తెచ్చిందే తుమ్మెదా!

దట్టమైన పొగమంచువేళ
గొబ్బిళ్లు, రంగవల్లికలు
పసుపుగడపల శోభతో ఆహ్వానం పలికే వాకిళ్లు
గజగజ వణకే చలిలో ఎగిసిపడే భోగిమంటలు
హరిదాసుల కీర్తనలు గోవిందనామస్మరణలు
పిల్లల గారాలు, గంగిరెద్దులు, బూరాలు...!
బసవన్నల నాట్యాలు, దక్షిణలు ఆశీర్వాదాలే
పొద్దుపొడుపున మన సంక్రాంతి పల్లెల సోయగాలు

తలంట్ల సందళ్లు
వేడినీటి బిందెల్లో చెంబుల చప్పుళ్లు..
పొంగలి నైవేద్యాలు, కొత్త దుస్తుల రెపరెపలు
కొత్త పంటలతో దేవునికి నైవేద్యాలు
కొత్త అల్లుళ్ల అలకలు, కోడి పందాలు
అన్నింటా సంతోషమే. అంతటా ఆనందమే.

సంక్రాతి పండుగ వచ్చిందంటే చాలు ప్రతి ఇల్లు ఇలా కళకళలాడిపోతుంది. అందరూ ఒక చోటచేరి సంతోషాలు కలబోసుకునే పండుగ. భారతీయ సంస్కృతిలో ఎన్నో పండుగలున్నా ఎంతో విశేషం సంతరించుకున్న పర్వదినమిదే.

ప్రకృతితో మమేకం కావడమే మన పండుగల లక్ష్యం. అటువంటిదే సంక్రాంతి. ప్రకృతితో సహ జీవనం చేసే మనిషి చేసుకునే అసలైన పెద్ద పండుగ. ఏడాదిలో ఎన్ని పండుగలు వచ్చినా ఇంటికి ధాన్యరాశులు, సిరులు తెచ్చే అసలు సిసలు పెద్ద పండుగ ఇదే!

దసరా, దీపావళి తర్వాత తెలుగువారు ఘనంగా చేసుకునే సంక్రాంతి పర్వదిన విశిష్టత తెలుసుకుందాం!

## నెల ముందుగానే...

'సంక్రాంతౌ యాని దత్తాని హవ్య కావ్యాని దాత్రుభిః
తాని నిత్యం దదాతార్యం పునర్జన్మని జన్మని

సంక్రాంతి పండుగ ప్రాశస్త్యాన్ని తెలియజేసే స్కంధపురాణ శ్లోకమిది. ఈ పర్వదినాన దాన ధర్మాలు చేస్తే జన్మరాహిత్యం కలుగుతుందని ఈ శ్లోక భావం. సంక్రాంతి పండుగ సంబరాలు నెల రోజులు ముందుగానే ప్రారంభమవుతాయి. పవిత్ర మైన ధనుర్మాస ఆరంభంతో సంక్రాంతిశోభ సంత రించుకుంటుంది. ఉదయమే నిద్రలేచి ఇంటిముందు రంగవల్లులు తీర్చిదిద్ది గొబ్బెమ్మలను అలంకరిం చడం, పాశురా ఆలాపన, నైవేద్యాలతోనే ధనుర్మాస వ్రతారంభం. నెలరోజులు వైభవంగాసాగే శోభ, ముచ్చటైన మూడురోజుల పండుగే ఈ సంక్రాంతి. తొలినాడు భోగి, మరునాడు సంక్రాంతి, ఆ మర్నాడు కనుమ. కొన్నిచోట్ల ముక్కనుమతో కలిపి నాలుగు రోజులు ఈ పండుగ చేసుకుంటారు.

## ఉత్తరాయణ పుణ్యకాలం

సూర్యుడు మకరరాశిలోకి ప్రవేశించే కాలమే మకర సంక్రమణం. ఈరోజు నుండే ఉత్తరాయణ పుణ్యకాలం ప్రారంభం అవుతుంది. ఆ తర్వాత కుంభ, మీన, మేష, వృషభ, మిథున రాశులలో కొనసాగినంత కాలం ఉత్తరాయణం. శారీరక పరి శ్రమకు, పూజలకు, సాధనలకు అనువైన సమయం. కర్కాటక రాశిలోకి సూర్యుడు ప్రవేశించింది మొదలు, సింహ, కన్య, తుల, వృశ్చిక, ధనూరాశులలోకి మారుతూ కొనసాగినంతకాలమూ దక్షిణాయణమే. మానసిక అర్చనకు, ధ్యానానికి, యోగదీక్షలు, బ్రహ్మచర్యం, నియమనిష్టలకు అనువైన కాలం. పన్నెండు నెలల్లో ఆరు నెలల దక్షిణాయణకాలం దేవతలకు ఒకరాత్రి, మిగిలిన ఆరునెలల ఉత్త

### విశిష్టతలకు ప్రతీక

*మూడురోజుల సంక్రాంతి పర్వదినం విశి ష్టతలకు ప్రతీక. భూమిపైన పరమాత్ముడు ధర్మస్థాపన జరిపింది ఈరోజే. శ్రీమహావిష్ణువు మంథర పర్వతం కింద అసురులను మట్టు బెట్టిందీ ఈరోజే. కపిల మహర్షి శాపగ్రస్తులైన సగరపుత్రులను బతికించేందుకు భగీరథుడు తపస్సుచేసి, గంగను దివి నుండి భువికి తెచ్చింది కూడా ఈ పర్వదినానే!*

**సంక్రాంతి పండుగనాడు చేసే ప్రతిపని వెనుక ఒక ఆసక్తికరమైన ఆధ్యాత్మిక అంశం ముడిపడి ఉంది. అదేంటో తెలుసుకుందాం!**

### రంగవల్లికలు

అలికిన నేల మేఘాలులేని ఆకాశానికి సంకేతం. ఒక పద్ధతి ప్రకారం పెట్టిన చుక్కలు రాత్రివేళ కనిపించే నక్షత్రాలకు సంకేతం. చుక్కల చుట్టూ తిరుగుతూ చుక్కలను గళ్లలో ఇమిడ్చే ముగ్గు ఖగోళంలో ఎప్పటికప్పుడు కనిపించే మార్పులకు సంకేతం. ఎంత పెద్ద ముగ్గైనా చిన్న ముగ్గైనా మధ్యగడిలో పెట్టే చుక్క సూర్య స్థానానికి సంకేతం. ఇలా ముగ్గులలో తాత్వికత, ఆధ్యాత్మికత, శాస్త్రీయత దాగి ఉంది. ఇక మూడు రోజులతో పూర్తవుతూ అందరికీ ఆనందాన్ని పంచే సంక్రాంతి పండుగను ఘనంగా సాగనంపేందుకు పుట్టినదే రథం ముగ్గు. అందరూ ఒకరికి ఒకరు తోడుంటూ కలిసి సహజీవనం సాగించాలి అనే సంకేతాలతో ఒక రథం ముగ్గు తాడును ఇరుగుపొరుగు ఇళ్ళ ముంగిటవేసిన రథం ముగ్గులతో అనుసంధానం చేస్తూ పొలిమేరల వరకు తీసుకువెళతారు.

### గొబ్బెమ్మలు

పెద్ద వయసు స్త్రీలు ముగ్గులు పెడుతుంటే చిన్న వయసు ఆడపిల్లలు ఆవుపేడతో తయారు చేసే గొబ్బెమ్మలు, కృష్ణుని భక్తులైన గోపికలకు సంకేతం. గోపీ+బొమ్మ వెరసి గొబ్బెమ్మ. దీన్నే సందె గొబ్బెమ్మలు అంటారు. ఈగొబ్బెమ్మల మధ్య ఉండే పెద్ద గొబ్బెమ్మ గోదాదేవికి సంకేతం. సంక్రాంతి రోజులలో ఈ గొబ్బెమ్మల చుట్టూ తిరుగుతూ పాటలు పాడుతూ నృత్యం చేసే బాలికలంతా తమకూ కృష్ణభక్తి కలగాలని ప్రార్థిస్తూ ఉంటారు. మనసుకి నచ్చినవాడు భర్తగా రావాలని ప్రార్థిస్తారు.

చీమలు మొదలైన జీవులకు ఈ గొబ్బెమ్మలపై జల్లే నవధాన్యాలే ఆహారంగా ఉపయోగిస్తాయి. పిపీలకం మొదలు బ్రహ్మాండం వరకు సర్వత్రా సుభిక్షంగా ఉండాలనేదే దీని తాత్పర్యం.







### భోగిపండ్లు

భోగినాడు పిల్లలందరికీ దిష్టి తగలకుండా సాయంత్రం భోగిపండ్లు పోస్తారు. భోగిపండ్లు అంటే రేగుపండ్లు. సంస్కృతంలో అర్కఫలం అంటారు. సూర్యుడికి ప్రీతికరమైన ఫలం. సూర్యుని రూపం రంగు పేరు కలిగిన రేగుపండ్లతో నాణాలను కలిపి పిల్లల తలపై పోస్తారు. సూర్యభగవానుడి అనుగ్రహంతో పిల్లలకు ఆరోగ్యం చేకూరాలనేదే భోగిపండ్ల ముచ్చట.

### గంగిరెద్దులు, హరిదాసులు

ముందు వెనకల చెరో ప్రమునితో ఎత్తైన మూపురం కలిగి శివలింగాకృతిని గుర్తుచేస్తూ ఉండే గంగిరెద్దు ఇంటిముందు వేసిన ముగ్గులో నిలిచిందంటే ఆ నేల ధర్మబద్ధమైనదనే అర్థం. **'జగోప గోరూప ధరామివోర్వీం'** అంటే, ఆ నేల ఆవుకి సంకేతం, ఆ నేల నుంచి వచ్చిన పంటకు సంకేతం. మనం చేసే దానం ధర్మబద్ధమేనని, దాన్ని మేము ఆమోదిస్తున్నామని చెప్పడానికి సంకేతమే ఇంటి ముంగిట నిలిచిన వృషభం.

హరిదాసులు సాక్షాత్తూ విష్ణుస్వరూపులు. గుమ్మడికాయ ఆకారంలో హరిదాసు తలమీది పాత్ర భూగోళానికి చిహ్నం. దాన్ని తలమీద మోయడం ఆ శ్రీహరే ఈ భూమిని ఉద్ధరిస్తున్నాడని చెప్పడానికి చిహ్నం. తను ఏ భోగాలకూ లొంగననీ, హరినామ సంకీర్తనకే దాసుడననీ, హరిభక్తికి తరతమ భేదాలు లేవనీ చాటిచెప్పడమే పల్లెలో హరినామ సంకీర్తనచేస్తూ ఇంటింటికీ తిరగడం వెనుక దాగున్న ఆధ్యాత్మిక రహస్యం.

రాయణ సమయం దేవతలకు ఒక పగలు. దేవతలు మేల్కొనేది ఉత్తరాయణ పుణ్యకాలంలోనే. కనుకనే మహాభారతంలో భీష్మాచార్యుడు ఎదురు తెన్నులతో ఉత్తరాయణం ప్రవేశించిన తర్వాతే తనువు చాలించాడు. ఈరోజు స్వర్గద్వారాలు తెరిచే ఉంటాయని అంటుంటారు.

### భోగభాగ్యాల భోగి

ఏడాదికాలం కష్టపడిన రైతు పండినపంటతో ఆనందం అనుభవిస్తాడు. భోగ అన్న పదమే భోగిగా రూపాంతరం చెందిందంటారు. దక్షిణాయణంలో చివరిరోజు భోగి. ఆ తెల్లారి ఉత్తరాయణం ప్రారంభం. మనలోని చెడును మంటల్లో దహనంచేసి సజీవ తత్వాన్ని గ్రహించి అగ్నివలే ప్రకాశవంతంగా వెలగాలనే పరమార్థాన్ని తెలియజేస్తుంది భోగి. అందుకే ఈరోజు కూడలి ప్రాంతాల్లో, ఇళ్ల ముందు భోగిమంటల్లో పాత వస్తువులు దహనం చేస్తారు. భోగిరోజు తలస్నానం చేసి రంగవల్లులు తీర్చిదిద్ది, గొబ్బెమ్మలు పెట్టి సంక్రాంతి పురుషుణ్ణి ఆహ్వానిస్తారు. కొత్త కుండలో కొత్తబియ్యం, కొత్తబెల్లం, పాలు, నెయ్యితో కలిపి ప్రసాదం చేసి వండిన అన్నాన్ని సూర్యుడికి నివేదన చేస్తారు. సాయంత్రం పిల్లలకు దిష్టి దోషాలు పోవాలని భోగిపళ్లు పోస్తారు. అలాగే కన్నెపిల్లలు గొబ్బెమ్మల చుట్టూ చేరి మంచి భర్త రావాలని కోరుకుంటూ ఆటలు ఆడతారు. బొమ్మల కొలువు పెడతారు. సాయంత్రం శ్రీగోదారంగనాయకుల వివాహం చేస్తారు.

### మార్పు తెచ్చే మకర సంక్రాంతి

సంక్రాంతి పండుగను వివిధ ప్రాంతాలవారు వివిధ రకాలుగా జరుపుకుంటారు. హరిదాసులతో, గంగిరెద్దు ఆటల ఆహ్లాదం, రంగవల్లుల హడావుడి అంతటా ఒక్కలాగే చేసుకుంటారు. దీన్ని మకర సంక్రాంతి అంటారు. మకరం అంటే మొసలి. దానిపట్టు చాలా గట్టిగా ఉంటుంది. ఐహిక బంధాలన్నీ మొసలిలా పట్టుకుని ఉంటాయి. మనిషిని ఆధ్యాత్మిక మార్గంలోకి వెళ్లకుండా అడ్డుపడే ఐహిక బంధాలివి. వీటిని తప్పించుకునే ఏకైక మార్గం దానధర్మాలే. అందుకే మకర సంక్రాంతి నాడు దాన ధర్మాలు చేయాలనేది శాస్త్రవచనం. పితృదేవతలకు తర్పణాలు ఇస్తారు. ఉత్తరాయణం పితృదేవతలకి ఆరాధనా కాలం. శాస్త్ర ప్రకారం ప్రతి సంక్రమణానికి పితృదేవతలకు తర్పణాలు ఇవ్వాలి. కానీ మిగతా పదకొండు సంక్రమణాల్లో చేయకపోయినా, మకరసంక్రమణం రోజు మాత్రం పితృదేవతలకు తర్పణాలు ఇవ్వాలి. ఈరోజు చేసే అరిసెలు పితృదేవతలకి ఏడాదికి సరిపడే భక్ష్యమని విశ్వాసం.

### మకరజ్యోతి

శబరిమలైలో మకరసంక్రాంతినాడే అయ్యప్ప స్వామి మూడుసార్లు జ్యోతిస్వరూపునిగా దర్శనమిస్తాడు. పొన్నంబలమేడులో తూర్పు దిక్కున జ్యోతిరూపంలో స్వామి సాక్షాత్కరిస్తాడని భక్తుల విశ్వాసం. సంక్రాంతికి రెండు రోజుల ముందునుంచే మకరవిళక్కు మొదలవుతుంది. అప్పటివరకు మాల వేసుకుని నియమనిష్ఠలతో ఉండే స్వాములు మకర జ్యోతి దర్శనంతో దీక్షవిరమణ చేస్తారు.

### కనువిందు చేసే కనుమ

సంక్రాంతి మరునాడు కనుమ. ఏడాదంతా శ్రమించిన మూగజీవాలకు రైతులు రుణం తీర్చుకునేరోజు కనుమ. చేతికందిన పంటను తమతో పాటు, పశువులూ, పక్షులు కూడా పంచుకోవాలని పిట్టల కోసం ధాన్యపు కంకులు గుమ్మానికి అలంకరిస్తారు. రకరకాల వంటలతో గ్రామదేవతలకు నైవేద్యాలు నివేదిస్తారు. పశువులను పూజించి, వాటికి కడుపునిండుగా మేతపెట్టి విశ్రాంతినిస్తారు. కొన్నిచోట్ల వ్యవసాయ పనిముట్లను పూజిస్తారు.

-గోవిందరావు శర్మ

# జో లాలీ పాపా

-సలీం

**విజయవాడ నుంచి బదిలీ అయి రాజమండ్రి ఆఫీస్‌లో చేరాడు ప్రభాకర్. అతను తమ ఆఫీస్‌కి అధికారిగా వస్తున్నాడని తెలిసిన క్షణం నుంచే అతనికి సంబంధించిన వివరాలు కూపీ లాగటం మొదలుపెట్టాడు రవికుమార్. అతను అదే ఆఫీస్‌లో సీనియర్ అసిస్టెంట్. గత పదేళ్లుగా అక్కడే పాతుకుపోయి బదిలీ ఉత్తర్వులు రాకుండా పెద్దవాళ్లని మేనేజ్ చేసుకుంటున్న ఘనుడు. అధికారుల్ని ఎలా తన బుట్టలో వేసుకోవాలో అతనికి బాగా తెలిసిన విద్య. రవికుమార్ మొదట తెలుసుకునేది అధికారుల బలహీనతల్నే. ఒక్కసారి ఆ బలహీనతలేమిటో సమాచారం తెలిస్తేచాలు, ఇక వారితో ఆడుకుని తన పబ్బం గడుపుకుంటాడు.**

విజయవాడలో ప్రభాకర్ దగ్గర పనిచేసిన సిబ్బందిలో ఒకతనితో మాట్లాడి చాలా సమాచారం కనుక్కున్నాడు. వయసు ముప్పయ్ దాటుతున్నా ప్రభాకర్‌కి ఇంకా పెళ్లి కాలేదు. చాలా మంచివాడు. సౌమ్యుడు. పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షలు రాసి నేరుగా ఉన్నతోద్యోగం సంపాదించాడు. దురలవాట్లు ఏమీలేవు. ధూమపానం చేసేవాళ్లన్నా గిట్టదు. తాగడు. తిండిమీద కూడా ధ్యాసలేని వ్యక్తి. హోటళ్లకు వెళ్లడు. ఇంట్లో తనే వంట చేసుకుంటాడు. పూర్తి శాకాహారి. మితభాషి.

వినీవినీ రవికుమార్‌కి చిరాకేసి "సకల గుణాభిరాముడా? పొగిడింది చాలుగానీ అతని వీక్ పాయింట్ చెప్పు" అన్నాడు.

'ఒక్కటే ఉంది. చంద్రుడిలో మచ్చలా. రాముడు కాదు కృష్ణుడే' అన్నాడతను. రవికుమార్ ఈల వేసి 'ఇది చాలు, ఉచ్చులో బిగించడానికి. ఆఫీస్‌లో పనిచేసే అమ్మాయిల్ని బతకనీయడా?' అడిగాడు.

"అసలు కన్నెత్తికూడా చూడడు. చాలా గౌరవంగా మాట్లాడతాడు. స్వంత అక్కలో చెల్లెళ్లో అన్నట్టుగా ప్రవర్తిస్తాడు".

'ఓహో! ఆఫీస్‌లో రామయ్య, బైటికెళ్తే కిష్టయ్య అన్నమాట. కాలేజీ అమ్మాయిలతో ప్రేమ కలాపాలు సాగించి పబ్బం గడుపుకునే రకమన్న మాట'.

'వాళ్ళ జోలికి కూడా పోడు. వేశ్యల దగ్గరకు వెళ్తాడు. రోజుకొక వెరైటీ కోరుకుంటాడు'. అంత పెద్ద అధికారి వేశ్యాలోలుడా! ఖర్మరా బాబూ అనుకున్నాడు రవికుమార్.



ప్రభాకర్ ఫోన్ నంబర్ తీసుకుని అతను రాజమండ్రికి రాకముందే శుభాకాంక్షలు తెలియజేసి పరిచయం చేసుకున్నాడు. 'మీ

> **ఆ ఆఫీసర్‌కి అమ్మాయిల వీక్నెస్. ఆ విషయం కనిపెట్టాడు కింది అధికారి. తన పబ్బం గడుపుకునేందుకు మెల్లిగా వేశ్యల్ని అతడి పడకగదికి పంపేవాడు. అతని డిమాండ్లు వింటుంటే కింది అధికారికి పిచ్చెక్కిపోయేది. తన అధికారికి మగతనం లేదేమో? అనే సందేహం కలిగింది. నిజం తెలుసుకునేందుకు ఒక ఉపాయం పన్నాడు. మరి అతను నిజం తెలుసుకున్నాడా? ఇంతకీ ఆ పడక గదిలో ఏం జరుగుతోంది?**

కోసం మంచి ఫ్లాట్ చూసి పెట్టాను సార్. ఓనర్ మనకు బాగా తెలిసినవ్యక్తే. అద్దె కూడా తక్కువే' అన్నాడు. ప్రభాకర్ రైల్లోంచి దిగంగానే గులాబీ పూలగుచ్ఛంతో స్వాగతం పలికాడు. 'కార్లో రాలేక పోయారా సార్. మూడు గంటల ప్రయాణం. సుఖంగా ఉండేదిగా' అన్నాడు. 'భేషజాలకుపోయి డబ్బులు దుబారా చేయటం నాకు ఇష్టం ఉండదు' అన్నాడు ప్రభాకర్. 'అవునా సారూ... అమ్మాయిల కోసం డబ్బులు వెదజల్లటం మాత్రం దుబారా కాదా?' తన మనసులో అనుకున్నాడు రవికుమార్.

సామాన్లు సర్దటంలో, ఇంటికి అవసరమైన సామగ్రి కొనటంలో సాయపడ్డాడు. అతనిది స్వయం పాకం కాబట్టి గ్యాస్ కనెక్షన్ ఇప్పించడం, కూర గాయలు కొనిపెట్టటం, పనిమనిషిని చూసిపెట్టటం లాంటి వ్యవహారాలన్నీ తనే చూసుకున్నాడు. వారం తిరక్కుండానే ప్రభాకర్‌కి ఆప్తుడైపోయాడు రవికుమార్.

శుక్రవారం సాయంత్రం ఆఫీస్ సమయం ఇంకో అరగంటలో ముగుస్తుందనగా ప్రభాకర్ క్యాబిన్లోకి వెళ్లి చేతులు నలుపుకుంటూ కూచు న్నాడు.

'ఏదో చెప్పాలనుకుని సంశయిస్తున్నట్టున్నారు. పర్లేదు చెప్పండి. ఈ ఊరు నాకు కొత్త. ఇక్కడ మీకన్నా నాకు శ్రేయోభిలాషులు ఎవరున్నారు?' అన్నాడు ప్రభాకర్.

'మీరు కోపం తెచ్చుకోనంటే చెప్తాను సార్' అన్నాడు రవికుమార్. 'నాకు కోపం ఎప్పుడూ రాదు. ఎవరిమీదా రాదు. ధైర్యంగా చెప్పండి'. 'రేపూ ఎల్లుండీ సెలవులు కదా. మీకు బోర్ కొట్టకుండా రాత్రికి ఏమైనా ప్రోగ్రాం ఏర్పాటు చేద్దామను కుంటున్నా" ఆ ప్రోగ్రాం ఎలాంటిదో అతనికి అర్థ మయ్యేలా గొంతు తగ్గించి మెల్లగా రహస్యం చెప్తున్నట్టు చెప్పాడు.

"సరే మీ ఇష్టం" నవ్వుతూ అన్నాడు ప్రభా కర్. చేప గాలానికి తగిలిందని రవికుమార్‌కి అర్థమైపోయింది. ఉత్సాహంగాలేచి "రాత్రి తొమ్మిది కల్లా భోజనం చేసి రెడీగా ఉండండి. నేనొచ్చి పిల్చుకెళ్తాను" అన్నాడు.

తొమ్మిది కావడానికి పదినిమిషాల ముందే ప్రభాకర్ ముందు వాలి పోయి "వెళ్దామా" అన్నాడు.

"మొదట ఎక్కడికో చెప్పండి. నాకు నచ్చా లిగా" అన్నాడు ప్రభాకర్.

రవికుమార్ తన మొబైల్లో వాట్సప్ తెరిచి ఒకమ్మాయి ఫోటో చూపించాడు. "పద్దెనిమిదేళ్లు. రెండు మూడు టీవీ సీరియల్స్‌లో కూడా యాక్ట్ చేసింది. ఒక్కరాత్రికి యాభైకి తక్కువ తీసుకోదు. మనకు బాగా తెలిసిన అమ్మాయే. పాతిక్కి బేరం చేశా" అన్నాడు, ఘనకార్యమేదో సాధించినట్టు.

"వద్దు" అన్నాడు పెదవి విరుస్తూ ప్రభాకర్. "అదేంటిసార్. రాజమండ్రిలో నంబర్ వన్ కాల్ గర్ల్ ఈ అమ్మాయే. చాలా అందంగా ఉంటుంది. ఫోటోలోకన్నా బావుంటుంది. సన్నగా నాజూగ్గా... నేను గ్యారెంటీ సార్" అన్నాడు. "అందంగా ఉంది. వయసులోనూ ఉంది. నిజమే. అయినా నాకొద్దు. తక్కువలో చూడండి".

'డబ్బుల విషయం నాకొది లేయండి సార్, నేను చూసుకుంటాను.'

"అవసరం లేదు. నా దగ్గర డబ్బులున్నాయి".

రవికుమార్ మరో ఫోటో చూపించాడు. వయసు పాతిక్కి దగ్గరగా ఉంటుంది. చూడటానికి అందం గానే ఉంది. "పదిహేను వేలు" అన్నాడు.

"నాకు చాలా తక్కువలో కావాలి. రెండు వేలకు మించకూడదు. వెయ్యి ఐదొందలైనా పర్లేదు. వయసు ఎంతైనా పర్లేదు. ముప్ఫైపైన ఉంటే మరీ మంచిది. నలభై అయినా ఓకే".

రవికుమార్‌కి అతన్ని ఎలా అర్థం చేసు కోవాలో తెలియలేదు. చేసేది చాలా పెద్ద ఉద్యోగం. నెలకు లక్షరూపాయలు జీతం. లంచాలు ముట్ట డని పేరుందిగానీ అవే గనుక తీసుకుంటే లక్షలకు లక్షలు ఆదాయం వచ్చే ఉద్యోగం. మరి ఇంత కక్కుర్తి ఏమిటి? వయసు ఎంతైనా పర్లేదంటా డేమిటి? ఏదైనా మానసికమైన జబ్బుందేమో... వయసులో తనకంటే పెద్దవాళ్ల మీద మోజు. ఇలాంటి జబ్బులు కూడా ఉంటాయా? ఏదేమైనా అతను తన బాస్ కాబట్టి మారు మాట్లాడ కుండా అతను చెప్పినట్టే చేయడానికి నిర్ణయించు కున్నాడు.

"సార్ నాదో మనవి. అలాంటివాళ్లూ ఉంటారు. కానీ మురికి కూపాల్లాంటి ఆ గదుల్లోకి మీరు వెళ్లటం మంచిది కాదు. మీ స్థాయికి తగనిచోట్లు అవన్నీ. ఇక్కడికే పిల్చుకొస్తాను" అన్నాడు.

ఓ గంటలోపల ఒకావిణ్ణి వెంటపెట్టుకుని వచ్చాడు. వయసు ముప్ఫయ్‌కి దగ్గరగా ఉంటుంది. చామనచాయ. సన్నగానే ఉంది. "పేరు రేఖ. ఉదయం ఐదింటికి వెళ్లిపోతుంది. రెండువేలు ఇవ్వండి చాలు" అనేసి రవికుమార్ వెళ్లిపోయాడు. "అన్నం తిన్నావా?" అడిగాడామెని. తిన్నానంది. అతని ఎదురుగా కుర్చీలో కూచుంది.

"ఇంట్లో బంగాళదుంప కూర ఉంది. నీ కోసం రెండు చపాతీలు చేసి తెస్తాను. తిందువు గానీ" అన్నాడు. ఆమె వద్దని వారించినా కిచెన్లోకి వెళ్లి ఆమె కోసం రెండు చపాతీలు కూడా తెచ్చి చ్చాడు.

ఆమె మెల్లగా తల వంచుకుని తింటోంది. "పిల్లలా?" అడిగాడు. కొద్దిగా సిగ్గుపడుతూ "ముగ్గురు" అంది.

"మీ ఆయన?"

"లేదు. మూడేళ్ల క్రితం వదిలేసి వెళ్లిపోయాడు. అప్పటినుంచీ ఇలా.." అంది.

అన్నం తినొచ్చానని చెప్పిందికానీ రెండు చపాతీలు తినేసి గ్లాసెడు మంచినీళ్లు తాగటం చూస్తే అబద్ధం చెప్పిందని తెలిసిపోతోంది అను కున్నాడతను.

"నెలకు ఎన్ని బేరాలు తగుల్తాయి?"

"ఐదారు బేరాలు మించి తగిలితే గొప్ప"

ఆ తర్వాత చాలాసేపటివరకు ఇద్దరూ మాట్లాడు కోలేదు. ఆమె ఆవులించింది. "నిద్రొస్తోందా?" అన్నాడు. ఆమె ఆవులించినందుకు సిగ్గుపడుతూ "లేదు" అంది.

"నిద్ర ఆపుకోకూడదు. ఆరోగ్యానికి మంచిది కాదు. వచ్చిపడుకో" అన్నాడు మంచం చూపిస్తూ.

అతను ఎందుకు పిలుస్తున్నాడో అర్థమై ఆమె నవ్వుకుంటూ వచ్చి మంచం మీద పడుకుంది. అతను లైటార్పే ముందు ఆమె చేతిలో పదివేల రూపాయలు పెట్టాడు. ఆమె ఆశ్చర్యంగా అతని వైపు చూస్తూ "రెండు వేలే" అంది.

"నాకు గుర్తుంది. మిగతా ఎనిమిది వేలు నీ పిల్లలకు నేనిచ్చే కానుక" అన్నాడు. ఆమె పక్కన పడుకుని పైన చేయివేసి "ప్రశాంతంగా నిద్రపో. నాకూ నిద్రొస్తోంది" అన్నాడు.

•••

రవికుమార్‌కి ప్రభాకర్ ఓ పజిల్‌లా మారాడు. ఎన్నిసార్లు మంచి యవ్వనంలో ఉన్న ఆడపిల్లల్ని ఏర్పాటు చేస్తానన్నా వద్దంటున్నాడు. ముదిమి వయసు స్త్రీలే కావాలంటాడు. ఐదొందలూ వెయ్యి రూపాయలు రేటున్న వాళ్లనే కోరుకునేం తగా దిగజారిపోయాడు. మిగతా విషయాల్లో మాత్రం మహాత్ముడికేమీ తీసిపోడు. ఆదర్శాల్ని తన కింది సిబ్బందికి బోధించడమే కాదు, ఆచర ణలో కూడా పెట్టాడు.

ఓ రోజు బజార్లో రేఖ కనిపించింది. "మళ్లీ



సార్‌గారు పిలిస్తే చెప్పండి" అంది. ఆంతరంగిక రహస్యాలు పడగ్గదిలో ఆడవాళ్ళకే తెలుస్తాయి కాబట్టి ఆ అవకాశం జారవిడవదల్చుకోలేదు.

"ఆయన దగ్గరకే ఎందుకు? ఏమిటంత స్పెషల్? రసికాగ్రేసరుడా" అన్నాడు.

"చాలా మంచివాడు సార్" అంది.

"అది నాకు తెలుసులే. ఆ రాత్రి ఏమేం చేశాడో చెప్పు?"

"ఏమీ చేయలేదు"

ఆ మాట విని రవికుమార్ చాలా ఆశ్చర్య పోయాడు. "ఏమీ చేయలేదా? వివరంగా చెప్పు" అన్నాడు.

అతను పదివేలిచ్చిన విషయం మాత్రం దాచిపెట్టి ఆ రోజు జరిగిన విషయం చెప్పింది.

రవికుమార్ ఆలోచనల్లో పడ్డాడు. అతన్లో కుతూహలం... ప్రభాకర్ కోసం తను ఏర్పాటు చేసిన మరో ఇద్దరు స్త్రీలను కూడా అడిగాడు. వాళ్లూ అదే అనుభవం చెప్పారు. అతనిలో సన్నటి పాయలా మొదలైన ఓ అనుమానం. ప్రభాకర్‌కి మగతనం లేదా? అందుకేనా పెళ్లి చేసుకోలేదు?

అతనికి వెంటనే మదిలో మాధవి మెదిలింది. పాతికేళ్లకు మించని వయసు. మంచి పొడగరి.... విశాలమైన కళ్లు ఆమె అందాన్ని ద్విగుణీకృతం చేస్తుంటాయి. అన్నింటికీమించి మంచి మాటకారి. దానికి తోడు తెలివిగలది. మాధవిని చూస్తే అతనికి కన్యాశుల్కంలో మధురవాణి గుర్తొస్తుంది. ఈ రహస్యం ఛేదించాలంటే ఆమెను ప్రయోగించక తప్పదనుకున్నాడు.

మరుసటి వారాంతంలో ఆమె విషయం ప్రస్తావించాడు. ప్రభాకర్ వద్దనక ముందే "చాలా కష్టాల్లో ఉంది సార్. మీలాంటివాళ్లు ఆదుకోకపోతే ఎలా బతుకుతుంది? మీరు వెయ్యి రూపాయలిచ్చినా చాలుసార్. తన కొడుక్కి కడుపు నిండా అన్నం పెట్టిన వాళ్లవుతారు" అన్నాడు.

అతను ఊహించినట్టే ప్రభాకర్ లొంగిపోయాడు.

మాధవిని పిల్చుకెళ్లి ప్రభాకర్ దగ్గర వదిలేసే ముందు ఆమెతో స్పష్టంగా చెప్పాడు. సార్‌గారు ఏమీ చేయకుండా ఎందుకు పడుకోమని చెప్తారో కనుక్కోవాలని.

"బాబుకి ఎన్నేళ్లు?" అని అడిగాడు ప్రభాకర్.

పడగ్గదిలోకి ప్రవేశించగానే ఆబగా తన ఎత్తుపల్లాల వైపు చూసి తాము చెల్లించే డబ్బులకు సరిపడా దండుకోవాలని చూసే మగవాళ్ల మాత్రమే తెల్సిన మాధవి అతనివైపు కుతూహలంగా చూసి 'తొమ్మిదో ఏడు నడుస్తోంది?' అంది.

"భర్త వదిలేశాడా?"

"లేదు. ఉన్నాడు. కట్టుడు పన్లకి వెళ్లేటోడు. నాలుగేళ్ల క్రితం మూడో అంతస్తు పైకి ఇటుకలు మోస్తూ జారిపడ్డాడు. వెన్నుపూస దెబ్బతింది. కదల్లేడు. మంచంలోనే పడి ఉంటాడు. అతన్ని పోషించే భారం కూడా నామీదే పడింది".

"అయ్యో సారీ. బాబుని చదివిస్తున్నావా?"




"స్కూల్‌కి వెళ్తున్నాడు. నాలుగో తరగతి"

ఆమె చేతిలో పదివేలు పెట్టి "బాగా చదివించు. నా అంత వాడు కావాలి" అన్నాడు.

ఆమె పక్కన పడుకుని పైన చేయివేసి జోకొడుతూ "హాయిగా నిద్రపో" అన్నాడు.

"నిద్ర రావడం లేదు" అంది అతనిచేతిని తన గుండెలమీదికి జరుపుకుంటూ.

అతను చేతిని అక్కడి నుంచి తీసేస్తూ "రేపో ఎల్లుండో బేరం తగిల్తే నిద్ర ఉండదు. నిద్ర కరువైన గంటలన్నీ బాకీపడి మన ఆరోగ్యాన్ని పాడు చేస్తాయి" అన్నాడు.

"మీరేమీ అనుకోనంటే ఓ మాటడగనా?"

"అడుగు"

"మీ గురించి బైట ఏమనుకుంటున్నారో తెలుసా? మీకు మగతనం లేదని. అందుకే ఆడవాళ్లని పిలిపించుకున్నా, ఏమి చేయకుండా పంపిస్తున్నారని".

ప్రభాకర్ కొద్దిసేపు మౌనంగా ఉన్నాక చెప్పాడు "అమ్మతో ఎవరైనా అలాంటి పని చేస్తారా?"

ఆమె ఆశ్చర్యపడి "అమ్మ ఎవరూ?" అంది.

"నువ్వే నా అమ్మవు. నీలా శరీరాన్ని కాసిన్ని డబ్బులకోసం మగవాళ్ళకు తాకట్టు పెట్టే ప్రతి ఆడదీ నాకు అమ్మే. తన బిడ్డలకు పట్టెడన్నం పెట్టడం కోసం ఆరోగ్యం పణంగాపెట్టి అంగట్లో సరుకైన ప్రతి స్త్రీమూర్తీ నాకు అమ్మే".

ఆ మాటలు ఆమె మీద ఎంత ప్రభావం చూపించాయంటే కత్తులతో తన శరీరాన్ని ఎవరో కసకసా పొడుస్తున్నట్లు కదిలిపోతూ ఒక్క ఉదుటున అతని చేతిని విసిరికొట్టి లేచి కూచుంది.

"ఎందుకలా కంగారు పడ్డావు?" అన్నాడు.

"నా కొడుకు గుర్తొచ్చి...." అంది. వెంటనే తన్ను తాను సంబాళించుకుంటూ "మీ అమ్మ...' అంటూ మధ్యలో ఆగిపోయింది.

"మా అమ్మ కూడా నీలా ఒళ్లమ్ముకునే నన్ను పోషించింది. నాకు పదేళ్ల వయసు వచ్చాక "కూలి చేసైనా డబ్బులు సంపాదిస్తానమ్మా. ఈ పని మానెయ్" అని అడిగాను. "నువ్వు బాగా చదువుకోవాలి. పెద్ద ఉద్యోగం చేయాలి. దానికోసం ఎంత కష్టమైనా పడ్తాను బాబూ' అంది. నన్ను హాస్టల్లో పెట్టి చదివించేది. సెలవుల్లో ఎప్పుడైనా ఇంటికెళ్లినప్పుడు అమ్మ నీరసంగా కనిపిస్తే 'ఏమైందమ్మా?' అని అడిగేవాణ్ణి. 'ఏం లేదు బాబూ.. నిద్రొస్తోంది. అంతే. నువ్వు పెద్ద ఆఫీసర్ అయినరోజు కంటినిండా నిద్రపోతాను బాబు' అనేది. నేను ఇంటర్లో ఉన్నప్పుడు అమ్మ ఏవో రోగాల్తో చనిపోయింది. తన ఒళ్లమ్ముకుని సంపాదించిన డబ్బుల్ని నా చదువుకోసం బ్యాంక్‌లో జమచేసేది. ఆ డబ్బులతోనే పెద్ద చదువులు చదివాను. ఈ రోజు నేనీ స్థాయిలో ఉన్నానంటే కారణం మా అమ్మ మగాళ్ల ఆకలి తీర్చడానికి గడిపిన నిద్రలేని రాత్రులే. అందుకే నేను పిలిపించుకునే స్త్రీలను జోకొట్టి నిద్ర పుచ్చుతాను. మా అమ్మ బతికుంటే ఏం చేయాలని కలలు కన్నానో వాటిని ఈ విధంగా తీర్చుకుంటున్నాను" అన్నాడు.

అతని కళ్లల్లో నీటి పొర. మాధవి అతన్ని చుట్టుకుని పసిపిల్లలా ఏడ్చింది. ఏడ్చిఏడ్చి అలసిపోయింది. అతను జో కొడుతుంటే చాలా రోజుల తర్వాత కంటినిండా నిద్రపోయింది. ప్రశాంతంగా.. హాయిగా.. అమ్మ ఒడిలో పడుకున్నంత నిశ్చింతగా.

•••

ఉదయం రవికుమార్ మాధవిని ఆమె ఇంటిదగ్గర కలుసుకున్నాడు.

"మా సార్ మగవాడేనా?" అడిగాడు.

ఆమె రెండు చేతులూ జోడించి "మహానుభావుడాయన. దేవుడు మగవాడా కాదా అని ఆలోచించటమే తప్పు. మీరు చేసిన మేలు ఈ జన్మలో మర్చిపోను. నేను గొప్పగొప్ప వాళ్ల గురించి వినటం తప్ప ఎప్పుడూ చూళ్లేదు. నిన్న నాకాభాగ్యం కలిగింది. నా జీవితానికో గమ్యం ఏర్పడింది" అంది.

## సోషల్ బైట్ విలేజ్

నిరాశ్రయులకు, వృద్ధులకు, అనాథలకు స్వచ్ఛంద సంస్థలు ఎన్నో రకాలుగా సాయపడుతుంటాయి. అయితే ఓ స్వచ్ఛంద సంస్థ మాత్రం మిగతా వాటికి విభిన్నం. నిరాశ్రయులకు ఏకంగా ఒక ఊరినే నిర్మించ తలపెట్టింది సంస్థ!



స్కాట్లాండ్‌కు చెందిన జోష్ లిటిల్‌జాన్ 2012లో 'సోషల్ బైట్' స్వచ్ఛంద సంస్థ ప్రారంభించాడు. ఈ సంస్థ పేరుతోనే బేకరీలు స్థాపించి అనాథలు, దివ్యాంగులను మాత్రమే ఉద్యోగులుగా నియమించుకుంటున్నాడు. వారికి శిక్షణ యిచ్చి పనిమంతులుగా తీర్చిదిద్దుతున్నాడు. అంతటితో ఆగకుండా వారికి ఇళ్లు కూడా నిర్మించి ఇవ్వాలని తలపెట్టాడు. నార్త్ ఎడిన్‌బర్గ్‌లోని గ్రాంటన్ ప్రాంతంలో ఒక ఊరు నిర్మించేందుకు ప్రణాళిక సిద్ధం చేశాడు. ప్రస్తుతం ఆ ప్రాంతంలో మొదట 10 ఇళ్లను నిర్మిస్తున్నారు. ఇందులో చేరినవాళ్లకు కౌన్సెలింగ్ ఇచ్చి దురలవాట్లు మాన్పించి ఆర్థిక సాయం చేస్తారట. ఆ తర్వాత వీరు నిర్మించే 'సోషల్‌బైట్ విలేజ్‌'లో శాశ్వతంగా నివసించే అవకాశాన్ని కల్పిస్తారట.

## ఒకే ఒక్క ఇన్విటేషన్!

'అందరూ ఆహ్వానితులే' అని రాస్తుంటారు ఆహ్వాన పత్రికల్లో. మెక్సికోలో కూడా ఒకాయన తన కూతురి 15వ పుట్టినరోజుకి ఇలాంటి ఆహ్వానమే పలికాడు. అయితే కార్డు ద్వారా మాత్రం కాదండోయ్...



లాటిన్ అమెరికాలో అమ్మాయిల 15వ జన్మదిన వేడుకల్ని ఘనంగా చేస్తారు. దీనిని 'క్విన్సీనెరా' అని పిలుస్తారు. తన కూతురు రూబీ ఇబ్రాకు కూడా ఈ వేడుకలు తలపెట్టాడు మెక్సికోవాసి క్రెసెన్సియో. అందరూ ఆహ్వానితులేనంటూ ఫేస్‌బుక్‌లో ఓ వీడియోను అప్‌లోడ్ చేశాడు. ఆ ఆహ్వానానికి ఊహకందని స్పందన లభించింది.

కేవలం 200 మంది నివసించే కుగ్రామం లాజోయాలో పెద్దయెత్తున ఈ వేడుకలకు ఏర్పాట్లు చేశారు. దేశం నలుమూలల నుంచి దాదాపు పదివేలమంది అతిథులు హాజరయ్యారు. వచ్చినవారందరూ ఒక్క ఫేస్‌బుక్ ఇన్విటేషన్‌కు ఇంత భారీ స్పందనా అంటూ ఆశ్చర్యం వ్యక్తం చేస్తున్నారు.

## లక్షల ఏళ్లనాటి గుహ!



తవ్వకాల్లో ఎక్కడో పురాతన వస్తువులు బైటపడ్డాయనో, ప్రాచీన ప్రదేశాలు బైటపడ్డాయనో పేపర్లో చదువుతుంటాం. ఇది కూడా అలాంటిదే. ఇజ్రాయెల్‌లో అనుకోకుండా చేసిన గని తవ్వకాల్లో ఈ గుహ బైటపడింది. అదీ మామూలు గుహ కాదు, స్ఫటిక గుహ!




1968లో వెలుగుచూసింది ఈ గుహ. దీని పేరు సోరెక్! గుహ బైటపడిన తర్వాత కూడా ఆ విషయం ప్రపంచానికి తెలియకుండా రహస్యంగా ఉంచారు. 1975 నుంచి సందర్శకులను ఈ గుహలోకి అనుమతిస్తున్నారు. గుహలో ఉన్న స్ఫటికం లేక స్ఫటిక విగ్రహాలు సుమారు మూడు లక్షల సంవత్సరాల వయస్సు కలిగి ఉండవచ్చునని చెబుతారు. అంతేకాదండోయ్... ఈ గుహలో ఉష్ణోగ్రత, తేమ ఒకేలా ఉంటుందట.

## ఎలివేటెడ్ పార్క్

కొన్ని పాడుబడ్డ భవనాలు పురాతన కట్టడాలుగా సందర్శకుల మనస్సులను దోచుకుంటున్నాయి. మరికొన్ని మాత్రం ఆలనాపాలనా లేక మట్టికొట్టుకుపోతున్నాయి. ఆ కోవకు చెందిందే ఒక రైల్వేలైను. ఆ రైల్వే లైన్‌ను ఒక ఉద్యానం మార్చారు ఇద్దరు ఆర్కిటెక్ట్‌లు.



న్యూయార్క్ నగరంలో 1.48 మైళ్లు గల వెస్ట్ సైడ్ లైన్ రైల్వేలైన్‌ను 36 ఏళ్లక్రితం మూసేశారు. 1999లో జోషువా డేవిడ్, రాబర్ట్ హామండ్ అనే ఇద్దరు శిల్పకళానిపుణులు ఈ రైల్వేలైన్‌ను పాదచారులకు వీలుగా సుందరమైన ప్రదేశంగా మార్చాలని నిర్ణయించుకున్నారు. కావల్సిన అనుమతులతో దాన్ని ఎలివేటెడ్ పార్క్‌గా తీర్చిదిద్దారు.

ఇంకేముందీ! ఇక విజిటర్స్ రాకుండా ఉంటారా! సేదదీరకుండా ఉంటారా? ఒక పాడుబడ్డ రైల్వేలైన్‌ను సుందర ప్రదేశంగా మార్చిన ఆ శిల్పకళా నిపుణుల నైపుణ్యానికి అందరూ అబ్బురపడుతున్నారు.

## ఎత్తైన గుడారం

ఎడారులు, మంచుకొండల్లో నడిచే ప్రయాణికులు గుడారాలు ఏర్పాటు చేసుకోవటం తెలిసిందే! ఇలాంటి ఓ గుడారం ప్రపంచంలోనే అతి ఎత్తైన గుడారంగా వార్తల్లోకెక్కింది.



కజకిస్థాన్ రాజధాని ఆస్తానాలో ఉన్న ఖాన్ షాటిర్ ఎంటర్‌టైన్‌మెంట్ సెంటర్ ప్రపంచంలోనే అతి ఎత్తైన గుడారం. అయితే ఈ గుడారాన్ని వేలాడే కేబుళ్లతో 150 మీటర్ల ఎత్తుకి, ఆధునిక టెక్నాలజీతో తయారుచేశారు. 200 మీటర్ల దీర్ఘవృత్తాకారంలో 1,40,000 చదరపు మీటర్ల వైశాల్యంలో నిర్మించారు.

ఈ గుడారంకింద పార్కులు, షాపింగ్ మాల్స్, సినిమా హాళ్లు, మరెన్నో ఎంటర్‌టైన్‌మెంట్ వేదికలూ ఉన్నాయి. ఇండోర్ బీచ్, బోటింగ్ చేయడానికి ఒక నది, ఒక గోల్ఫ్ గ్రౌండ్ కూడా ఉంది. ఇవేకాదు, గుడారం పగటిపూట ఒక రంగులోనూ, రాత్రిపూట ఒక రంగులోనూ కనబడుతుంది. బాగుంది కదా!

-నర్మద వాసిరెడ్డి



## జీన్స్‌తోనే ఒంటరితనం?

డిప్రెషన్ కారణంగా ఒంటరితనం ఫీలవుతారన్న సంగతి తెలిసిందే! ఇది కొంత వరకూ నిజమే అయినా ఒంటరితనానికి కారణం జీన్స్ అని పరిశోధకులు చెబుతున్నారు. 50 సంవత్సరాలు అంతకు పైబడిన పదివేల మందిని వీరు అధ్యయనం చేశారు. వీరిలో 20 శాతం మందికి ఎలాంటి సమస్యలూ లేవు. ఆర్థికంగా, శారీరకంగా వీరు బాగున్నవారే! కానీ వీరు ఒంటరితనంతో బాధపడడం గుర్తించారు. వీరు నలుగురితో కలవకపోవడం, ఒంటరిగా గడపడానికే ఇష్టపడడం గమనించారు. దీనికి కారణం వీరి జీన్స్ అని స్పష్టం చేస్తున్నారు.

## సోయాతో జాగ్రత్త!

సోయాతో చేసిన ఉత్పత్తులు తీసుకుంటే ఆరోగ్యానికి చాలా మంచిది అన్న దాంట్లో నిజం లేదు అంటున్నారు పరిశోధకులు. సోయా ఉత్పత్తులు ఎక్కువగా తీసుకుంటే పురుషులలో ఫెర్టిలిటీ సమస్యలు తలెత్తే అవకాశం ఉందన్న విషయం ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. సుమారు 28 మంది యువకుల ఆహార అలవాట్లపై వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరందరికీ కొన్ని రోజుల పాటు సోయా ఉత్పత్తులను క్రమం తప్పకుండా ఇచ్చారు. సోయాలోని ఫైటో ఈస్ట్రోజన్ అనే కెమికల్ కారణంగా ఈ యువకులలోని వీర్యకణాల క్రియాశీలత బాగా తగ్గడాన్ని వీరు గమనించారు. అంతేకాకుండా క్రోమోజోములు కూడా అంతులేకుండా పెరగడం వీరి దృష్టికి వచ్చింది. ఈ రెండు కారణాల వలన ఈ యువకులలో ఫెర్టిలిటీ సమస్య ఉత్పన్నమయింది. ఇదంతా సోయా ఉత్పత్తులు తీసుకోవడం వలనే అని వారు అంటున్నారు. పురుషులు కానీ, స్త్రీలు కానీ సోయా ఉత్పత్తులు తీసుకునేటప్పుడు నిపుణుల సలహా తీసుకోవడం తప్పనిసరి అని వారు స్పష్టం చేస్తున్నారు. సోయా ఆరోగ్యానికి మంచిదే అయినా సంతానోత్పత్తిని కచ్చితంగా దెబ్బ తీస్తుందని వారు చెబుతున్నారు.

ఆరోగ్యమే మహాభాగ్యం



## నీటితోనే ఆరోగ్యం

నీటిని తాగడం వలన బరువు తగ్గే మాట ఎలా ఉన్నా ఆరోగ్యాన్ని కాపాడుకోవచ్చని అమెరికా పరిశోధకులు చెబుతున్నారు. ఏడు సంవత్సరాల పాటు 18వేల మంది యువకుల ఆహార అలవాట్లను దఫాల వారీగా పరిశీలించారు. 48 గంటల పాటు వీరు ఎంత ఆహారం తీసుకున్నారు? ఎన్ని లీటర్ల నీరు తాగారు? అనే విషయాలను నోట్ చేశారు. రోజుకు రెండు మూడు కప్పుల నీటిని ఎక్కువ తాగిన యువకుల ఆహార అలవాట్లలో విపరీతమైన మార్పులు వచ్చిన విషయం గమనించారు. వీరు ఉప్పు (సోడియం) తక్కువ ఉన్న ఆహారం తీసుకున్నారు. అంతే కాకుండా రోజు వారీ ఆహారం కన్నా 200 కేలరీలు తగ్గించారు. దీని వలన బరువు తగ్గడంతోపాటు ఆరోగ్యంలో కూడా మార్పులు వచ్చిన విషయాన్ని గమనించారు. నీరు తాగడం ద్వారా బరువు తగ్గుతారు అన్న విషయం వెనుక రహస్యం ఇదేనని పరిశోధకులు చెబుతున్నారు.

## పళ్లరసాలతో అధిక బరువు?

బరువు పెరగకుండా ఉండాలంటే పళ్లరసాలు ఎక్కువగా తీసుకుంటే సరిపోతుందన్న అభిప్రాయం చాలా మందిలో ఉంది. ఈ అభిప్రాయం తప్పు అని ఇటీవల నిర్వహించిన పరిశోధనల్లో వెల్లడైంది. పళ్లరసాలలో పీచు పదార్థం, పోషకాలు పోయి కేవలం చక్కెర మాత్రమే మిగులుతుందని, దీన్ని ఎక్కువగా తాగడం వలన ఆరోగ్యానికి పెద్దగా ప్రయోజనం ఉండదని పరిశోధకులు చెబుతున్నారు. కేవలం పంచదార మాత్రమే కలిగిన పళ్లరసాలు తాగడం వలన ఆకలి త్వరగా వేస్తుందని, దానితో మామూలు కన్నా కూడా ఎక్కువ ఆహారం తీసుకునే అవకాశం ఉందని వారు స్పష్టం చేస్తున్నారు. దీని వలన బరువు పెరిగే అవకాశం లేకపోలేదని వారు అభిప్రాయపడుతున్నారు. బరువు తగ్గాలనుకునేవారు పళ్లరసాల కన్నా పళ్లనే తీసుకుంటే మంచిదని వారు సూచిస్తున్నారు.



## కొవ్వు మంచిదే!

బరువు తగ్గాలనుకునే వారు నెయ్యి, వెన్న, తీపి పదార్థాలకు చాలా దూరంగా ఉంటారు. దీని వలన ఆరోగ్యానికి హాని జరుగుతుందే తప్ప ఏమాత్రం మేలు జరగదని నిపుణులు సూచిస్తున్నారు. పై పదార్థాలకు పూర్తిగా దూరంగా ఉండడం కూడా మంచిది కాదని వారు అంటున్నారు. పోషకాహారం తీసుకుంటూ, క్రమం తప్పకుండా వ్యాయామం చేసేవారు నెయ్యి, వెన్న, తీపి పదార్థాలు తీసుకున్నా బరువు పెరగరనీ, ఇతరత్రా ఆరోగ్య సమస్యలు కూడా తలెత్తే అవకాశం లేదనీ వీరు స్పష్టం చేస్తున్నారు. కొంతమంది స్త్రీల మీద వీరు పరిశోధనలు నిర్వహించారు. వీరిలో కొందరు ఊబకాయులు ఉన్నారు. వీరిని ఒక గ్రూపుగానూ, సాధారణ బరువు కలిగిన వారిని మరొక గ్రూపుగానూ విభజించారు. సాధారణ గ్రూపు వారికి పోషకాహారంతో పాటు కొవ్వు పదార్థాలు కొద్దిగా ఎక్కువగా ఇస్తూ ప్రతిరోజూ వ్యాయామం చేయించారు. ఊబకాయులకు కొవ్వులేని ఆహారం ఇచ్చారు. వీరి చేత వారంలో రెండు రోజులు మాత్రమే వ్యాయామం చేయించారు. కొన్ని రోజుల అనంతరం వీరి బరువును పరిశీలించగా ఊబకాయుల బరువులో ఎలాంటి మార్పు కనిపించలేదు. అలాగే రెండో గ్రూపు వారి బరువులోనూ ఎలాంటి మార్పు రాలేదు. పోషకాహారంతో పాటు కొవ్వు పదార్థాలు తీసుకున్నా బరువు పెరగరన్న విషయం వీరి పరిశోధనల్లో స్పష్టమైంది.



-అవినాష్

## సరదాగా....

### ఆధార్‌కార్డ్

రాము తన ఫ్యామిలీతో కలిసి రెస్టారెంట్‌కు వెళ్లాడు. తినటం అయ్యాక వెయిటర్ బిల్లు తీసు కొచ్చి ఇచ్చాడు. రాము బిల్లు చూసి, 'వామ్మో, చాలా అయిందే బిల్లు' అనుకున్నాడు. బాబూ, మీ రెస్టా రెంట్లో అన్ని కార్డులు యాక్సెప్ట్ చేస్తారా? అని అడి గాడు వెయిటర్‌ని. ఆల్ కార్డ్స్ ఆర్ యాక్సెప్టెడ్ సార్! అన్నాడు వెయిటర్.

సరే అయితే అంటూ, పర్సులోనుంచి కార్డు తీసి ఇచ్చాడు.

వెయిటర్ కార్డు చూసి, సార్! ఇది ఆధార్ కార్డు, చెల్లదు సార్ అన్నాడు.

దానికి రాము ఆల్ కార్డ్స్ ఆర్ యాక్సెప్టెడ్ అని బయట బోర్డు కూడా పెట్టారు కదయ్యా...! అంటూ గొడవకు దిగాడు.

### ఒక ప్రశ్న?

రమణారావుకి నిద్రపట్టడం లేదు. కళ్లు మూస్తే చాలు రేపటిరోజు గుర్తొస్తోంది. అప్పుల వాళ్లు, కొడుకు ఫీజు, కూతురి పెళ్ళిసంబంధం... అన్నీ గుర్తొస్తున్నాయి. చేతిలో చిల్లిగవ్వ లేదు. ఏంచేయాలా అని ఆలోచిస్తున్నాడు. ఆలోచనలు తెగడంలేదు సరికదా, విసుగూ, కోపమూ పెరిగి పోతున్నాయి. ఎటైనా వెళ్లిపోతే ఎలా ఉంటుంది అని మరో ఆలోచన. ఇన్ని ఆలోచనల మధ్య నిద్ర ఎలా పడుతుంది? లేచి కూర్చున్నాడు. ఇక ఆత్మహత్యే శరణ్యం అనుకున్నాడు. నేను పోతే ఈ బాధలన్నీ పోతాయి కదా అనుకున్నాడు. తాడుకోసం వెతికాడు. దొరకలేదు. వంటింటి కత్తికోసం చూసి, అమ్మో... రక్తం చూడలేను అనుకున్నాడు. బాధ తెలియకుండా ప్రాణం పోవాలి ఎలా అనుకుంటూ, సొరుగులన్నీ వెతు కుతుంటే, ఒకదాంట్లో, ఎప్పటిదో తన తండ్రిగా రిది పిస్టల్ కనిపించింది. దాన్ని తీసుకున్నాడు. రెండు బుల్లెట్లు లోడ్ చేశాడు. నిజమైన గన్, నిజమైన బుల్లెట్లే... బొమ్మవి అనుకునేరు. పిస్టల్ తీసుకుని బాత్‌రూంలో దూరాడు. అద్దం ముందు నిలబడి ఒకసారి తనను తాను చూసుకున్నాడు. పిస్టల్‌తో తలకు గురిపెట్టి కాల్చుకున్నాడు. పిస్టల్ శబ్దానికి భార్య, కొడుకు, కూతురు పరిగె త్తుకుంటూ వచ్చారు. చూస్తే బాత్‌రూంలో కిందపడిపోయి ఉన్నాడు రమణారావు. భయం భయంగా వీళ్లందరినీ చూస్తూ, మెల్లగా బయ టకు వచ్చాడు రమణారావు. బాత్‌రూంలో ఒక్క చుక్క రక్తం కూడా లేదు. మరి పిస్టల్‌తో కాల్చు కున్నా రమణారావు ఎందుకు చనిపోలేదు? ఇదీ ప్రశ్న. సమాధానం కనుక్కోండి.







**'అమ్మా పద్మా, ఒకసారి ఇటురా' పెద్దగా పిలిచింది ఆ ఇంటి ఇల్లాలు. రెండు క్షణాల తరువాత పాదాలకు పెట్టుకున్న వెండి గజ్జెల పట్టీలు ఘల్లు ఘల్లుమని శబ్దం చేస్తూ ఉండగా అక్కడికి వచ్చింది ఒక పుత్తడి బొమ్మ.**

**'మా బిడ్డ... తనకే సంబంధం కుదిరింది. అందరూ నంద్యాల వెళ్ళింది తన కోసమే' బిడ్డను దగ్గరకు తీసుకుని ముద్దుగా ముంగురులు సవరిస్తూ చెప్పింది ఆమె.**

కనుల పండుగ అయిపోయినట్లు అనిపించింది వెట్టికి, ఆ పిల్ల రూపం చూడగానే. 'మీరేమీ దిగులు పడాల్సిన పని లేదు. ఏదో మాటవరసకు మీ వారిని అక్కడికి రమ్మని పిలిచారు గాని, ఎప్పుడో సెటిలై పోయింది సంబంధం. ఏదైనా తేడా అంటూ వచ్చిందంటే వాళ్ళు వట్టి మూర్ఖ శిఖామణులని అర్థం. పెట్టిపుట్టాలి, ఇట్టాంటి పిల్లను తమ ఇంటికి తీసుకుపోవటానికి' తడుముకోకుండా చెప్పేశాడు.

నునుసిగ్గుతో బుగ్గలు ఎరుపెక్కిపోయాయి ఆ బిడ్డకి. 'ఎందుకే పిలిచావు?' తడబడుతూ అడిగింది తల్లిని.

'మామయ్య ఎక్కడున్నాడో చూసి ఒక సారి ఇక్కడికి రమ్మని చెప్పు. ఈ అబ్బయ్య ఏదో మాట్లాడాలని అంటున్నాడు' అన్నది తల్లి.

తూనీగ మాదిరి రివ్వున పరిగెత్తుకు పోయింది కూతురు. పది నిమిషాల తరువాత భుజం మీది కండువాతో ముఖాన్ని తుడుచుకుంటూ లోపలికి వచ్చాడు ఒక యువకుడు.

'మీ బావగారి బండి తీసుకువచ్చి నీకు అప్పగించిన వాళ్ళు ఎవరు?' మంచం మీది నుంచి లేస్తూ అడిగాడు వెట్టి.

'లేస్తున్నావేంటి అబ్బయ్యా? లేచి నిలబడటానికి వాడేమైనా కలెక్టరా, గవర్నరా? చదువుకోరా నాయనా అని బతిమాలితే పదో తరగతి వరకూ ముక్కి, ఆ తర్వాత తన వల్ల కాదని చతికిలపడిన సన్నాసి. తనే గనుక చక్కగా చదువుకుని ఉంటే, గడప దాటనిచ్చేదాన్ని కాదు నా బిడ్డని. వీడికే ఇచ్చి కట్టబెట్టేదాన్ని. నా కళ్ళెదుటే ఉంచుకునే దాన్ని. మొండి బండ పనులకు తప్ప మరెందుకూ పనికిరాని వాడు వీడు. నువ్వు లేవకు. కూర్చో' ఫుల్‌స్టాప్ కామాలు లేకుండా తన తమ్ముడి ఘనతను వల్లె వేసింది ఇంటి ఇల్లాలు.

మనసు కష్టపెట్టుకుని ముఖం ముడుచుకోలేదు ఆ యువకుడు. 'మా అక్క ఎప్పుడూ ఇలాగే మాట్లాడుతూ ఉంటుంది. నేను పనికి రాకుండా పోయానన్న బాధతో కాదు, తన గారాలకూన దూరంగా వెళ్ళిపోతుందన్న బెంగతో' అంటూ, 'అబ్బయ్యకి సిగరెట్టు అలవాటు ఉన్నట్టు ఉంది. బయటికిపోయి మాట్లాడుకుంటాం' అంటూ తనే ఆ గదిలో నుంచి అవతలికి దారి తీశాడు.

ముచ్చట అయింది వెట్టికి, అతని చురుకుదనాన్ని చూసేసరికి. ప్యాంటుజేబులో నుంచి సిగరెట్ తీసి తను వెలిగించుకుని, ఇంకోటి అతనికి అందించబోయాడు.

'వద్దులే సారూ! అక్క వాసన పసికట్టిందంటే నా తల వాచిపోతుంది. ఇట్టాంటి అలవాట్లు అన్నీ ఈ గడపకి అవతలే, ఇవతల కాదు' అంటూ ఒక చెక్కబల్ల వెట్టి దగ్గరికి జరిపి, తను ఇంకో బల్లమీద కూర్చున్నాడు.

'బాజిరెడ్డి దగ్గర పనిచేసే గుర్రపోడు ఇంకో ఇద్దరిని వెంట బెట్టుకుని, మా బండిని తీసుకు వచ్చాడు' అంటూ అటూ ఇటూ చూసి గొంతు తగ్గించాడు.

'తెల్లవారబోతూ ఉండగా వాళ్ళ మనుషుల్ని పదిమందిని చితకకొట్టి చింతకాయ పచ్చడి పెట్టారంట ఎవరో. బండిని అప్పగించిన తర్వాత వెనక్కి వెళ్లిపోలేదు. గుడిచుట్టూ అదే పనిగా రౌండ్లు కొట్టారు. పుట్టల మధ్యకు మాత్రం పోలేదు. పాములంటే చచ్చేంత భయం కాబోలు..' అని కూడా అన్నాడు.

'గుర్రపోడు అంటే?' ఆ మాట అర్థం కాకపోవటంతో వెంటనే అడిగాడు వెట్టి.

'అది మేము చిన్నప్పుడు చింతలపల్లి స్కూల్లో చదువుకునేటప్పుడు వాడిని పిలిచిన పేరు. మెడ పొడుగ్గా, గుర్రపు మెడలా ఉంటుంది. నేను పదితో చదువు మానేస్తే, వాడు ఎనిమిదిలోనే ఇంటికెళ్ళిపోయాడు. చింతలపల్లిలో బాజిరెడ్డి భూములమీద అజమాయిషీ చేసే నాగేంద్రం... వాడికి బంధువు. ఆ బంధుత్వం మూలంగా బాజిరెడ్డి దగ్గర పని దొరికింది' వివరంగా చెప్పాడు యువకుడు.

'బాజిరెడ్డి జనాన్ని తుక్కుకింద కొట్టింది ఎవరో తెలిసిందా?' సిగరెట్ పొగ నాశికా రంధ్రాలగుండా వదులుతూ అడిగాడు వెట్టి.

'ఆ గోలను గురించి తెలియటానికి అక్కడ చూసి నోళ్ళు ఎవరున్నారు? ఆళ్ళవాళ్ళకే వాడు ఎవడో తెలియదు. పూజారికి తెలియదు.' అంటూ రెండు క్షణాలు ఆగి, 'తెలిస్తే గిలిస్తే గుడి వెనకాల ఉండే పిచ్చి పూజారికి తెలియాలి' అన్నాడు సాలోచనగా.

ఒంటి మీది రోమాలన్నీ నిక్కబొడుచుకుంటున్న సెన్సేషన్ కలిగింది వెట్టికి. పిచ్చిపూజారి పేరు వినగానే 'అడిగారా అతన్ని? చెప్పాడా ఏమైనా?' కొంచెంగా ముందుకు వంగి ఆత్రుతగా అడిగాడు.

'అదేమో నాకు తెలియదన్నా! అడిగే ఉంటారు. యథావిధిగా దిక్కున్నచోటికి పోయి చెప్పుకోమని చీదరించుకుని ఉంటాడు' కాజువల్‌గా అన్నాడు యువకుడు.

'చీదరించుకుంటాడా? అదేమిటి?' ఆశ్చర్యంగా అడిగాడు వెట్టి.

'పిచ్చిపూజారికి ఆ బాజిరెడ్డి అంటే పరమ అసహ్యం. కదిరి శివారెడ్డి తండ్రి పేరు చెవులపడితే పూనకం వచ్చిన పాము మాదిరి శివాలెత్తిపోతాడు. జరిగింది ఏమిటో తనకు తెలిసినా కూడా అతను వాళ్ళకి చెప్పే సమస్యేలేదు' ఖచ్చితమైన కంఠంతో డిక్లేర్ చేశాడు ఆ యువకుడు.

చివరికంటా కాలిన సిగరెట్‌ని కింద పడవేసి, కాలి మడమతో గట్టిగా అదిమేశాడు వెట్టి. అలవాటుకు విరుద్ధంగా వెంటనే రెండో సిగరెట్‌ని వెలిగించుకున్నాడు.

## జరిగిన కథ

వెట్టి అసలు పేరు విఠల్‌రెడ్డి. కారణాంతరాల వల్ల వెట్టిగా మారతాడు. ఆ నేపథ్యంలో మళ్ళీ బాజిరెడ్డికి తారసపడిన వెట్టి అతడి పెత్తనాన్ని సవాలు చేస్తాడు. తనని చంపేందుకు ప్రయత్నించిన బాజిరెడ్డి మనుషుల్ని ఆస్పత్రిపాలు చేస్తాడు. దాంతో వెట్టిపై ప్రతీకారేచ్ఛతో రగిలిపోతూ ఉంటాడు బాజిరెడ్డి. వెట్టిని చౌడేశ్వరి ఆలయానికి వెళ్ళి ప్రసాదం తెమ్మంటాడు శివారెడ్డి. ఆలయంలో పఠాన్‌తోపాటు బసవప్పను చూస్తాడు వెట్టి. సమయం చూసుకుని అందరినీ చావమోదుతాడు. ఆ ఆలయ పాతపూజారి నుంచి ఆ గుడి పూర్వ వివరాలు తెలుసుకోవాలనుకుంటాడు. చెప్పాపెట్టకుండా పిచ్చమ్మి శివారెడ్డి ఇంటికి వస్తుంది. పఠాన్‌కి ప్రణవినిచ్చి పెళ్ళి చేయడానికి ఒప్పుకుంటుంది పిచ్చమ్మి.

ఆ తర్వాత...

# వెట్టి

(ది వారియర్)

-మధుబాబు




మోకాళ్ల చుట్టూ చేతులు చుట్టి, ముందుకీ వెనక్కీ ఊగుతూ చాలా సౌమ్యంగా, ప్రశాంతంగా సమాధానాలు చెపుతున్న యువకుడి ముఖంలో వెంటనే ప్రత్యక్షం అయింది ఒక విచిత్రమైన భావం.

'నువ్వు ఏదో టెన్షన్‌లో ఉన్నట్టున్నావు. కొంపతీసి ఆళ్ళని విరగబాది మడతపెట్టింది నువ్వేనా?' అని అడిగాడు.

ఉలిక్కిపడబోయి, నేర్పుగా తనని తాను కంట్రోల్ చేసుకున్నాడు వెట్టి. 'అంతా అయిపోయిన తర్వాత గానీ నేను అక్కడికి పోలేదు. మీ బావగారి కంటే జస్ట్ నాలుగు అడుగులు వెనక. అంతే' అన్నాడు తడుముకోకుండా.

'నేను కూడా అదే అనుకుంటున్నాను. తెల్లారక ముందే జరిగిపోయిన గొడవ గురించి, తెల్లగా తెల్లవారిన తర్వాత వెళ్ళినవాళ్ళకి ఎలా తెలుస్తుంది? కాకపోతే పిచ్చిపూజారి పిచ్చిమాత్రం ఈ రోజున చాలా ఎక్కువైపోయింది. గుడిచుట్టూ గిరికీలు కొడుతూ పెద్దపెద్ద కేకలు పెడుతున్నాడు' అన్నాడు ఆ యువకుడు.

'ఏమని?' కుతూహలం అణుచుకోవటం చేతకాకపోవటంతో వెంటనే అడిగాడు వెట్టి.

'ఇప్పుడు జరిగింది ఇంతటితో ఆగిపోదట. ఇంకా ఇంకా ఎక్కువై పోతుందిట. గుళ్లో ఉన్న తల్లిని అడ్డం పెట్టుకుని చేయరాని పనులు చేసినవాడు ఒకడు ఎప్పుడో నాశనం అయిపోయినట్టు, వాడికి సాయం చేసినవాడి వంతు వచ్చిందిట' తను విన్న అరుపులు గుర్తు చేసుకోవటానికి ప్రయత్నం చేస్తూ చెప్పాడు ఆ యువకుడు.

'పేర్లు.. ఎవరివైనా పేర్లు చెప్పాడా?' మరింత కుతూహలంగా అడిగాడు వెట్టి.

పదో తరగతి వరకు మాత్రమే చదివి, ఆ తర్వాత చదవలేక ఇంట్లో కూర్చుండిపోయిన వాడు ఆ యువకుడు. మొండి బండపనులకు తప్ప మరెందుకూ పనికిరాడని పేరు సంపాదించుకున్నవాడు. అవుననో కాదనో చెప్పాలి వెట్టి అడిగిన మాటకు సమాధానం.

'అన్నా.. నువ్వు ఏమీ అనుకోనంటే ఒకటి అడుగుతాను. అడగమంటావా?' ముందుకీ వెనక్కీ ఊగటాన్ని మాని సూటిగా అడిగాడు.

'అడుగు..' అన్నాడు వెట్టి.

'కదిరి శివారెడ్డి పేరు మీద పూజ చేయించాడని, ఏదో మాటల్లో ఆ పూజారయ్య నాకు చెప్పాడు. బాజిరెడ్డి కూడా శివారెడ్డి మనిషే. మీరిద్దరూ ఒకే చోట ఉంటున్నప్పుడు, ఇట్లాంటి విషయాలు నా వంటి పరాయిమనిషి నోటివెంట వినాల్సిన అవసరం ఏముంది? బాజిరెడ్డి జనాన్ని కొట్టినవాళ్ల కోసం నువ్వే ముందుగా వెతకాలి కదా.. ఏమీ పట్టనట్టు మా బావయ్యను బండెక్కించుకుని ఇటుగా వచ్చేయటం దేనికి?' అడిగాడు ఆ యువకుడు.

రెండో సిగరెట్‌ని కూడా కిందకి వదిలి ఇంకో సిగరెట్‌ని వెలిగించుకోవాలన్న కోరిక కలిగింది వెట్టికి. బలవంతంగా అదుముకున్నాడు.

బండ మొండివాడు కానే కాదు ఆ యువకుడు. మహా షార్పు. విపరీతమైన తెలివితేటలున్నాయి. జాగ్రత్తగా డీల్ చేయకపోతే లేనిపోని ట్రబుల్స్ ఫేస్ చేయవలసి వస్తుంది.

'అన్నీ చెప్పటం ఇష్టం లేకపోతే చెప్పవలసిన అవసరం లేదు. నేను ఇంకొక్క మాట కూడా మాట్లాడను' అతని మౌనం గమనించి వెంటనే అన్నాడు ఆ యువకుడు.

'చెప్పకుండా దాచుకోవాల్సినంత మేటర్ ఇక్కడ ఏమీ లేదు బ్రదర్. నేను శివారెడ్డి దగ్గర పని చేయటం బాజిరెడ్డికి ఇష్టం లేదు. ఏదో ఒక తప్పు నాకు అంటగట్టి ఇంటికి పంపించాలనే పట్టుదల మీద ఉన్నాడు. అందుకే సాధ్యమైనంత వరకూ అతని వ్యవహారాలకు నేను దూరంగా ఉంటాను' అన్నాడు వెట్టి, చాలా సీరియస్‌గా ఆలోచించిన తర్వాత.

'మా గుర్రపోడు కూడా ఇదేమాట చెప్పాడు. గొడవ జరిగినప్పుడు నువ్వు అక్కడ ఉన్నదీ లేనిదీ తెలుసుకోవటానికి మహా తాపత్రయ పడిపోయాడు' కాజువల్‌గా చెప్పాడు ఆ యువకుడు.

'అతను అడిగింది నా గురించేనని నీకు ఎలా తెలిసింది?' అడిగాడు వెట్టి.

'ఇవాళ ఆ తల్లి దగ్గరికి వచ్చింది ఇద్దరే ఇద్దరు' ముక్తసరిగా అన్నాడు అతను.

'నాకంటే ముందుగా మీ బావయ్య వచ్చాడు. నేను-' అంటున్న వెట్టిని చూసి నవ్వుతూ, 'తెల్లారక ముందే వచ్చి, ఆళ్ళందరి భరతం పట్టి తెల్లారేదాకా



దూరంగా కూర్చుని ఉండచ్చు కదా..' అన్నాడు.

'మీ గుర్రపోడు కూడా ఇలాగే అనుకుంటున్నాడా?' మితిమీరబోతున్న ఆందోళనను అతి బలవంతంగా అదుముకుంటూ అడిగాడు వెట్టి.

'వాడిమొఖం... వాడికి అంత ఆలోచన లేదు. దేబె మొఖం వేసుకుని గుడి చుట్టూ తిరగటం తప్ప వాడు ఏమీ చేయలేడు. నాకే ఎందుకో వచ్చింది అనుమానం' అంటూ చెప్పా పెట్టకుండా ముందుకు వంగి, వెట్టి కుడిచేతిని పట్టుకుని పైకి ఎత్తాడు.

నాలుగు అడుగులు అవతలగా వెలుగుతున్న ట్యూబ్‌లైట్ వెలుగులో, అతి స్పష్టంగా కనిపించాయి, గట్టిగా ఉండే పదార్థాన్ని బలంగా కొట్టటం వల్ల కమిలిపోయినట్లు తయారైన పిడికిలి వెనుక చేతివేళ్ల కణుపులు.

ఫైటింగ్ మొదలుపెట్టీ పెట్టగానే బసవప్ప ముఖం మీద దెబ్బ వేసినప్పుడు ప్రత్యక్షం అయిన గుర్తులు అవి...

గొంతు ఎండుకు పోయినట్లు, గులకరాయి ఏదో అడ్డం పడినట్లు అనిపించింది వెట్టికి. అదే అనుమానం బాజిరెడ్డికి కూడా వచ్చిందంటే... పడరాని పాట్లు పడాలి తను, సరయిన సమాధానాన్ని వెతుక్కోవటానికి.

వెట్టి మనసులో మెదులుతున్న మాటలన్నీ తనకు తెలిసిపోతున్నట్టు చిన్నగా నవ్వాడు ఆ యువకుడు.

'హోమ్‌వర్కు చేయనప్పుడు మా లెక్కల మాస్టారు బెత్తంతో పిడికిళ్ళను వెనక్కి తిప్పించి కణుపులమీద ఫెడీఫెడీమని కొట్టేవాడు. సాయంత్రానికల్లా ఇట్టాగే తయారయ్యేవి చేతులు' అన్నాడు.

ఆపైన అతన్ని మాయమాటలతో ఏమార్చటం అసంభవమని అర్థమై చిన్నగా నవ్వాడు వెట్టి.

'చాలన్నా, ఇంక నువ్వు ఒక్కమాట కూడా నాకు చెప్పాల్సిన అవసరం లేదు. దుక్కల్లాంటి ఆ జనాన్ని తుక్కు లేచిపోయేటట్టు కొట్టగలిగిన వాడిని సినిమాల్లో తప్ప డైరెక్టుగా ఇంతవరకూ నేను చూడలేదు. ఇప్పుడు చూస్తున్నాను' అంటూ ఉన్నట్టుండి గొంతు తగ్గించి, 'అన్నా, నీకు మందు పుచ్చుకునే అలవాటుంటే చెప్పు... మా బండోడి ఇంటి దగ్గర బ్రహ్మాండమైన మందు ఉంది. రెండు గుక్కలు చాలు నీ టెన్షను, నీ నొప్పులు అన్నీ మటుమాయం అయిపోతయ్' అన్నాడు.

'మీ అక్కయ్యగారికి తెలిస్తే నాకున్నవన్నీ నీకు అంటుకుంటయ్..' అన్నాడు వెట్టి. నాలుక చప్పరించేశాడు అతను. 'ఈ గడప లోపల ఏమీ చేయనంత వరకూ మనకి ఏమీ కాదు. వెళ్దామా?' బల్లమీదినించి లేవటానికి రెడీ అవుతూ అడిగాడు.

నవ్వుతూనే తల అడ్డం తిప్పాడు వెట్టి.

'అనుకున్నాను అన్నా. నీ వంటివాడికి అటువంటి అలవాట్లు ఉండే ఛాన్సులేదు. ఏదిఏమైనా నువ్వు చెప్పుకో తగినవాడివి' అంటూ చటుక్కున మాటను మింగేశాడు.

'టీ తీసుకువచ్చాను మామా.. అమ్మ ఇచ్చి రమ్మంది' అంటూ ప్రత్యక్షం అయింది ఇంటి ఇల్లాలి కూతురు.

'ఇకమీదట అట్టాంటి మాటల్ని మర్చిపో. అమ్మ చెప్పింది, అమ్మ రమ్మంది, అమ్మ చేయమంది అంటూ అదేపనిగా చిలకపలుకులు పలకకూడదు. అవతలి వాళ్ళకి మండుద్ది' ఒక కప్పు వెట్టికి అందించి, రెండవదాన్ని తాను తీసుకుంటూ ఆమెకు ఉచిత సలహా ఒకటి ఇచ్చాడు యువకుడు.

ఎర్రబడిపోయిందా పిల్ల ముఖం. ఒకసారి ఉరిమి చూసి పరిగెత్తుతున్నట్టుగా వెళ్ళిపోయింది వెనక్కి.

'నిన్నకాక మొన్న పుట్టినట్టుంది. అప్పుడే పెళ్ళి... ఆడపిల్ల అరటిచెట్టు చాలా తొందరగా పెరిగిపోవటం జరుగుతుందిట. నిజమే కదా?' టీని సిప్‌చేస్తూ అన్నాడు వెట్టితో ఆ యువకుడు.

'గుడి దగ్గర ఉండే పిచ్చిపూజారి గురించి చెప్పు' అన్నాడు వెట్టి.

'నాకంటే నీకు మా బండోడు చాలా బాగా చెపుతాడు. వాడికి చాలా విషయాలు తెలుసు' అన్నాడు యువకుడు.

'నీకంటే తెలివైన వాడా?' అడిగాడు వెట్టి.

నవ్వాడు యువకుడు. 'తెలివి కాదన్నయ్యా... బండోడి తండ్రి ఆ బాజిరెడ్డికి చాలా బాగా కావాల్సినవాడు ఒకానొకప్పుడు. ఇప్పుడు మాత్రం కాదు' అన్నాడు.

'అయితే అతన్ని తప్పకుండా కలిసి మాట్లాడవలసిందే' అంటూ చేతిలోని కప్పును కిందపెట్టి బల్లమీదినుంచి లేచాడు వెట్టి.

సరిగ్గా అప్పుడే గొంతు చిరిగిపోయే లెవెల్లో అరిచాడు ఆ ఆవరణలో పనిచేసే మనిషి ఒకతను.

'పాము.. పాము.. అమ్మగారూ.. పాము...' అంటూ ఇంటి ముందుకు పరిగెత్తుకు వచ్చాడు. ముఖద్వారం దగ్గర కూర్చుని ఉన్నారు ఇంకో ఇద్దరు పనివాళ్ళు. క్షణం కూడా ఆలస్యం చేయకుండా పక్కనే పెట్టి ఉన్న తమ చేతికర్రల్ని అందుకున్నారు.

'ఎక్కడరా? ఏది చూపించు..' అంటూ ముందుగా అడుగు వేయబోతుండగా, పరుగుపరుగున లోపలినుంచి వచ్చింది ఇంటి ఇల్లాలు.

'ఒరేయ్, బుద్ధిలేని మొద్దుల్లారా... శుభకార్యం తలపెట్టామని ఆ తల్లికి చెప్పివచ్చారు మీ అయ్యగారు. ఆశీర్వదించటానికి వచ్చి ఉంటుంది. దించండి కర్రల్ని. చెంపలు వేసుకోండి..' అంటూ అరిచి కేకలు పెట్టిన మనిషిని చూసి 'ఏదిరా, ఎక్కడ కనిపించింది?' అని అడిగింది.

'అదిగో తల్లి, ఆ సపోటా చెట్టు కింద రెండు బారలుంది. పేద్దపడగ..' అరచేతుల్ని కలిపి చూపిస్తూ చెప్పాడు అతను.

అటు చూసి చెంపలు వేసుకుని, నమస్కారం చేసింది ఇంటి ఇల్లాలు. 'కావాలంటే గుడి దగ్గరికి వచ్చి నమస్కారాలు చేసుకుంటాం. నీ గురించి తెలి

**ప్రణవి, ప్రత్యూష ఒకర్నొకరు పట్టుకుని ఏడుస్తున్నారు. బ్యాగులు సర్దుకొని కర్నూలు బయల్దేరారు. పిచ్చమ్మి, శంకరయ్య, పంతులుగారు వాళ్లను ఆపడానికి ప్రయత్నిస్తున్నారు. కానీ ఎవరి మాటా వినటం లేదిద్దరూ. ఇంతలో సంపంగి వచ్చి 'బాజిరెడ్డి సారు ప్రణవమ్మతో మాట్లాడతారంట' అంటూ ఫోన్ ఇచ్చింది. బాజిరెడ్డితో మాట్లాడిన ప్రణవి కూలబడిపోయింది. అసలేం జరిగింది? ఫోన్‌లో బాజిరెడ్డి ఏం చెప్పాడు?**

## రకూల్ కోసం మూడు కోట్లు?

ఇది రకూల్ రెమ్యునరేషన్ ఫిగర్ కాదు. రకూల్, బెల్లంకొండ శ్రీనివాస్ కలిసి చేస్తున్న సినిమాలో ఓ పాట కోసం ఖర్చు పెడుతున్న మొత్తం. బెల్లంకొండ శ్రీనివాస్ సినిమాలో నటించేందుకే రకూల్‌కి ఫ్యాన్సీ అమౌంట్ ఇచ్చుకున్నారని అంటున్నారు. పైగా ఇప్పుడు ఇంత భారీగా ఖర్చు పెట్టడం టాలీవుడ్‌లో హాట్ టాపిక్ అయింది. ఈసారి ఎలాగైనా సక్సెస్ ట్రాక్ ఎక్కాలని బెల్లంకొండ పట్టుదలతో ఉండడంతో బడ్జెట్ విషయం పట్టించుకోవడం లేదట! ఈ పాటకు ఖర్చుపెట్టిన మొత్తంతో రెండు చిన్న సినిమాలు తీసి హిట్ కొట్టొచ్చు. ఇది ఆల్రెడీ ప్రూవ్ అయినా ఈ సినిమా మీద నిర్మాతలు ఎందుకింత ఖర్చు పెడుతున్నారో అర్థం కావడం లేదని కొందరు అనుమానం వ్యక్తం చేస్తున్నారు.

యని వాళ్లకు కనిపిస్తే వట్టి విషప్పురుగువని అనుకుంటారు. వెళ్ళిరా తల్లి..' అంటూ వేడుకుంది.

'వానపాముని చూసినా మా అక్క ఇవే మాటలు మాట్లాడుతుంది. పద అన్నా, మనం బండోడి దగ్గరికి పోయి వద్దాం' అంటూ చనువుగా చెయ్యి పట్టుకుని వెట్టిని నడిపించాడు యువకుడు.

తనకు తెలియకుండానే పనివాడు చెప్పిన సపోటా చెట్టు కిందికి చూశాడు వెట్టి. ఎండిపోయిన ఆకులు, చెదారం తప్ప ఏమీ కనిపించలేదు, అక్కడ వెలుగుతున్న కరెంట్ దీపపు కాంతిలో.

మెయిన్‌గేటును దాటి మూడే మూడు అడుగులు వేశాడు. నాలుగో అడుగు వేయకముందే ఆవరణ వెలుపల, ప్రహరీగోడను ఆనుకుని ఉన్న ఒక నందివర్ధనం మొక్క దగ్గర కనిపించింది అతనికి...

చుట్టలు చుట్టుకుని తలను కొంచెంగా పైకి ఎత్తి పడగను ముందుకీ వెనక్కీ ఊపుతూ.

●●●

ఎనిమిదిగంటలు దాటిన రెండు మూడు నిమిషాలకు పెళ్ళిమాటని పిచ్చమ్మి చెవిన వేశాడు శివారెడ్డి. వెంటనే చిన్నపాటి అభ్యంతరాన్ని కూడా వెలువరచకుండా తలను ఊపేసిందామె. వీరభోజుడికి కబురు అందచేయమని కూడా చెప్పింది.

శివారెడ్డి చేయలేదు ఫోను. అతని భార్యగాని, పంతులుగారుగాని, ఎవరూ చేయలేదు. తొమ్మిది గంటల నలభై రెండు నిమిషాల కల్లా, నలుగురు ముత్తయిదువల్ని, పసుపుకుంకుమల్ని, కళ్లు చెదిరిపోయే బంగారు నగల్ని, ఖరీదైన పట్టుచీరని పట్టుకుని శివారెడ్డి దగ్గరికి వచ్చేశాడు బాజిరెడ్డి.

'కదిరిస్వామి గుడికి ఫోను చేశాను. మహామంచిగా ఉందిట ఈ రోజు. తాంబూలాలు పుచ్చేసుకోవటానికి దివ్యమైన సమయమంట' తెచ్చిన వాటన్నిటినీ శివారెడ్డి బెడ్ దగ్గర పెట్టి ఎనౌన్స్ చేశాడు.

'నువ్వు రెడీ అయ్యావు బాగానే ఉంది. మేము కూడా అందుకు సిద్ధం అవ్వాలి కదా.. నువ్వు తీసుకువచ్చినటువంటివే మేము కూడా నీకు ముట్టచెప్పాలి కదా..' పొడవాటి తన కేశాలను గట్టిగా మెలిపెట్టి ముడి వేసుకుంటూ అన్నది పిచ్చమ్మి.

'మీ కాళ్ల దగ్గర పడి ఉండేవాణ్ణి. నాకు మీరు పనిగట్టుకుని ప్రత్యేకంగా ఏమీ ఇవ్వవలసిన అవసరం లేదు. మీ అమ్మాయి చాలు. తీసుకోండి' అన్నాడు బాజిరెడ్డి.

'నిజమే! పని కట్టుకుని మనం ప్రత్యేకంగా ఇవ్వాల్సిన అవసరం ఏమీలేదు. తనంతట తనే తీసేసుకుంటాడు తనకు కావాల్సినవన్నీ..' తన వెనుక నిలబడి ఉన్న పంతులుగారితో అన్నది పిచ్చమ్మి, అతి రహస్యంగా.

'తల్లీ.. వాడు ఎవర్నీ సంప్రదించలేదు. ఇవాళ చెడ్డరోజు కాకపోయినా, తాంబూలాలు తీసుకోవటానికి మాత్రం తగినది కాదు. తర్వాత చూసుకుందామని చెప్పండి' తను కూడా రహస్యంగానే అన్నాడు పంతులుగారు.

'ఏమిటి పంతులుగారు.. ఏమిటి గుసగుసలు..?' అసహనంగా అరిచినంత పనిచేశాడు బాజిరెడ్డి.

అంతకుముందే ఏదో మెడిసిన్ తీసుకున్నట్లున్నాడు శివారెడ్డి. మత్తుమత్తుగా ఉన్నది అతనికి. మూతలు పడిపోతున్న కనుల్ని అతిబలవంతంగా పైకెత్తి, పిచ్చమ్మి వైపు చూశాడు.

'వీరభోజుడి సంబంధం మనకు అంగీకారమే అని చెప్పి ఒక పూట కూడా గడవలేదు. తాంబూలాలు పుచ్చుకోవటానికి ఎందుకు తొందర?' అతన్ని అడిగింది ఆమె.

"ఒప్పుకున్నాము కదా.. ఒకరోజు అటో ఇటో... తేడా ఏముంటుంది?' ముద్దమాటలతో అడిగాడు శివారెడ్డి.

'తల్లీ.. సారును డిస్టర్బ్ చేయకూడదు. నిద్రపోనీయాలి. డిస్టర్బ్ అయితే మెడిసిన్ పని చేయదు' వెంటనే చెప్పాడు ఒక పక్కగా నిలబడి ఉన్న డ్యూటీ డాక్టరు.

'సరే.. ఇవ్వు' బాజిరెడ్డికి చెప్పింది పిచ్చమ్మి.

కిందపెట్టిన పళ్ళేరాలు తీసుకుని ఆమెవైపు అడుగు వేయబోయాడు అతను. 'ఈ ఇంటిపెద్ద నా బిడ్డడు. వాడికి ఇవ్వు' కమాండ్ చేసింది ఆమె.

వెనుక నుంచి తన భార్య సహాయం చేస్తుండగా, బాజిరెడ్డి అందించిన పళ్ళేరాలన్నిటినీ తీసుకుని తల ఊపాడు శివారెడ్డి,

థౌజండ్ కాండిల్స్ బల్బు మాదిరి వెలిగిపోవటం మొదలు పెట్టింది బాజిరెడ్డి ముఖం. 'మంచి ముహూర్తం చూపించి మళ్ళీ వస్తాను' అంటూ ఎంత వేగంగా వచ్చాడో అంతే వేగంగా వెళ్ళిపోయాడు.

'పదండి... అందరూ బయటకు రండి. సారును డిస్టర్బ్ చేయద్దు' అంటూ డాక్టరు మరోసారి హెచ్చరించడంతో ఆ గదిలో నుంచి బయటికి వచ్చారు అందరూ.

వచ్చిన రెండో నిమిషంలో పిచ్చమ్మి ముందు ప్రత్యక్షం అయ్యాడు శంకరయ్య. 'తల్లీ.. త్వరగా రావాలి' అంటూ అంతకుముందు ఎప్పుడూ చేయని పనిచేశాడు. ఆమె చేతిని పట్టుకుని ప్రణవి గదిదగ్గరికి వేగంగా లాక్కుపోయాడు.

గుండెలు అవిసిపోయేలా రోదిస్తోంది ప్రణవి. గట్టిగా కౌగలించుకుని, తనుకూడా కన్నీరు పెట్టుకుంటోంది ప్రత్యూష.

'నేను ఇప్పటికిప్పుడు కర్నూలు వెళ్ళిపోతాను. నన్ను ఆపగలవాళ్ళెవరో ఆపటానికి ప్రయత్నం చేసుకోవచ్చు' అంటూ ప్రత్యూషకి సైగ చేసింది ఉన్నట్లుండి ప్రణవి.

'తొందరపడకు ప్రణవీ.. అమ్మగారు..' అంటూ సముదాయించబోయింది ప్రత్యూష.

'నథింగ్ డూయింగ్! ఉయార్ వెకేటింగ్ దిస్ ప్లేస్' డిక్లేర్ చేసింది ప్రణవి. తమ బెడ్ కింద ఉన్న ఒక అరలో నుంచి, రెండు తూటాలను లోడ్‌చేసే షాట్‌గన్‌ని బయటికి తీసి పట్టుకుంది ప్రత్యూష.

'ఏయ్.. నీకేమైనా పిచ్చి ఎక్కిందా?' ఎందుకది? పెట్టేయ్ కింద' కోపంగా అంటూ ముందుకు అడుగు వేయబోయిన శంకరయ్యను, చేతిని అడ్డం పెట్టి ఆపేసింది పిచ్చమ్మి.

'నీ కూతురు నీ మాట వింటుంది. కాని అది నీ కూతురు కాదు. నా బిడ్డకు నీడ. నీ మాట వినదు. అవమానపడతావు' మెత్తగా చెప్పింది.

'మనకి వాళ్ళ వెహికల్స్ ఏవీ అవసరం లేదు. టాక్సీ మాట్లాడుకుందాము. డబ్బు కూడా తీసుకో' అన్నది ప్రణవి.

ఏ అరలో నుంచి గన్‌ని బయటకు తీసిందో, అదే అరలో నుంచి రెండు నోట్లకట్టలు కూడా బయటికి తీసి తన హ్యాండ్‌బాగ్‌లో పెట్టుకుంది ప్రత్యూష.

'వద్దమ్మా. తొందరపడద్దు. తెల్లారిన తర్వాత అన్నయ్యతో నేను మాట్లాడి...' గుమ్మం దగ్గర్నించి వెంటనే అబ్జెక్ట్ చేయబోయింది శివారెడ్డి భార్య.




## వేడిమొలక

*గుండెల్లో చలిపెడుతుంది*
*గడ్డకట్టుకున్న శీతల సరస్సులాంటిదేదో*
*లోన స్థిరనివాసమేర్పరచుకుంది.*
*దక్షిణధృవాల హిమవత్ పర్వతాలేవో*
*క్షణక్షణానికి పెరిగిపెద్దవవుతూ-*
*జాక్‌లండన్ 'to build a fire' లాంటిదేదో*

*తలచుట్టూ తిరుగుతుంది.*
*అనంతంగా విస్తరించిన మంచుమైదానాలు-*
*ఒక అగ్గిపుల్ల, ఒక ఎండుపుల్ల*
*ఒక కట్టెముక్క - ఆశగా తొంగిచూస్తున్న*
*నక్కమూతి-*
*ఒక కిరణం, ఒక కోరిక*
*ఒక తీక్షణదృక్కు-*
*రగులుతున్న పగలాంటి అగ్ని-*
*ఎక్కడ?*
*అంతా హిమవత్ పాతం, మంచుగాలులు*
*కింద నుంచి పై దాకా*
*భూమి నుంచి ఆకాశం దాకా*
*పాడెగుడ్డలాంటి తెల్లని వాతావరణం.*

*కారో మాస్టారి 'చావు' కథలోని*
*ముసలమ్మ కోరిక-*
*"బళ్ళకు బళ్ళు కట్టెల్లో*
*నన్ను తగలేస్తే తప్ప, ఈ చలిపోదు"*
*శీతల శైథిల్యం నుంచి*
*ఒక అగ్నికణపు బీజం నుంచి*



*ఒక వేడిమొలక-*
*రెండు అరచేతులు బలంగా రుద్దుకుని*
*ముఖాని కద్దుకుని-*
*ఎదురుగా నుంచున్న*
*పెద్దపులికేసి తేరిపార చూశా-*

***-శివారెడ్డి***
***ఫోన్: 040-24064195***

'ఎవరూ ఏమీ మాట్లాడాల్సిన అవసరం లేదు. తాంబూలాలు పుచ్చేసుకున్నారుగా. మంచిగా చేయండి పెళ్లిళ్లు.... నేను మాత్రం ఇంక ఒక్క క్షణం కూడా ఇక్కడ ఉండేది లేదు..' విసురుగా చెప్పింది ప్రణవి.

దిగులు నిండిన కనులతో పిచ్చమ్మి వంక చూసింది శివారెడ్డి భార్య.

'ప్రణవమ్మా! తొందరపాటు వద్దు. ఇక్కడివాళ్ళు నిన్ను అడ్డుకోలేక పోవచ్చు. కాని ఒకసారి రోడ్డు మీదికి చూడు..' అన్నాడు అప్పుడే వచ్చిన పంతులు గారు.

'ఏముంది రోడ్డుమీద? ఆ డ్రైవర్ శనిగాడు నిల బడి ఉంటాడు. ఒక్క తూటా చాలు వాడి పుచ్చె పగిలి పోవటానికి' అగ్రెసివ్‌గా అన్నది ప్రణవి.

'ఒక్కతూటాతో అడ్డంకి తొలగిపోయేటట్లయితే, ఆ తూటాని నేను ప్రయోగిస్తాను. నువ్వు ఒక్కసారి వచ్చి చూడు' మరింత ప్రశాంతంగా చెప్పాడు పంతులుగారు.

ప్రత్యూష వైపు చూసింది ప్రణవి. గన్‌ని అలాగే పట్టుకుని ముందు గదుల్లోకి పోయి, వెంటనే తిరిగి వచ్చింది ఆమె.

'వందమంది దాకా ఉన్నారు ప్రణవీ, వీధినంతా కవర్ చేస్తున్నారు. మనం ఎలా రియాక్ట్ అవుతామో వాడు ముందుగానే ఊహించాడు' చిన్నకంఠంతో చెప్పింది.




'అమ్మగారూ...' అంటూ అదే సమయంలో సంపంగి ఆ గది ముందుకు రావటంతో అటుకేసి చూశారు అందరూ.

'బాజిరెడ్డిసారు నాకు ఫోన్ చేశారు. ప్రణవమ్మతో మాట్లాడతారంట' తన ఫోన్‌ని ముందుకు జాస్తూ చెప్పింది.

'కొట్టేయ్... దాన్ని తీసుకుని నేలకేసి కొట్టేయ్..' కచ్చగా ప్రత్యూషకి చెప్పిన ప్రణవి వైపు కోపంగా చూసింది పిచ్చమ్మి.

'ఫోన్లు పగలగొట్టటం.. గ్లాసుల్ని విసిరేయటం... అందరి మీదా అరిచి కేకలు పెట్టడం ఇవన్నీ బుద్ధి తక్కువ వాళ్ళు చేసే పనులు... ముందు వాడు చెప్పేది విను' అంటూ కమాండ్ చేసింది.

సంపంగి దగ్గర ఫోన్ తీసుకుని, ప్రణవి చెవి దగ్గర పెట్టింది ప్రత్యూష.

'శివారెడ్డి తాంబూలం తీసుకున్నాడు. ఇచ్చిన మాటను తప్పి తిరిగే వంశం కాదు మీది. సంబంధం సెటిల్ అయిపోయింది. మీ అమ్మగారు ఒప్పేసుకు న్నారు. తప్పించుకోవటం నీకు ఇంక సాధ్యపడదు. ఈ ఏరియా అంతా నా కంట్రోల్‌లో ఉంది. కాళ్లు చేతులు కట్టిపడేసి అయినా సరే ఈ పెళ్లి జరి పిస్తాను' ఖంగుమంటూ వినవచ్చింది బాజిరెడ్డి కంఠం.

'నేను మేజర్ని. పోలీస్ రిపోర్టు ఇస్తాను' పళ్లు బిగిస్తూ చెప్పింది ప్రణవి.

'ఒకటి కాదు. వెయ్యి రిపోర్టులు ఇచ్చుకో! పెళ్లి ఆగదు. పెద్దవాళ్ల మాట కాదని పిల్లలు స్వతంత్రించే వంశం కాదు మీది. ఆ కట్టుబాటును మార్చదలుచు కుంటే నిరభ్యంతరంగా మార్చే ప్రయత్నం చెయ్యి. ఈ పెళ్లి మాత్రం ఆగదు'.

'నీ కొడుకు నా మెడలో తాళికడితే నా గొంతును నేనే పిసుక్కుని చచ్చిపోవాలి'.

'మంచిది. నా కోడలు అర్థంతరంగా చనిపోయిం దని అందరికీ చెపుతాను. సంతాపం ప్రకటిస్తాను. నువ్వు బతికి ఉన్నా, చనిపోయినా నా కొడుకు మాత్రం ఈ ఎస్టేట్‌కి అల్లుడే..' ఖంగుమంటున్న కంఠంతో చెప్పి పకపకా నవ్వాడు బాజిరెడ్డి.

నిఠారుగా నిలబడి ఉన్న ప్రణవి, పాదాల్లో ఓపిక నశించిపోయినట్లు బెడ్‌మీద కూలబడి పోయింది.

చేతిలోని ఫోన్‌ని గుమ్మంలో నిలబడి ఉన్న సంపంగి ముఖానికి గురిపెట్టి విసరబోయింది ప్రత్యూష.

'వద్దు' ఖంగుమంటూ కమాండ్ చేసింది పిచ్చమ్మి.

పైకెత్తిన ప్రత్యూష చేయి మధ్యలోనే ఆగి పోయింది.

శంకరయ్యకు సైగచేసింది పిచ్చమ్మి. ఆ ఫోన్ తీసుకుని, సంపంగికి అందించాడు అతను.

'వెళ్లు. అందరికీ తలనొప్పి అధికం అయిపోయింది. టీలు పెట్టి తీసుకురా' ఆర్డర్ ఇచ్చింది పిచ్చమ్మి.

బొమ్మలా బెడ్‌మీద కూర్చుండిపోయిన తన బిడ్డ దగ్గరికి పోయి తల మీద చెయ్యి వేసింది ఆమె.

'ఈ పెళ్లి ఆగిపోవటానికి ఎంతో సమయం అవ సరం లేదు. రెండంటే రెండు నిమిషాలు చాలు... నేను ఒక్కసారి కళ్లు మూసుకుని తల ఊపానంటే, నీ మెడలో తాళి కట్టటానికి ఆ పఠాన్‌గాడు ప్రాణా లతో ఉండడు. అవునా కాదా? రెండవచేత్తో ఆమె చుబుకాన్ని పట్టుకుని తనవైపు తిప్పుకుంటూ అన్నది.

'అమ్మ చెపుతున్నది అక్షరాలా నిజం ప్రణవి. విఠల్‌బాబుని ఆపటం ఎవరికీ సాధ్యపడదు' చిన్నగా అన్నది ప్రత్యూష.

'ఏడి తను? ఇక్కడ ఇంత రభస జరుగుతుంటే తాను ఏం చేస్తున్నాడు? ఇదిగో వచ్చేస్తున్నానని చెప్పి వెళ్లినవాడు ఎంతకీ రాకపోతే ఏమనుకోవాలి? గద్గదంగా అడిగింది ప్రణవి.

'వస్తాడే... వచ్చేస్తాడు.. వచ్చే పనిమీదనే ఉన్నాడు' అంటూ కనులు మూసుకుని చిత్రవిచిత్రంగా నవ్వింది పిచ్చమ్మి.

'అత్తమ్మ ఎందుకు నవ్వటం?' భయం భయంగా అడిగింది శివారెడ్డి భార్య.

'చూసి రమ్మంటే కాల్చి వచ్చేరకం. ఒకటి చెపితే వంద దారులు వెతికే ఘటం. ఉచ్చుల్ని సిద్ధం చేస్తు న్నాడు, తండ్రీకొడుకుల మెడలకు తగిలించడం కోసం..' అంటూ చెప్పిన తర్వాత కళ్లు తెరిచి పకపకా నవ్వింది పిచ్చమ్మి.

ట్రేలో టీకప్పుల్ని పెట్టుకుని సంపంగి రావ టంతో మాటల్ని పొడిగించలేదు ఎవరూ. అంతకు ముందే అన్నాలు తిన్న సంగతి మర్చిపోయినట్లు ఆ కప్పుల్ని అందుకున్నారు.

'నువ్వు వెళ్లి రెస్ట్ తీసుకో. అవసరం అయితే పిలుస్తాము. ఇవాళ మాకెవరికీ నిద్రలు రావు' చెప్పింది సంపంగికి శివారెడ్డి భార్య.

●●●

'చీకటిపడిన తర్వాత ఇంటిని వదిలి ఎక్కడికీ పోడు. ఇవాళ మాత్రం అందుకు విరుద్ధంగా ఉంది వాడి పద్ధతి' విసుగ్గా అన్నాడు వెట్టిని వెంటబెట్టు కుని తన స్నేహితుడి ఇంటికి తీసుకుపోయిన యువకుడు.

'పది గంటలు దాటి చాలాసేపు అయిపోయిన ట్లుంది' ఆకాశంలో నక్షత్రాలను బట్టి సమయాన్ని ఊహిస్తూ అన్నాడు వెట్టి.

అతను మాట్లాడుతూ ఉండగానే, పొడుగాటి బాణాకర్రను పట్టుకుని, వారిని వెతుక్కుంటూ రానే వచ్చాడు ఒక ఆజానుబాహుడు.

'అమ్మగారు ఎదురు చూస్తున్నారు. మాటలు చాలించి ఇంటికి వచ్చేయాలని చెప్పారు. వండిన పదార్థాలన్నీ చల్లారిపోతున్నాయట' అంటూ తమ యజమానురాలి ఆదేశాల్ని వినిపించాడు.

'ఇవాళ ఇంక వీడిని కలుసుకోవటం కుదిరే పని కాదుగాని, వెళ్ళిపోదాం అన్నయ్యా.... పొద్దున్నే వద్దాం' అంటూ స్నేహితుడి ఇంటిముందు ఉన్న బల్లమీది నుంచి లేచాడు యువకుడు.

'ఎవరు?' అంటూ వినవచ్చింది లోపలి నుంచి ఒక కంఠం.

'నేను బాబాయ్, బండోడి స్నేహితుణ్ణి. వాడి కోసం ఇందాకటినించీ ఎదురు చూస్తున్నాం..' అన్నాడు యువకుడు.

'మనం చాలాసేపటినుంచీ ఇక్కడ కూర్చుని ఉన్నాము. పెద్దగానే మాట్లాడుకుంటున్నాము. ఇప్పుడు ఎవరని అడగటం ఏమిటి?' ఆశ్చర్యంగా యువకుడిని అడిగాడు వెట్టి.

'రోజులో ఇరవైమూడు గంటల నలభై నిమిషాలు మందుమత్తులోనే ఉంటాడు బండోడి నాన్న. తెలి విగా ఉండే సమయంలో చీమ చిటుక్కుమన్నా ఖచ్చితంగా వినబడుతుంది. ఇప్పుడే మత్తు దిగింది కాబోలు' చిన్నగా చెపుతూ చటుక్కున మాటలు ఆపాడు యువకుడు.

పొడుగాటి చేతికర్రను ఆసరాగా తీసుకుని తడ బడుతున్న అడుగులతో గుమ్మం దాటి బయటికి వచ్చాడు ఒక వృద్ధుడు.

'ఓరోరి నువ్వేనా? ఎవరో అనుకున్నాను. మా బండోడితో పనేంటి?' అని అడిగాడు.

"ఈ అన్న తనతో ఏదో మాట్లాడాలని అన్నాడు.' వెట్టిని పరిచయం చేస్తూ చెప్పాడు యువకుడు. ఉన్నట్లుండి గాలిని వాసన చూస్తున్నట్టు ముక్కు ఎగబీల్చాడు ఆ వృద్ధుడు. "ఇక్కడ చౌడేశ్వరి ప్రసాదం వాసన వస్తోంది. ఎవరి దగ్గర ఉంది" అని అడిగాడు.

**(ఇంకా వుంది)**




డా॥ జి. సతీష్ రెడ్డి
MS. M.Ch. (Ortho) (UK)
Orthopedics & Joint Replacement Specialist
ప్రైమ్ హాస్పిటల్స్, హైదరాబాద్
ఫోన్. 98495 63360 / 040-4959 4959


# ఫ్రాక్చర్లకు మెరుగైన చికిత్సలు

## తీవ్రతను బట్టి చికిత్స సర్జరీ అవసరం కావచ్చు

మన నిత్యజీవితంలో ఫ్రాక్చర్ అనే మాట రెగ్యులర్‌గా వింటుంటాం. ప్రమాదవశాత్తు జారిపడినప్పుడు, వాహనాల ప్రమాదాలలో ఎముక విరగడం లేదా చిట్లడాన్ని చూస్తుంటాం. దీనినే ఫ్రాక్చర్ అంటాం. ఫ్రాక్చర్ అయినప్పుడు ఎముక మొత్తం విరగవచ్చు లేదా పాక్షికంగా విరగవచ్చు. ఎముకలు ధృఢంగా ఉంటాయి. వాటిపై ఎక్కువగా ఒత్తిడి పడినప్పుడు అవి విరిగే అవకాశం ఉంటుంది. ప్లాస్టిక్ స్కేల్‌ను బలంగా వంచితే ఎలా విరుగుతుందో అలాగే ఎక్కువగా ఒత్తిడికి గురైనప్పుడు ఎముకలు విరిగుతాయి. ఎముక విరగడానికి ఎంత ఒత్తిడి పడిందనే అంశంపై ఫ్రాక్చర్ తీవ్రత ఆధారపడి ఉంటుంది. వాహన ప్రమాదాలలో ఎక్కువగా ఎముకలు ఎక్కువగా ఒత్తిడికి గురై విరగడం లేదా చిట్లడం జరగవచ్చు. కొన్ని ఫ్రాక్చర్లలో ఎముక విరిగినచోట చర్మం చిట్లి ఆ




ప్రాంతం నుంచి ఎముక బయటకు వస్తుంది. దీనినే ఓపెన్ ఫ్రాక్చర్ అంటారు. ఈ తరహా ఫ్రాక్చర్లలో ఇన్‌ఫెక్షన్ రిస్క్ ఎక్కువగా ఉంటుంది. ఫ్రాక్చర్ తీవ్రతను బట్టి చికిత్స ఆధారపడి ఉంటుంది. ప్రస్తుతం అన్ని రకాల ఫ్రాక్చర్లకు మెరుగైన చికిత్సలు అందుబాటులో ఉన్నాయి.

### ఫ్రాక్చర్లలో రకాలు

**స్టేబుల్ ఫ్రాక్చర్ :** బోన్‌లైన్‌లో పగులు రావడాన్ని స్టేబుల్ ఫ్రాక్చర్ అంటారు.

**ఓపెన్, కాంపౌండ్ ఫ్రాక్చర్ :** ఎముక విరిగినప్పుడు చర్మం చిట్లి ఎముక బయటికి వస్తుంది. ఈ తరహా గాయాలలో ఎముక కనిపించవచ్చు లేదా కనిపించకపోవచ్చు.

**ట్రాన్స్‌వర్స్ ఫ్రాక్చర్ :** ఎముక అడ్డంగా విరగడాన్ని ట్రాన్స్‌వర్స్ ఫ్రాక్చర్ అంటారు.

**ఆబ్లిక్ ఫ్రాక్చర్ :** ఒక కోణ ఆకృతిలో ఎముక విరగడాన్ని ఆబ్లిక్ ఫ్రాక్చర్ అంటారు.

**కమ్మిన్యుటెడ్ ఫ్రాక్చర్ :** ఎముక మూడు లేదా అంతకన్నా ఎక్కువ ముక్కలుగా విరగడాన్ని కమ్మిన్యుటెడ్ ఫ్రాక్చర్ అంటారు.

### కారణాలు :

**ట్రామా :** వాహన ప్రమాదాలు, స్పోర్ట్స్ గాయాల వల్ల ఎముకలు విరుగుతుంటాయి.

**ఆస్టియోపోరోసిస్ :** ఈ రుగ్మత వల్ల ఎముక బలహీనపడి విరిగే అవకాశం ఉంటుంది.

**ఓవర్‌యూస్ :** ఒకేరకమైన కదలికలు ఎక్కువసార్లు చేయడం వల్ల కండరాలు ఎక్కువగా అలసటకు గురై, ఆ ఒత్తిడిని ఎముకలకు బదిలీ చేస్తాయి. దీని వలన స్ట్రెస్ ఫ్రాక్చర్ సమస్య ఉత్పన్నం కావచ్చు. అథ్లెట్లలో ఈ తరహా ఫ్రాక్చర్లు వెలుగుచూస్తుంటాయి.

### లక్షణాలు :

చాలా రకాల ఫ్రాక్చర్లలో నొప్పి ఎక్కువగా ఉంటుంది. దాంతోపాటు మరికొన్ని లక్షణాలు కూడా ఉంటాయి.

- గాయం చుట్టూ వాపు ఉంటుంది. ఆ ప్రాంతం సున్నితంగా ఉంటుంది.
- ఫ్రాక్చర్ వల్ల ఏదైనా అవయవం స్థానభ్రంశం చెందవచ్చు.

ఎముక విరిగిన రోగిని వైద్యులు క్షుణ్ణంగా పరీక్షిస్తారు. గాయం ఎలా అయ్యింది, లక్షణాలు, ఇతర ఆరోగ్య పరిస్థితి తదితర వివరాలు అడిగి తెలుసుకుంటారు. ఎక్స్-రే-తీయించమని చెబుతారు. ఎక్స్-రేలో ఎముక విరిగింది లేనిది తెలుస్తుంది. ఒక వేళ ఎముక విరిగితే ఏ భాగంలో విరిగింది తెలుసుకోగలుగుతారు.

### చికిత్స :

ఎముక విరిగినప్పుడు దానిని యథాస్థానానికి తీసుకువచ్చి, అది నయం అయ్యేంతవరకు కదలకుండా చేస్తారు. విరిగిన ఎముకను పునననరుద్ధరించి వైద్యులు యథాస్థితికి తీసుకువస్తారు. ఫ్రాక్చర్ తీవ్రతను బట్టి సర్జరీ కూడా అవసరం కావచ్చు. ఓపెన్ లేదా క్లోజ్ ఫ్రాక్చరా...? ఏదైనా ప్రత్యేక ఎముక విరిగిందా..? అనే అంశాల ఆధారంగా సర్జరీ అవసరం అవుతుంది. ఉదాహరణకు వెన్నుముక(వర్టిబ్రా) ఎముక విరిగితే కాలి, తుంటి ఎముకలు విరిగినప్పుడు అందించే చికిత్స కంటే భిన్నంగా చికిత్స అందిస్తారు.

### చికిత్సలో రకాలు :

కాస్ట్ ఇమ్మొబిలైజేషన్ : ప్లాస్టర్ లేదా ఫైబర్‌గ్లాస్ కాస్ట్ పట్టీతో చికిత్స అనేది ఫ్రాక్చర్లలో చాలా సాధారణ చికిత్స. విరిగిన ఎముకను యథాస్థితికి తీసుకువచ్చి పట్టీ వేయడం వల్ల అది నయం అవుతుంది.

ఎక్స్‌టర్నల్ ఫిక్సేషన్ : ఈ ఆపరేషన్‌లో ఎముక విరిగిన చోట కింద, పైభాగంలో పిన్స్ లేదా స్క్రూలు అమర్చి పైభాగంలోకి చర్మానికి అనుసంధానిస్తారు. దాంతో విరిగిన ఎముక యథాస్థితికి చేరుకుంటుంది. ఎముక విరగడంతో పాటు మృధుకణజాలం ఎక్కువగా దెబ్బతిన్న కేసులలో శస్త్ర చికిత్సను తట్టుకునేంత వరకు ఎక్స్‌టర్నల్ ఫిక్సేటర్ పరికరాన్ని అమర్చుతారు.

ఓపెన్ రిడక్షన్ అండ్ ఎక్స్‌టర్నల్ ఫిక్సేషన్ : ఈ ఆపరేషన్‌లో ముందుగా విరిగిన ఎముకను యథాస్థానానికి తీసుకవచ్చి ప్రత్యేక స్క్రూలు లేదా మెటల్ ప్లేట్స్‌తో అమర్చుతారు. ఎముక మధ్యలో రాడ్స్‌తో కూడా విరిగిన ఎముకలను కలుపవచ్చు. తొడ ఎముక విరిగినప్పుడు ఇంట్రామెడ్యులరీ నెయిల్ అనే ప్రత్యేకంగా రూపొందించిన మెటల్ రాడ్‌తో మెరుగైన ఫలితం లభిస్తుంది. మోచేయి భాగంలో ఎముకలు విరిగితే ప్లేట్లు, స్క్రూలతో చికిత్స అందించి యథాస్థితిని తీసుకువస్తారు.

### ఎన్ని రోజుల్లో నయమవుతుంది...?

ఫ్రాక్చర్లు నయం కావడానికి కొన్ని వారాల నుంచి కొన్ని నెలల వరకు సమయం పడుతుంది. నయం కావడం అనేది ఏర్పడిన గాయం, వైద్యుల సలహాలు పాటించడం తదితర అంశాలపై ఆధారపడి ఉంటుంది. సర్జరీ వల్ల త్వరగా నయం కాదు, విరిగిన ఎముకలు యథాస్థితిని చేరుకోవడానికి ఉపయోగపడుతుంది. బ్రాస్ లేదా పట్టీ తొలగించిన తర్వాత కూడా సాధారణ కార్యకలాపాలు నిర్వహించే వరకు కదలికలను పరిమితం చేసుకోవాల్సి ఉంటుంది. రికవరీ సమయంలో కొన్ని వ్యాయామాలు కండరాలు ధృడంగా మారేందుకు దోహదపడతాయి.

### నివారణ

ఆహారపు అలవాట్లు, వ్యాయామం కొన్ని రకాల ఫ్రాక్చర్లను నివారిస్తాయి. కాల్షియం, విటమిన్ డి అధికంగా ఉండే ఆహారం తీసుకోవడం వల్ల ఎముకలు బలంగా మారతాయి. బరువు మోసే వ్యాయామాలు కూడా ఎముకలు బలంగా ఉండేందుకు దోహదపడతాయి.




# మన్వంతరాలు:వైవస్వతమనువు జననం

**గోరూపం ధరించిన భూదేవికి తగిన లేగదూడలను ఏర్పరిచి, చరాచర భూతాలన్నీ తమ అభీష్టాను సారం శక్తులు సాధించాయి. పరమానందభరితమయ్యాయి అని ఆగాడు వైశంపాయనుడు. కళ్లు మూసుకుని శ్రద్ధగా వింటున్న జనమేజయుణ్ణి చూశాడు. అతని ఉత్సాహాన్నీ, ఉత్కంఠనీ గమనించి మళ్లీ చెప్పసాగాడిలా.**

అలా ముల్లోకాల వారి అభీష్టాలనూ నెర వేర్చిన భూదేవి ఆనాటి నుండి ధాత్రి, విధాత్రి, పావని అన్న పేర్లతో ప్రసిద్ధురాలైంది. పృథుచక్ర వర్తి కోరిక మేరకు అతనికి పుత్రికై, పృథ్వి అయింది. ఆ సార్వభౌముని పరిపాలనలో సకలసస్యాలతో, రత్నరాసులతో, అనేక గ్రామాలూ, నగరాలతో కళ కళలాడింది. అలాగే వేదవేదాంగవేత్తలైన విప్రులకూ, పరాక్రమవంతులైన క్షత్రియులకూ, వాణిజ్య వేత్తలైన వైశ్యులకూ, శ్రమించే శూద్రులకూ తగిన వృత్తులు అనుగ్రహించి పృథుచక్రవర్తి కూడా ప్రాతఃస్మరణీయుడైనాడు.

కళ్లు తెరిచాడు జనమేజయుడు. వైశంపాయ నుణ్ణి చూశాడు. చేతులు జోడించాడు. అడిగాడిలా.

మునీంద్రా! మన్వంతరాల గురించి తెలియ జేయండి.

తప్పకుండా అన్నాడు వైశంపాయనుడు. చెప్ప సాగాడిలా.

ఆదిమనువు స్వాయంభువుడు. అతని కాలంలో యాములన్న పన్నెండుమంది దేవతలయ్యారు. బ్రహ్మదేవుని తేజస్సే రూపాన్ని ధరించి మహేం ద్రుడయింది. మరీచి, అత్రి, అంగిరసుడు, పుల స్త్యుడు, పులహుడు, క్రతువు, వసిష్ఠుడు సప్త మహా ఋషులయ్యారు. ప్రియవ్రతుడూ, ఉత్తానపాదుడూ స్వాయంభువమనువు కుమారులు. వారిద్దరూ రాజులైనారు. ప్రియవ్రతునికి అగ్నీధ్రుడు, అగ్ని బాహువు, మేధుడు, మేధాతిథి, వసువు, జ్యోతి ష్మంతుడు, ద్యుతిమంతుడు, హవ్యుడు, వపుష్మం తుడు, సవలీడు అని పదిమంది కుమారులు జన్మించారు. వారిలో అగ్నిబాహువు, మేధుడు, హవ్యుడు రాజ్యకాంక్షలేక తపోవనాలకు తరలి పోతే, మిగిలిన ఏడుగురూ ఏడు ద్వీపాలను పాలిస్తూ వారి వారి కుమారులను భారతం, రమ్యకం, కింపురుషాది వర్షాలకు అధిపతులుగా నియమిం చారు.

స్వారోచిషుడు ద్వితీయ మనువు. అతని కాలంలో దేవతలు, తారాజికులు, తుషితులు అని రెండు గణాలయ్యారు. విపశ్చిత్తుడు మహేంద్రుడయ్యాడు. ఊర్జుడు, ప్రాణుడు, దత్తుడు, అగ్ని, ఋషభుడు, చ్యవనుడు, బృహస్పతి... ఈ ఏడుగురూ సప్త ఋషులయ్యారు. జైత్రుడు, కింపురుషుడాదిగా ద్వితీయ మనువు కుమారులంతా అనేక క్షత్రియ కులాలకు ఆది పురుషులయ్యారు. మూడవ మనువు ఉత్తముడు. సుధామ, సత్యాశివ, వ్రతర్పణ, వశ వర్తులు అమరగణాలయ్యాయి. పుణ్యాత్ముడు శాంతి దేవేంద్రుడయ్యాడు. వసిష్ఠుని కుమారులైన సుతే జుడు ఆదిగా ఏడుగురు సప్త ఋషులయ్యారు. నిషండు, ఊర్జుడు, వత్సుడు, మధువు, మాధవుడు, నహుడు, శుచి, శుక్రుడు, నభస్యుడు, నభుడు అనే ఈ మనుకుమారులంతా లోకపాలకులై ఆయా వంశాలకు ఆదిపురుషులయ్యారు.

తామసుడు నాలుగవ మనువు. అతని మన్వం తరంలో హరి, సత్య, సుధీ, సుధాదుల పేర్లతో దేవతలు నాలుగు గణాలయ్యారు. శిబి దేవేంద్రు డయ్యాడు. కావ్యుడు, పృథుడు, అగ్ని, జహ్నుడు, ధాత, కపివంతుడు, పవనుడు అన్నవారు సప్త ఋషులయ్యారు. జ్యోతి, తపస్యుడు, సుతపుడు, తపోమూలుడు, తపోధనుడు, తపోరతి, తన్వి,

**ఆ పరమేశ్వరుని వంశ చరిత్ర చెప్పేముందు మన్వంతరాల వృత్తాంతాన్ని జనమేజయునికి వివరించాడు వైశంపాయనుడు. నాలుగు యుగాలు కలిసి ఇరవైఏడుసార్లు పరిభ్రమించడమే ఒక మన్వంతరం. అది ముగిశాక మళ్లీ ప్రాణికోటి సృష్టి జరుగుతుంది. ఇక తర్వాత సూర్యునిగాథ కూడా వివరించాడు వైశంపాయనుడు. మరి ఆ కథాక్రమం ఏమిటి?**

ధన్వి, అకల్మాషుడు, పరంతపుడు ఈ మను కుమారులంతా లోకపాలకులై వారి వారి వంశా లకు ఆదిపురుషులయ్యారు.

రైవతుడు అయిదవ మనువు. అతని కాలంలో సుమేధసులు, భూతనయులు, వైకుంఠులు, స్వామి భోగులు పేర్లతో దేవతలు నాలుగు గణాలయ్యారు. విభుడు దేవేంద్రుడయ్యాడు. వేదబాహుడు, విని ద్రుడు, వేదశిరుడు, హిరణ్యరోముడు, సత్యనేత్రుడు, పర్జన్యుడు, ఊర్ధ్వబాహుడు సప్త ఋషులయ్యారు. ధృతిమంతుడు, అవ్యయుడు, తత్త్వదర్శి, నిరుత్సు కుడు, అరణ్యుడు, ప్రకాశుడు, నిర్మోహుడు, సత్య వాక్కు, కృతి, రైవతుడు లోలకపాలకులై రాజ వంశకర్తలయ్యారు.

చాక్షుషుడు ఆరవ మనువు. అతని కాలంలో ఆద్యులు, ప్రభూతులు, ఋభువులు, పృథుజ్ఞులు, లేఖులు అని దేవతలు అయిదు గణాలయ్యారు. మనోజ్ఞుడు దేవేంద్రుడయ్యాడు. అంగిరసుని కుమా రులు ఏడుగురు సప్తఋషులయ్యారు. మనువు కుమారులైన ఉరువు మొదలైనవారు ఈ భూత లాన్ని పాలించారు.

ఏడవ మనువు వైవస్వతుడు. ఇప్పుడు ఈయన మన్వంతరమే కొనసాగుతోంది. ఈ మన్వంతరంలో వసువులు, రుద్రులు, ఆదిత్యులు, మరుత్తులు, విశ్వ దేవులు, సాధ్యులు, ఆశ్వినులు...అనిదేవతలు ఎని మిది గణాలయ్యారు. ఊర్జస్వి దేవేంద్రుడయ్యాడు. కశ్యపుడు, అత్రి, విశ్వామిత్రుడు, గౌతముడు, భర ద్వాజుడు, జమదగ్ని, వసిష్ఠుడు సప్తఋషుల య్యారు. ఇక్ష్వాకుడు ఆదిగా ఈ మనువు పదిమంది కుమారులు ఆయా క్షత్రియవంశాలకు ఆదిపురు షులయ్యారు. మనువులు, మహేంద్రులు, అమ రులు, సప్త ఋషులు కాలావధుల మేరకు తమ తమ పదవుల నుండి తొలగిపోయి, మిగిలిన వారికి ఆయా స్థానాలను అప్పగించడం జరుగు తున్నది. తొలగిన ప్రముఖులంతా పరబ్రహ్మపదం చేరుకుంటున్నారు. మళ్లీ జన్మించడం లేదు.

భవిష్యత్తులో సూర్యుని కుమారుడు సావ ర్ణుడు, ఎనిమిదవ మనువు అవుతాడు. అతని కాలంలో తపస్సులు, సునాభులు, ముఖ్యులు అని దేవతలు మూడు గణాలుగా వర్ధిల్లుతారు. బలి చక్రవర్తి దేవేంద్రుడవుతాడు. పరశురాముడు, పారాశర్యుడు, ఋష్యశృంగుడు, కృపాచార్యుడు, అశ్వ త్థామ, దీప్తిమంతుడు, గాలవుడు సప్త ఋషులవు తారు. పరీవాసుడు, తురీవాసుడు, వసుడు, వరి ష్ఠుడు, నాథుడు, ధృష్ణుడు, వాసుడు, సుసరీషుడు, వృష్ణి, సుమతి మొదలైన మనుకుమారులంతా రాజులై వారి వారి వంశాలను వృద్ధి చేస్తారు. దక్ష ప్రజాపతి మనుమలు (కూతురు కొడుకులు) నలు గురు మేరువుతో సమానమైన శరీరచ్ఛాయ కలిగి, సావర్ణులయ్యారు. వారిప్పుడు తీవ్ర తపస్సు ఆచ రిస్తున్నారు. రుచి రాజు కుమారుడు రౌచ్యుడు, భూతి కుమారుడు భౌత్యుడు ఆదిగాగల ఏడుగురు భవిష్యత్‌కాలంలో మనువులు అవుతారు. వారి కాలాల్లో రానున్న సురలు, సురేంద్రలను గురించి పురాణాల్లో వివరంగా ఉంది.

నాలుగేసి యుగాలు ఒక్కటిగా ఇరవై ఏడు సార్లు పరిభ్రమిస్తే అది ఒక మన్వంతరం. మన్వం తరం ముగియగానే జలప్రళయం సంభవిస్తుంది. ఆ ప్రళయంలో ప్రాణికోటి అంతా కొట్టుకుపోతుంది. తర్వాత మళ్లీ ప్రాణిసృష్టి ప్రారంభమవుతుంది.

ఇలా వేయి యుగాలు గడిస్తే అది బ్రహ్మదేవునికి ఒక పగలుతో సమానం. అప్పుడు సూర్యుని భయం కర కాంతిజ్వాల ప్రాణులన్నిటినీ హరిస్తుంది. ఆ జ్వాల తీవ్రతను తట్టుకోలేని అమరేశ్వరులు అజుడు మొదలైనవారంతా మహావిష్ణువు ఉదరంలో ప్రవే శించి ప్రాణాలను కాపాడుకుంటారు

ఆగాడు వైశంపాయనుడు. దీర్ఘంగా నిట్టూర్చాడు. తర్వాత మళ్లీ జనమేజయునికి చెప్పసాగాడిలా.

నేను ఇప్పుడు నీకు చెప్పిన సంఘటనలన్నీ ప్రతి కల్పంలోనూ సర్వసాధారణంగా జరిగి తీరు తాయి. ఇదీ సూక్ష్మంగా మన్వంతరాల వృత్తాంతం. ఈ ప్రపంచం అంతా ఆ పరమేశ్వరుని సృష్టి. అతడు అక్షరస్వరూపుడు. అతను జన్మించిన వృష్ణి వంశం గురించి వివరించే ముందు నీకు ఇవన్నీ తెలియాలి కనుక చెప్పాను. ఇప్పుడు ఏడవ మనువు వైవస్వతుని వృత్తాంతం తెలియజేస్తాను. శ్రద్ధగా విను.

తప్పకుండా అన్నాడు జనమేజయుడు. వైశం పాయునికి నమస్కరించి కూర్చున్నాడు. చెప్ప సాగాడిలా వైశంపాయనుడు.

భర్త కశ్యపుణ్ణి అనేక విధాల అర్చించి, వేయి కిరణాలతో విలసిల్లే ఆదిత్యుణ్ణి గర్భంలో ధరించింది అదితి. ఆదిత్యుని తేజోరాశి కారణంగా ఆమె శరీర కాంతి వెలవెలబోయింది. క్షీణించిందామె. గమనిం చాడది కశ్యపుడు. భార్య గర్భంలో ఉన్నది మృతాండం కాదుకదా? అనుకున్నాడు. ఆ మాటకు అనుగుణం గానే కొంతకాలానికి మార్తాండుడు అన్న పేరుతో ఆదిత్యుడు జన్మించాడు. వేడి వేడి వెలుగులు విర జిమ్మి, లోకాలను చీకాకు చేశాడు. కొన్నాళ్ళకు సంజ్ఞా దేవి అతని భార్య అయింది. ఆమె త్వష్ట కుమార్తె. సంజ్ఞాదేవి మహా సుకుమారి. మార్తాండుడి తేజో రాశిని భరించలేకపోయేది. అయినా ఓర్చుకుని, భర్తతో అణకువగా మెలగేది. ఆమెకు వైవస్వతమనువు, యముడు అని ఇద్దరు కుమారులు కలిగారు. యమున అని ఓ కుమార్తె కూడా కలిగింది.

రానురానూ మార్తాండుని వేడిమిని తట్టుకోలేక పోయింది సంజ్ఞాదేవి. తన నీడతో అందమైన స్త్రీని సృజించింది. ఆమెకు ఛాయ అని పేరు పెట్టింది. పుట్టిన మరుక్షణం చేతులు జోడించి సంజ్ఞాదేవికి నమస్కరించింది ఛాయ. ఆమె ముందు నిలిచింది. ఏం చెయ్యాలో చెప్పమంది.

నేను కొంతకాలం మా పుట్టింటికి వెళ్ళి సేద దీరుతాను. నువ్వు ఇక్కడే ఉండి, నా భర్తకి ఎలాంటి అనుమానం రానీయకుండా నాలాగే ప్రవర్తించు. నా భర్తని ఆనందింపజెయ్యి అన్నది సంజ్ఞాదేవి. సరేనన్నది ఛాయ.

పొరపాటున కూడా నేను పుట్టింటికి వెళ్లిన సంగతి నా పతిదేవునికి తెలియకూడదు.

తెలియనివ్వను అన్నది ఛాయ.

పిల్లలను ప్రేమగా చూసుకో!

అలాగేనన్నది ఛాయ.

పతిదేవుడు తిట్టినా, కొట్టినా మన రహస్యం తెలియనివ్వను. నువ్వు హాయిగా పుట్టింటికి వెళ్లిరా.

ఛాయ మాటతో ధైర్యంగా పుట్టింటికి చేరు కున్నది సంజ్ఞాదేవి. కూతురు వచ్చిన కారణాన్ని తెలుసుకున్నాడు త్వష్ట. తప్పును ఎత్తి చూపాడు. ఆమెకు చెప్పాడిలా.



తల్లీ! మంచివాడైనా, చెడ్డవాడైనా భర్త భర్తే! అతనే భార్యకి ఆత్మీయుడు. అతన్ని అసహ్యించు కోవడం, అతనికి దూరంగా మెలగడం స్త్రీకి శుభం కాదు. నా మాట విను. వెళ్లిపో ఇక్కణ్నుంచి.

భయపడుతున్న సంజ్ఞాదేవిని ఓదార్చాడు. ఆమె కన్నీరు తుడిచి పంపాడు.

మార్తాండుని తేజోరాశిని భరించలేక, ఇంటికి వెళ్లడం ఇష్టంలేక, దుఃఖిస్తూ సంజ్ఞాదేవి ఆడగుర్రం రూపు ధరించింది. ఓ నిర్జన ప్రదేశంలో నిల్చుంది. సమాగమాన్ని కోరుతూ ఏకాగ్రచిత్తంతో భర్తను ప్రార్థించసాగింది.

సంజ్ఞాదేవి ఆజ్ఞాపించినట్టుగానే మార్తాండు నికి ఎలాంటి అనుమానం రానీయలేదు ఛాయ. భర్తతో సంజ్ఞాదేవిలాగానే ప్రవర్తించసాగింది. ఛాయను సంజ్ఞాదేవిగా భావిస్తూ ఆమెతో అనుకూలంగా జీవించసాగాడు మార్తాండుడు. వారిద్దరికీ సావ ర్ణుడు, శనైశ్చరుడు అని ఇద్దరు కుమారులు జన్మిం చారు. తపతి అని ఓ కుమార్తె కూడా జన్మిం చింది. తన పిల్లలను ప్రేమగా చూసుకుంటూ, సంజ్ఞాదేవి పిల్లలను పట్టించుకోవడం మానేసింది ఛాయ. ఆమె పిల్లలు ముగ్గురూ అదే కోవలో నడి చారు. పెద్దవాళ్లను దూరంగా ఉంచారు. అనేక విధాల వారిని ఏడిపించసాగారు. యముడు అది తట్టుకోలేకపోయాడు. ఒకనాడు ఛాయను కాలుతో తన్నబోయాడు. తన్నేందుకు కాలెత్తి అంతలోనే నిగ్రహించుకున్నాడు. ఆ ప్రయత్నాన్ని మానుకు న్నాడు. యముని ప్రవర్తన భరించలేకపోయింది ఛాయ. కోపించిందామె. శపించిందిలా.

తల్లి అన్న భయభక్తులు లేకుండా నన్ను తన్నా లని ప్రయత్నించావు. ఏ కాలినైతే నన్ను తన్నా లని పైకెత్తావో ఆ కాలు ముక్కలు ముక్కలై నేల మీద పడుగాక!

ఛాయ శాపానికి భయపడిపోయాడు యముడు. తండ్రిని సమీపించాడు. జరిగిందంతా వివరించా డతనికి.

తండ్రీ! పిల్లలందరినీ తల్లి సమానంగా చూసు కోవాలి కదా! అమ్మ అలా చూడడం లేదు. చిన్న వాళ్లను చేరదీసి, పెద్దవాళ్లను చీకొడుతోంది. తట్టు కోలేక తన్నబోయాను. తప్పే చేశాను. నన్ను క్షమించి, తల్లి శాపం ఫలించకుండా చూడు, నన్ను కరుణించు.

కొడుకు యముని ప్రార్థనను మార్తాండుడు కొట్టిపారేయలేదు. అంగీకరించాడు.

ధర్మజ్ఞుడివి. వినయశీలివి. నువ్వు ఇంతటి ఆవే శానికి గురి అయ్యావంటే తప్పకుండా ఏదో ఒక కారణం ఉండి ఉంటుంది. అయితే నీ తల్లి శాపాన్ని తొలగించడం కష్టం. దానిని నువ్వు అనుభవించక తప్పదు.

తండ్రీ అని పెద్దగా రోదించాడు యముడు. అతన్ని ఓదారుస్తూ అన్నాడిలా మార్తాండుడు.

దీనికొక ఉపాయం ఉన్నది. కీటకాలేవైనా నీ పాదాన్ని దొలచి, కొంత మాంసాన్ని నేల మీద పడవేస్తే నీ తల్లి శాపం తొలగిపోతుంది. నీకేం కాదన్నాడు మార్తాండుడు. కొడుకును అనుగ్రహిం చాడలా.

**-అరణి**

# పాకడమూ ఓ వ్యాయామమే!!



**వ్యాయామం అంటే భారీ కసరత్తులు చేయడం అనుకునేరు. పాకితే చాలండీ! వ్యాయామం చేసినట్లే. అదేంటి చిన్నపిల్లల్లా పాకడం అనుకుంటున్నారా! అవును, ఈ వ్యాయామం మీరు చిన్నతనంలో చేసే ఉంటారు. ఇప్పుడు మళ్లీ ప్రాక్టీసు చేస్తే సరి! దేశ, విదేశాల్లో ఇప్పుడిప్పుడే ఈ వ్యాయామం క్రేజ్ సంపాదించుకుంటోంది. క్రాల్ ఎక్సర్‌సైజ్‌గా పిలుచుకునే ఈ వ్యాయామం వల్ల మరిన్ని లాభాలు ఉన్నాయంటున్నారు ఆరోగ్య నిపుణులు. అవేమిటో తెలుసుకుందామా!**

చిన్నపిల్లలు పాకుతూ ఉంటే ఎంతో మురిసిపోతాం కదా! అదే పెద్దవారు పాకుతూంటే మాత్రం ఆశ్చర్యపడక తప్పదు. అలా పాకేవాళ్లని చూసినప్పుడు, అరే! అప్పుడే వయసు మీరిపోయిందా? లేక కాళ్లూ చేతులు పనిచేయట్లేదా? అనుకుంటాం. కానీ ఈ పాకడం అనేది ఈ సంవత్సరం కొత్త ట్రెండ్ అండీ! ఎప్పుడూ ఒకే రకం వ్యాయామం చేసి చేసి విసుగొచ్చినవాళ్లు ఈ వ్యాయామం ఓసారి ట్రై చేసి చూడండి. ఫన్నీగానూ ఉంటుంది. శరీరానికీ మంచిది!

## క్రాలింగ్ ఇప్పుడో ఆకర్షణ

బాడీ బిల్డర్‌లాంటి కండలు చూసుకుని సగటు మనిషి మురిసిపోయే స్థాయి ఎప్పుడో దాటిపోయింది. ముందట్లా సిక్స్‌ప్యాక్, ఎయిర్‌ప్యాక్‌లకు షేకవడం లేదు. ఫ్యామిలీప్యాక్ నుంచి మాత్రం దూరంగా ఉంటూ ఫిట్‌గా ఉండేందుకు ఆరాటపడుతున్నారు. సినిమాల ప్రభావంతోనే జిమ్ యావ మొదలైనప్పటికీ వ్యాయామం ఎంత అవసరమో అందరూ గుర్తించారు. ఫిట్‌నెస్ కోసం చేసే వ్యాయామం అయినా సరదాగా, ఆడుతూ పాడుతూ చేయాలన్నదే ఇప్పుడు కొత్త నియమం. వెరైటీ కోరుకునేవారు మనసును, మెదడును అదుపులో ఉంచే యోగా, ధ్యానం వంటి ఆధ్యాత్మిక వ్యాయామాలతో పాటు కొత్తగా ఉండే వాటికి ఆకర్షితులవుతున్నారు. ఇప్పటి కాలంలో మనిషి ఎక్కువ మానసిక ఒత్తిడితో బాధపడుతున్నాడు. 'హౌ వుయ్ ఫీల్ నాట్ హౌ వుయ్ లుక్' అనేది కొత్త నినాదంగా మారుతోంది. అందరూ అలానే ఆలోచిస్తున్నారు. అయితే ఆఫీసుల్లో, ఇళ్లల్లో పనులు చేసి శారీరకంగా అలసిపోతున్న వారికి జిమ్‌లో మిషనరీతో వ్యాయామం చేస్తే మరింత అలసిపోవడంతప్ప విశ్రాంతి దొరకదని చాలామంది భావిస్తున్నారు. యోగా, ధ్యానం, ఇంట్లో చేసే ఫన్నీ వర్కవుట్లు, కొత్త కొత్త వ్యాయామాలు వంటి వాటి ద్వారా శరీరానికి కావాల్సిన ఫిట్‌నెస్‌తో పాటు మానసిక ప్రశాంతత లభిస్తుందని చెప్తున్నారు వాళ్లు. అందుకోసమే వెరైటీ వ్యాయామాలను ట్రై చేస్తున్నారు. వాటిల్లో నుంచి పుట్టిందే ఈ పాకుడు వ్యాయామం. పాకుడే కదా అని తేలిగ్గా తీసుకునేరు దానిలో కూడా రకాలు ఉన్నాయి. అంతేకాదు చిన్నవయసులో పాకడం వేరు, పెద్దయ్యాక పాకడం వేరు. ఈవ్యాయామం చేయడానికి అనుగుణంగా మార్కెట్లో మిషనరీ కూడా లభ్యమవుతోంది.

## ఇదో కొత్తదనం

పెద్ద పెద్ద పరికరాలతో వ్యాయామం చేసి చేసి విసుగొచ్చిందా?! అలాంటివారికోసమే ఈ సరికొత్త వ్యాయామం. పిల్లల్లా పాకడం దేహ దారుఢ్యానికి బాగా ఉపకరిస్తుందని నిపుణులు చెబుతున్నారు. అయితే మోకాళ్ల నొప్పులున్నవారు, వృద్ధులు, ఇతర సమస్యలు ఉన్నవారు ఈ వ్యాయామం జోలికి వెళ్లకపోవడమే మంచిదనీ లేదా వైద్యుల సలహా తీసుకుని ప్రారంభించాలనీ నిపుణులు సూచిస్తున్నారు. మరి ఈ వ్యాయామంతో లాభాలేంటో చదవండి.

## సమన్వయం

శరీరంలో నడుముపైన ఉన్న భాగాలకు, నడుముకింద ఉన్న భాగాలకు మధ్య సమన్వయం లోపిస్తే సమస్యలు తలెత్తే అవకాశాలు ఉన్నాయి. అయితే పాకడం ద్వారా అలాంటి సమస్యలు తొలగించుకోవచ్చు. ఎందుకంటే ఈ వ్యాయామం శరీరంలో నడుము పైభాగాన్నీ, కిందిభాగాన్నీ సమన్వయ పరుస్తుంది. దీంతో పూర్తి దేహానికి వ్యాయామం చేసినట్టే. దీనివల్ల వెన్నెముకకి స్థిరత్వం, సమన్వయం, చురుకు





దనంతో పాటు ఎన్నో ప్రయోజనాలు కలుగుతాయి.

### శరీర దృఢత్వం

కేంద్రీయ నాడీ వ్యవస్థను బలపరచడంలో ఎంతో ఉపయోగపడుతుంది క్రాలింగ్. పాకడం వల్ల శారీరక, మానసిక దృఢత్వం కలుగుతుంది. ఎందుకంటే మన శరీరంలో ప్రతీ కదలిక కూడా ఈ కేంద్రీయ నాడీవ్యవస్థతోనే ముడి పడి ఉంటుంది. బిగుసుకుపోయిన కీళ్లు, కండరాలను సాగేలా చేస్తుంది. పాకడంవల్ల జాయింట్ పెయిన్స్ అరికట్టవచ్చు. శరీరంలో కీలక కండరాలు, భుజాలు, తొడలు, మోకాలు కీళ్లను ఈ వ్యాయామం బలోపేతం చేస్తుందని నిపుణులు స్పష్టం చేస్తున్నారు.

### నడిచే సామర్థ్యం పెరుగుతుంది

నడక దశకు ముందు ప్రతి శిశువూ మోకాళ్లపై పాకుతుంది. ఇది నడక నేర్వడానికి ముందు చేసే ఒక ఫంక్షనల్ ప్రక్రియ. ఈ వ్యాయామం తీరు కూడా అంతే. కొంత వయసు వచ్చిన తర్వాత చాలామందిలో నడిచే సామర్థ్యం తగ్గిపోతుంది. పాకడంవల్ల మనిషిలో నడక సామర్థ్యం పెరుగుతుంది. అంతేకాదు ఎవరి నడకలోనైనా ఏవైనా లోపాలుంటే అవి మెల్ల మెల్లగా తగ్గుముఖం పట్టి మామూలుగా నడవగలుగుతారు.

### క్రాలింగ్‌లో రకాలు

పాకడంలో కూడా రకాలు ఉంటాయా అని ఆశ్చర్యపోతున్నారా? అవును ఒకేతీరుగా పాకితే థ్రిల్ ఏముంటుంది. థ్రిల్‌తో పాటు ఆరోగ్యమూ కావాలి కాబట్టి రకరకాలుగా పాకడాన్ని ట్రై చేస్తున్నారు. ముఖ్యంగా ఈ క్రాలింగ్‌లో ఐదురకాలు ఉన్నాయి అవేంటంటే:

#### 1. బియర్డ్ క్రాల్

ఇది చిన్నపిల్లలు పాకినట్టే పాకాలి. ఈరకం వ్యాయామం చేయాలంటే ముందుగా వంగి మోకాళ్లకి సమాంతరంగా భూమిపైన చేతులు ఉంచాలి. తర్వాత కుడికాలు ముందుకు కదిలించినప్పుడు ఎడమ చేతిని, ఎడమకాలు ముందుకు కదిలించినప్పుడు కుడి చేతిని చాచి ముందుకు నడవాలి. ఈ సమయంలో మెడ నిటారుగా ఉండాలి. క్రాలింగ్‌లో ఇది సింపుల్ మెథడ్. దీనివల్ల మోకాళ్ల దగ్గర జాయింట్స్ బలపడతాయి. పిరుదులు, పొట్ట భాగంలో కొవ్వు తగ్గుతుంది.

#### 2. క్రాబ్ క్రాల్

క్రాబ్ క్రాల్ అంటే పీతలా నడవడం. ఈవ్యాయామం చేయాలంటే ముందు భూమిమీద కూర్చుని చిన్నగా కాళ్లు జాచాలి. తర్వాత చేతులను భుజాలకు సమాంతరంగా ఇరువైపులా పెట్టుకోవాలి. తర్వాత కేవలం చేతుల పైనే శరీర బరువును ఆపుతూ పాదాలను నేలకు ఆన్చి ముందుకు కదులుతూ ఉండాలి. ఈసమయంలో దానికి అనుగుణంగా చేతులు కదిలించాలి. ఇలా ముందుకు చేసినట్లే వెనక్కి నడుస్తూ చేతులు వెనక్కి పెడుతూ ముందుకూ, వెనక్కీ పాకాలి.

#### 3. స్పైడర్‌మాన్ క్రాల్

స్పైడర్‌మాన్ గోడలు ఎలా ఎక్కుతూ ఉంటాడో తెలుసుకదా! బల్లిలా పాకడం అన్నమాట. ఈవ్యాయామం చేయాలంటే ముందుగా భూమిపైన సమాంతరంగా బోర్లాగా కాస్త పైకి లేచి ఉన్నట్లుగా పడుకోవాలి. కుడి మోచేతి దగ్గరగా కుడిమోకాలు తీసుకురావాలి. అప్పుడు ఎల్బో యాంగిల్‌లా ఉంటుంది. అదే సమయంలో శరీర బరువంతా మీదపడకుండా ఇంకో చేతిని ముందుకు చాచాలి. తర్వాత వెంటనే ఎడమ మోకాల్ని, ఎడమ మోచేతి వద్దకు తీసుకెళ్లాలి. ఈసమయంలో కుడిచేతిని ముందుకు తీసుకెళ్లాలి. ఇలా చేతులూ కాళ్లూ కదిలిస్తూ ముందుకు పాకుతూ ఉండాలి.

#### 4. ఆర్మీ క్రాల్

ఆర్మీవాళ్లు ఏదైనా స్టింగ్ ఆపరేషన్ నిర్వహిస్తున్నప్పుడు ఎలా పాకుతారో తెలుసు కదా అలా భూమిపైన పాకడం అన్నమాట. ఈవ్యాయామం చేయాలంటే ముందుగా భూమిపైన బోర్లా పడుకోవాలి. మోచేతులను ఉపయోగిస్తూ కాళ్లను కదుల్చుతూ భూమిపైనే శరీరాన్నంతా పెట్టి పాకుతూ ఉండాలి.

#### 5. ఇన్చ్‌వామ్

ఇది కూడా చాలా సింపుల్ వ్యాయామం. ముందుగా నేలపైన చేతులను ఉంచి బోర్లా పడుకుని చేతులు ముందుకు చాచుతూ, శరీరమంతా సాగేలా ముందుకు వంగాలి. ఆ తర్వాత చేతుల దగ్గరకి నడుస్తూ కాళ్లని తీసుకురావాలి. కాళ్లూ చేతులూ కలిసే సమయంలో మళ్లీ చేతులు ముందుకు చాచాలి. అప్పుడు భూమికి సమాంతరంగా బాడీ ఉంటుంది. తర్వాత పై ప్రక్రియనే చేస్తూ ముందుకు కదులుతూ ఉండాలి. అంటే మనభాషలో పడుకుని దేకటం అన్నమాట.

-విజేత దహగాం

## వ్యాయామం మానేస్తే?



క్రమం తప్పకుండా వ్యాయామం చేసే వాళ్లు ఉన్నపళంగా మానేస్తే చాలా నష్టం. అలా మానేసిన రెండునెలల తర్వాత కండరాలు అవసరమైన విశ్రాంతి తీసుకుని వ్యాయామం కోసం ఎదురు చూస్తుంటాయి. వ్యాయామం మానేసిన వారం తర్వాత శరీరం కాస్త పటుత్వం కోల్పోయినట్లు అనిపిస్తుంది. కండరాల పోగులు కుచించుకుపోతాయి. మళ్లీ వ్యాయామానికి వెళితే ఇబ్బందేం లేదు, లేకపోతే రెండు వారాలకు చురుకుతనం తగ్గడం స్పష్టంగా కనిపిస్తుంది. శ్రమలేకపోవడంవల్ల కణాలకు శక్తినిచ్చే మైటోకాండ్రియాల సంఖ్య తగ్గిపోతుంది. నెలరోజులకు కొవ్వు పేరుకుపోవడం మొదలవుతుంది. నీటి రూపంలో వ్యర్థాలు పేరుకుంటాయి. కొన్ని నెలలైతే వివిధ రకాల వ్యాధులకు గురయ్యే అవకాశం ఉంది. ఏడాదికాలానికి కొవ్వు శాతం పెరుగుతుంది. కండరాల రాశి పూర్తిగా తగ్గి, జీవక్రియ మందగిస్తుంది. అందుకే వ్యాయామం చేయడం ప్రారంభించాక వైద్యుల అనుమతి లేనిదే మానకూడదని పరిశోధకుల చెబుతున్నారు.

## బరువు తగ్గించే జెల్!

బరువు తగ్గించుకోవడానికి పడరానిపాట్లు పడుతుంటారు చాలామంది. అందుకే బరువు తగ్గాలనుకునే వారిని దృష్టిలో పెట్టుకుని శాస్త్రవేత్తలు పరిశోధనలు సాగించి ఒక కొత్తరకం జెల్ కనుగొన్నారు. దానికి పేరైతే ఇంకా ఏమీ పెట్టలేదుగానీ ఈ జెల్ తింటే, ఇక మనల్ని చిరుతిళ్లు తినకుండా చేస్తుందట. దీంతో మనం బరువు తగ్గుతామని పరిశోధకులు చెబుతున్నారు. బర్మింగ్‌హామ్ యూనివర్సిటీ పరిశోధకులు ఓ కొత్తరకం జెల్ కనుగొన్నారు. ఈ జెల్ తింటే, చాలా సేపటి వరకూ మన పొట్ట నిండుగా ఉన్న అనుభూతిని కలిగిస్తుంది. ప్రస్తుతం సమాజంలో స్థూలకాయుల సంఖ్య పెరుగుతోంది. వారికి ఆరోగ్యం చేకూరాలంటే ప్రస్తుతం ఉన్న ప్రధాన సాధనం వారి తిండి తగ్గించడమే. ఈ జెల్ స్థూలకాయులకు ఎంతగానో దోహదం చేస్తుంది అంటున్నారు పరిశోధకులు. అయితే దీనిపై రకరకాల పరిశోధనలు కొనసాగుతున్నాయి.



# చదివించిరి నను గురువులు

తులసి బాలకృష్ణ

**ఉద్యోగరీత్యాగానీ, మొహమాటంకొద్దీగానీ మీద వేసుకున్న పనులతో క్షణం తీరికలేకుండా గత నెల్లాళ్లుగా సతమతమవుతున్న నేను.. ఈ ఆదివారం రోజు ఫ్యామిలీతోపాటు భోజనం చేస్తూ టీవీ చూడ్డానికి వీలు చిక్కింది.**

ఛానల్స్ తిప్పుతూండగా ఓ న్యూస్ ఛానల్లో 'పదవ తరగతి విద్యార్థినులతో వెకిలిగా ప్రవర్తిస్తూ, లైంగికంగా వేధిస్తున్న ఓ హైస్కూల్ హెడ్ మాస్టారికి ఆ స్కూలు విద్యార్థులు నిన్న సాయంత్రం దేహశుద్ధి చేశారు' అంటూ కామెంటరీతో చూపిస్తున్న విజువల్స్ చూసి నేను చేష్టలుడిగిపోయాను. చేతిలో ముద్ద కంచంలోకి జారిపోయింది.

హెడ్‌మాస్టారు రామచంద్రం నా బాల్య మిత్రుడు. తల వంచుకుని దోషిలా నిలబడి ఉన్నాడు. ఓ మోటు ముదర (విద్యార్థి?!) కుర్రాడు అతని చెంపలు వాయిస్తున్నాడు. ఓ పక్కన ఇద్దరు అమ్మాయిలు కన్నీళ్లు కారుస్తూ నిలబడి ఉన్నారు. స్కూలు స్టూడెంట్స్, టీచర్లూ బొమ్మల్లా నిల్చుని చూస్తున్నారు.

ఆ ఇద్దరు అమ్మాయిల్లో ఓ అమ్మాయి ముఖం నాకు సుపరిచితంగా అనిపించి గుచ్చిగుచ్చి చూశాను. బాగా సుపరిచితమైన అమ్మాయే. ఎస్..మా సుదర్శనరావు కూతురు నళిని.

రామచంద్రం, సుదర్శనరావు, నేను బాల్య స్నేహితులం. నేను బ్యాంకింగ్ లైన్ ఎంచుకుంటే రామచంద్రం టీచింగ్ లైన్ కోరుకున్నాడు. సుదర్శనరావు సెంట్రల్ గవర్నమెంట్ జాబ్‌లో స్థిరపడి ప్రస్తుతం ప్రమోషన్ మీద నాగాలాండ్‌లో ఉన్నాడు. మా రామచంద్రం ఆడపిల్లల్ని లైంగికంగా వేధించడమా?! అందులోనూ తన చిన్ననాటి ఆప్త మిత్రుడి కూతురుతో తప్పుగా ప్రవర్తించడమా? ఆ పుంభావ సరస్వతికి అతని స్కూల్లోనే ఇంతటి అపవాదు భరించి, అవమానం చవి చూడాల్సిన ఖర్మ పట్టడమా?! గబుక్కున లేచి చెయ్యి కడిగేసుకున్నాను.

"ఏవిటండీ ఇదీ?!" అంది రామచంద్రాన్ని ఎరిగివున్న మా ఆవిడ ఆందోళనగా.

ఘోరకలి అన్నాను. బట్టలు మార్చుకుని ఇంటి బైటకొచ్చాను.

బైక్ స్టార్ట్ చెయ్యబోతుండగా 'ఇప్పుడు రామచంద్రం ఇంటికి వెళ్లడం బాగుంటుందా! బాగుండదా?' అనే సంశయం మొదలైంది. 'ఇప్పటికే అవమానభారంతో కుంగిపోతూ ఉంటాడు. ఇప్పుడు నేనువెళ్లి అతన్ని ఏ రీతిలో ఓదార్చగలను?!' అనేక మందితో బాటు నాకు తెలిసిపోయిందని మరింత బాధపడతాడేమో?!' అనిపించింది. అంతలోనే.. 'ఇంతటి స్నేహితుడినైన నేనేవెళ్లి ఊరడించకపోతే అతనిమీద ఇంకెవరు సానుభూతి చూపిస్తారు?' ఎవరైనా మరిన్ని రాళ్లువేసి అతన్ని మరింత అవమానపరిచి కుంగదీస్తారు గాని' అనిపించసాగింది.

కిం కర్తవ్యమ్?!

పాతిక సంవత్సరాలుగా, మిత్రుడుగా పరిచయమున్న రామచంద్రం నాకు తెలిసినంతవరకూ 'జంటిల్‌మన్' అన్న పదానికి నిలువెత్తు సజీవ స్వరూపం. ఎవర్నీ ఎన్నడూ తగ్గించి ఒక్కమాట కూడా మాట్లాడడు. ఆడవాళ్లని మరీ గౌరవిస్తాడు.

"ఆడపిల్లలు మహాలక్ష్మీ స్వరూపాల్రా, పెళ్లయ్యాక నాకు మొదటి సంతానం ఆడపిల్లే కావాలని కోరుకుంటున్నాను. ఆడపిల్ల ఉన్న ఇల్లు కళకళలాడుతూ ఉంటుంది" అనేవాడు ఆరోజుల్లోనే.

అటువంటి రామచంద్రం.. విద్యార్థులకి పాఠాలతోబాటు మంచి బుద్ధులు కూడా నేర్పే బాధ్యత ఉన్న రామచంద్రం.. తన వద్ద చదువుకునే విద్యార్థినులతో అందులోనూ మా ప్రాణ స్నేహితుడు సుదర్శనరావు కూతురితో ఇంత నీచంగా ప్రవర్తిస్తాడా?!

కానీ 'అతని తప్పేమీ లేకుండానే ఇంత దారుణంగా విద్యార్థులు రెచ్చిపోతారా? అందులోనూ ఛానల్‌వాళ్లని పిలిచిమరీ అతన్ని శిక్షించారంటే ఈ పొగకి కారణమైన నిప్పు ఏ కొంచమైనా ఉన్నట్టేగా?!' నా తల తిరిగిపోసాగింది.

అప్రయత్నంగానే బైక్ స్టార్ట్ చేశాను. ముందుకి పోనిచ్చాను. కాని అది రామచంద్రం ఇంటివైపు కాకుండా సుదర్శనరావు ఇంటివైపు తిరిగింది. 'సరే ఇదీ మంచిదే. అట్నుంచి నరుక్కొద్దాం' అనిపించింది. పిల్లల చదువులు పాడవుతాయని.. ఫ్యామిలీని ఇక్కడే ఉంచి తానొక్కడే నాగాలాండ్‌కి వెళ్లాడు సుదర్శనరావు.

కాలింగ్ బెల్ నొక్కాను. మరో నిమిషానికి తలుపు తెరుచుకుంది. తలుపుతీసి గుమ్మంలో నన్నుచూస్తూనే కంగారుపడింది నళిని.

"అంకుల్! మి...మీరా?!!" అంది.

"అమ్మలేరా?" అడిగాను. గొంతులో అటు కోపాన్నిగానీ ఇటు ఆత్మీయతగానీ ధ్వనింపచేయకుండా జాగర్తపడుతూ.

"లేరు అంకుల్! మా తాతయ్యకి ఆరోగ్యం బాగాలేదని ఫోన్ వస్తే బెజవాడెళ్లింది."

"నువ్వు ఒక్కర్తివే ఉన్నావా ఇంట్లో?"

"అవునంకుల్"

"ఓ అయితే నేను అమ్మ వచ్చాక రావడం మంచిదేమో కదా?!" వెనుదిరగబోయినట్లు నటించాను. ఒక్కసారిగా తెల్లబోయి చూసింది. నా ప్రశ్నలోని నిష్టూరం నిండిన వ్యంగ్యం అర్థం చేసుకోలేనంత చిన్నపిల్ల కాదుగా?

"అదేంటంకుల్! నేనున్నానుగా! అమ్మ లేక పోతేనేం? లోపలికి రండి. కూర్చోండి. మంచినీళ్లు తేనా?" అంది కుర్చీ చూపిస్తూ.

లోపలికి నడిచి కూర్చుంటూ... "పెద్దగ్లాసుతో తీసుకురామ్మా.. ఇందాక టీవీలో ఓ వార్త చూసిన పట్నుంచీ ఎన్ని నీళ్లు తాగినా గొంతెండిపోతూనే ఉంది" అన్నాను.

ఉలికిపడింది నళిని. మంచినీళ్లు తేవడానికి వెళ్తున్నప్పుడు, తెస్తూన్నప్పుడు కూడా ఆమె కాళ్లు తడబడ్డాయి. "జాగర్తమ్మా, అడుగులు తడబడుతున్నాయి. పడిపోతావు." అన్నాను. నా మాటల్లో మళ్లీ ధ్వనించిన వ్యంగ్యంతో ఇప్పుడు నేనెందుకొచ్చానో పూర్తిగా అర్థమైపోయి ఆమె ముఖం కొద్దిగా వివర్ణమైంది.

మంచినీళ్లు తాగి "ఎలా ఉందమ్మా, నీ చదువు?" అన్నాను.

"బ..బాగానే ఉందంకుల్" ఖాళీ గ్లాసు అందుకోబోయింది.

"మా రామచంద్రం పాఠాలు బాగా చెబ్తున్నాడా?" ఒక్కసారిగా అడిగాను.

గ్లాసు చటుక్కున వదిలేసింది. నాముఖంలోకి అపరాధ భావంతో చూసింది.

ఆమె కళ్లలోకి సూటిగా చూశాను.

తనూ చూడలేక తల దించుకుంది. కిందపడ్డ గ్లాసు తీయడానికి ప్రయత్నించిందిగానీ, వణుకుతున్న ఆమె చేతిలోంచి ఆ గ్లాసు రెండుసార్లు జారి పడిపోయింది.

"పర్వాలేదమ్మా.. అది గ్లాసేగా. ఓసారి జారి పడిపోయినా ఇంకోసారి చేతికి అందుతుంది. కాని నైతిక విలువలున్నాయి చూడూ.. వాటిని ఓసారి మనం జారవిడుచుకుంటే మాత్రం తిరిగి దక్కించుకోవడం కష్టసాధ్యం" అన్నాను.

చేష్టలుడిగి.. గుటకలు మింగుతూ చూస్తోంది.

"రామచంద్రం, నేనూ, మీనాన్న బాల్య స్నేహితులం."

"తె..తెలుసంకుల్."

"మీ నాన్న, రామచంద్రం మరీ ప్రాణ స్నేహితులు..."

"..."

అందులోనూ మీ నాన్నకి రామచంద్రం అంటే మరీపిచ్చి! స్నేహమే కాదు గౌరవం కూడా. 'సాక్షాత్తూ ఆ శ్రీరామచంద్రుడే మా రామచంద్రం' అంటూంటాడు అందరితోనూ".

"..."

ఇక సూటిగా విషయంలోకి వచ్చేద్దామనిపించి, "అటువంటి రామచంద్రం ఇప్పుడు..కొంచెం బుద్ధి వికటించి ఆడపిల్లలతో అసభ్యంగా...." అని ఆగి సూటిగా చూశాను.

తల నిలువుగా ఊపుతూ, "అ..అవునంకుల్" అంది ఆమె పాతాళంలోంచి మాట్లాడుతున్న స్వరంతో.. తలదించుకుంటూ.

"నీతో కూడానా?!" కనురెప్పలు వాల్చకుండా చూస్తున్నాను ఆమెవైపే.

'అవును' అన్నట్లుగా ఆడించిన తల మరింత కిందకు వంచుకుంది.

అలాగే మౌనంగా చూస్తున్నాను. రెండు నిమిషాలు గడిచాయి.

ఆమె తాలూకు సెల్‌ఫోన్ మోగింది. ఆమె కంగారుగా దాన్ని చేతుల్లోకి తీసుకుని, అటువైపు తిరిగి, రహస్య స్వరంతో, "నేను మళ్లీ చేస్తాను" అంది. అవతలి వ్యక్తి కారణం అడిగి ఉండొచ్చు.. "ప్లీజ్ అర్థం చేసుకో, నేను తప్పకుండా మళ్లీ చేస్తానంటున్నాగా?" అనేసి, ఫోన్ కట్ చేసింది. ఆమె రహస్య స్వరం చిరుభయంగా వణకడం కూడా జరగడంతో అవతలి వ్యక్తి జెండర్ ఏమై ఉంటుందో అర్థమైంది నాకు.

"ఓ పవిత్రమైన విద్యాలయానికి ప్రధాన ఉపాధ్యాయుడై ఉండీ.. పిల్లలకి మంచి బుద్ధులు నేర్పవలసిన బాధ్యత కలిగినవాడై ఉండీ.. రామచంద్రం ఇంత వికృతంగా ఎలా ప్రవర్తించాడంటావ్?" గొంతు పెంచాను. "ఏమో అంకుల్" అంది అమాయకత్వంగా చూస్తూ.

"నిజమేలే. చెప్పడం పాపం నీకు కష్టమేగానీ ప్రాణ స్నేహితుడి కూతురివి. అందులో తన బిడ్డ లాంటి దానివి, నీతో కూడా అలా అంత నీచంగా ఎలా ప్రవర్తించాడని?! ఇంకో విషయం నీకు తెలుసా? బహుశా మీ అమ్మానాన్నలు నీకు చెప్పి

**ఇంట్లో కుటుంబంతో కలిసి భోజనం చేస్తూ టీవీ వార్తలు చూస్తున్నాడతను. ఒక స్కూలు హెడ్మాస్టర్‌కు విద్యార్థులు దేహశుద్ధి చేస్తున్నారు. ఆ పక్కనే ఇద్దరు విద్యార్థినులు కన్నీళ్లతో నిలబడి ఉన్నారు. ఆ దృశ్యం చూసి అవాక్కయ్యాడతను. అతడిచేతిలో ముద్ద కిందకి జారిపోయింది. వెంటనే లేచి బైక్‌మీద బయలుదేరాడు. అతడు ఎక్కడికి బయలుదేరాడు? ఆ వార్తకీ అతడికీ ఏమిటి సంబంధం?**

## నయనతారా మజాకా?

*నయనతార, ఆమెతో పాటు పరిశ్రమలోకి వచ్చిన కొందరు హీరోయిన్లు సెకండ్ ఇన్నింగ్స్‌లోకి అడుగు పెట్టేశారు. వారందరూ సెకండ్ ఇన్నింగ్స్‌లో అవకాశాల కోసం కిందా మీదా పడుతుంటే నయనతార మాత్రం అవకాశాల మీద అవకాశాలు అందుకుంటూ మంచి జోరు మీద ఉంది. ముఖ్యంగా లేడీ ఓరియెంటెడ్ సినిమాలకి కోలీవుడ్‌లో కేరాఫ్ అడ్రస్‌గా మారింది. ఆమె నటించిన 'డోర' విడుదలకు సిద్ధమవుతుండగా మరో భారీ లేడీ ఓరియెంటెడ్ సినిమా ఆఫర్ నయనతార తలుపు తట్టింది. భారీ బడ్జెట్‌తో నిర్మించబోతున్న ఈ సినిమాకి నయన కూడా ఓకే చెప్పేసిందట! మొత్తానికి మరో రెండు మూడు సంవత్సరాల పాటు నయన డైరీలో ఖాళీ లేదట! అంటే డైరీ ఖాళీ అయిన తరువాతే నయన పెళ్ళన్నమాట!*



ఉండరు. నీకు రెండేళ్ల వయసప్పుడు అప్పటికి నీకు మాటలు అస్సలు రాకపోవడమే కాదు.. వెర్రి చూపులు, దేన్నీ సరిగ్గా చేతుల్లో పట్టుకోగలిగే శక్తి కూడా లేకపోయేసరికి పెద్ద డాక్టర్లకి చూపించారు. నీ మెదడు ఎదుగుదలలో లోపం ఉందనీ, ఆపరేషన్‌తో సరిచెయ్యాలనీ రెండు లక్షలు అవుతుందనీ..ఆపరేషన్ చేయించినా నయమవుతుందనే గ్యారెంటీ లేదని వాళ్లు చెప్పారు. "గ్యారెంటీ లేని ఆపరేషన్ అంత డబ్బు ఖర్చుబెట్టి చేయించాలా వద్దా.. అంత డబ్బు ఎక్కణ్ణించి తేవాలీ" అని నీ తల్లిదండ్రులు తర్జనభర్జనలు పడుతుంటే తన పొలం తాకట్టు పెట్టి ఆ రెండులక్షలూ తెచ్చి మీనాన్న చేతుల్లో ఉంచి, "ఆడపిల్ల ఇంటి మహాలక్ష్మి. ఇంకేం ఆలోచించకుండా ఆపరేషన్ చేయించు ముందు. నా బాకీ వాయిదాలలో వీలువెంబడి తీర్చొచ్చులే" అన్నాడమ్మా ఈ రామచంద్రం దుర్మార్గుడు" అన్నాను, కావాలనే ఆమెవైపు చూడకుండా తలతిప్పుకుని.

ఓ నిమిషం గడిచింది. చెవులు రిక్కించుకుని ఆమె ఏం మాట్లాడుతుందోనని ఎదురుచూస్తున్నాను. ఆమె ఏమీ మాట్లాడలేదు. కాని సన్నగా వెక్కిళ్లు వినిపించాయి.

యాంత్రికంగా తల తిప్పాను. ఆమె చెంపల మీదుగా ధారలు ధారలుగా కన్నీరు. "నళినీ! ఏమైందమ్మా?" అంటూ లేచాను ఏమీ ఎరగనట్లు.

ఒక్కసారిగా భళ్లుమని ఏడుస్తూ కింద కూలబడిపోయి రెండు చేతుల్లో నుదిటిమీద బాదుకుంటూ "నేను చాలా తప్పు చేశాను. మహాపాపం చేశాను అంకుల్" అంటూ ఏడ్చేయసాగింది. కారణం తెలుసు కాబట్టి ఆమెని వారించకుండా పశ్చాత్తాపంగా ఏడవనిచ్చాను. కొన్ని నిమిషాలపాటు చున్నీతో చెంపలు తుడుచుకుంటూ లేచి నిలబడి "మీరు టీవీలో చూసి ఉంటారు అంకుల్. నాది క్షమించరాని పాపమే. దేవుడు కూడా క్షమించడు. మానాన్నకి తెలిస్తే నన్ను ముక్కలు ముక్కలు చేసేస్తాడు. చెప్పండంకుల్, ఇప్పుడు నేను ఏ శిక్ష అనుభవిస్తే ఈ పాపం నుంచి తప్పించుకోగలను? అంది వెక్కుతూ.

"అసలెందుకు చేశావీ పని?" సూటిగా అడిగాను కొంచెం కటువుగానే.

"స్టాలిన్ కోసం"

"స్టాలినా?! అతనెవరు?"

"నా బాయ్‌ఫ్రెండ్! మా స్కూల్ స్టూడెంట్ లీడర్ కూడా. సిగరెట్టు కాల్చాడని అతన్ని రామచంద్రం మాస్టారు క్లాసులో అందరి ఎదురుగా మందలించారు. దాంతో అతను హర్ట్ అయ్యాడు. పగతీర్చుకోవాలనుకున్నాడు. నన్నూ మరో అమ్మాయి సుందరినీ మా ఇద్దర్నీ మాస్టారు డబుల్‌మీనింగ్ మాటలతో వేధిస్తున్నారనీ, ఎవరూ లేనప్పుడు తప్పుగా ప్రవర్తిస్తున్నారనీ చెప్పి అందరి ఎదురుగా ఏడవమన్నాడు. లేకపోతే నాతో జన్మలో మాట్లాడనన్నాడు."

"అందుకని బాయ్‌ఫ్రెండ్ స్నేహం కోసం తండ్రి లాంటి రామచంద్రం మాస్టార్ని వాడిచేత చెప్పు దెబ్బలు కొట్టించావన్న మాట!"

మళ్లీ తల బాదుకుంటూ ఏడ్చింది నళిని. "ఇప్పుడు స్టాలిన్ గాడంటే అసహ్యం వేస్తోంది అంకుల్ నాకు."

"నీ ఫ్రెండ్ సుందరికైనా బుద్ధి లేదా? నీకు గడ్డి పెట్టొద్దా?" కసిరాను.

"తనకి ఓ టీవీప్రోగ్రాంలో 'నావయసింకా పదహారు' పాటకి డాన్సు చేసే ఛాన్స్ ఇప్పిస్తానని చెప్పాడు వాడు. వాడి మామయ్య ఓ ఛానల్‌కి న్యూస్ రిప్రజెంటేటివ్. కెమేరామెన్‌నీ రప్పించి




రామచంద్రం మాస్టార్ని తనే కొట్టాడు.." వెక్కుతోంది.

"చాలా బాగుందమ్మా. బాయ్‌ఫ్రెండ్ కోసం ఒకరు, టీవీలో డాన్స్‌ఛాన్స్ కోసం ఒకరు ఇంత దారుణానికి సిద్ధమయ్యారన్నమాట! నవ్వాలో ఏడ్వాలో అర్థం కావట్లేదు నాకు."

"నేను చచ్చిపోతానంకుల్. అదే నాకు సరైన పనిష్మెంట్"

"ఉద్ధరిస్తావ్‌లే, పద" మందలిస్తూ ఆజ్ఞాపించాను.

"ఎక్కడికంకుల్?!"

"రామచంద్రం మాస్టారింటికి. ఆయన కాళ్ల మీదపడి క్షమాపణలు అడిగి అందరి ఎదురుగా నిజం చెబ్దువు గాని. న్యూస్ ఛానల్స్ వాళ్లని నేనూ రప్పించగలను."

నా బైక్ మీద ఇద్దరం బయల్దేరాం.

రామచంద్రం ఇంటివద్ద లేడు. నిన్నట్నుంచీ ఓ మాటా పలుకూ లేకుండా మూగవాడిలా వెర్రి చూపుల్తో తనలో తనే మథనపడుతున్నాడనీ, తిండీ నిద్రా లేకుండా అస్థిమితంగా అలా తిరుగుతూనే ఉన్నాడనీ, ఇందాక ఉన్నట్టుండి బైటకువెళ్లిపోయాడని చెప్పింది అతని భార్య సర్వమంగళ. భయాన్ని, దుఃఖాన్ని ఆపుకోలేక వెక్కుతోంది ఆమె.

గాభరాగా వెతకడానికి బయల్దేరాం నేనూ, నళినీ.. "ఎక్కడికి వెళ్లుంటాడు?!"

"మాస్టారు ఇస్కోలు ఏపెల్తాంటే సూసానండి" అన్నాడు ఓ కిళ్లీ బడ్డీ కుర్రాడు.

ఆగమేగాలమీద స్కూల్‌కి చేరుకుంది నా బండి. స్కూల్ ఆవరణలోని గ్రౌండ్స్, క్లాస్‌రూమ్సూ అన్నీ కలియజూస్తూ నడుపుతున్నాను బండిని. ఒక చోట నిన్న తను ఎక్కడైతే అవమానించబడ్డాడో ఆ మర్రిచెట్టు దగ్గర స్టూలు ఎక్కి కొమ్మకి వేలాడుతున్న ఓ బలమైన ఊడని అందుకుని తన మెడకి చుట్టుకుంటూ కనిపించాడు రామచంద్రం!

"ఒరేయ్ రామచంద్రం!??" అని నేనూ, "మాస్టారూ!" అని నళినీ ఒక్కసారే గాభరాగా వెర్రిగా కేకలు పెట్టాం. నేను స్టూలు కదలకుండా పట్టుకుంటే ఏడుస్తూ రామచంద్రం కాళ్లకు బలంగా చుట్టుకుపోయింది నళిని, "నన్ను క్షమించండి సార్" అంటూ.

మా బలవంత ప్రయత్నంమీద కిందకు దిగక తప్పలేదు రామచంద్రానికి.

అప్పుడు నా దృష్టి స్టూలుకింద ఉన్న లెటర్ మీద పడింది. దాన్ని చేతుల్లోకి తీసుకుని చదివాను. 'బాల్యంలో నా గురువులు నన్ను శిక్షించి, లాలించి నేర్పించిన విద్యని ఓ గురువుగా నా విద్యార్థులకి అందించడంలో విఫలుణ్ణి అయ్యాను. అంటే విద్య నేర్పిన ఆనాటి ఉపాధ్యాయులకుగానీ, ఈనాటి నా విద్యార్థులకుగానీ నా వల్ల న్యాయం జరగలేదన్న మాట. ఇక జీవించే హక్కు నాకు లేదు. నా మరణానికి ఎవ్వరూ బాధ్యులు కారు.

"ఏమిట్రా ఇదీ?!" అన్నట్లుగా రామచంద్రం ముఖంలోకి చూశాను. నన్ను చూస్తూనే తనలోని బాధ తీరేంతగా భళ్లుమన్నాడు. తన కాళ్లమీదపడ్డ నళినీని లేవనెత్తి కన్నీటిపొరల వెనుగ్గా చల్లని చూపుల్తో ఆమెని ఆశీర్వదించాడు. నా గుండె ప్రఫుల్లమైంది.

గాఢంగా పొదివి హత్తుకుని అతని కళ్లల్లోకి చూస్తూ "చదివించిరి నను గురువులు..చదువులలో మర్మమెల్ల చదివితి తండ్రీ.." అన్న సుకుమార రాచకుమారుడు ప్రహ్లాదుడు కూడా శిక్షణకి తలొగ్గి గురువుకి గౌరవం ఇచ్చిన ఆ రోజులు, బహుశా మన కాలం దాకా వచ్చాక ఆగిపోయినట్లున్నాయిరా రామచంద్రం. ఆ రోజుల్లో గురువులు వేసిన శిక్షలకి మన చేతులూ, వీపులూ ఎర్రగా కందిపోయినా మనమూ మనల్ని కన్నవాళ్లూ కూడా 'మన బాగుకోసమే గురువులు శిక్షించారని అనుకునేవాళ్లం. ఆ శిక్షలతో నేర్చుకున్న చదువుల కారణంగా ప్రయోజకులమయ్యాం. రోజులు మారిపోయాయట్రా! మనవి చదువు'కున్న' రోజులు. ఇప్పుడు చదువు'కొనే' రోజులట్రా..అది తెలుసుకుని పొట్టకోసం ఉద్యోగాలు చేసుకోవాల్రా అమాయకుడా!" అన్నాను గుండెల్లో ఘూర్ణిల్లుతున్న బాధతో కూడిన గొంతుతో.

రామచంద్రం చూపులు శూన్యంగా ఆకాశం వైపున్నాయి.

బహుశా అది విద్యార్థుల భవిష్యత్తు పట్ల భయమేమో?!

....ఏమో?!

*సెల్: 87901 15544*

## హెపటైటిస్‌ను నిలువరించడం సాధ్యమే

మానవ శరీరంలో కాలేయం అతి ముఖ్యమైన భాగం. ఈ అవయవానికి వైరస్ కారణంగా ఇన్‌ఫెక్షన్ సోకితే ఎన్నో సమస్యలు మొదలవుతాయి. కాలేయంపై ప్రభావం చూపే వైరస్‌లలో ముఖ్యమైనవి హెపటైటిస్-బి, హెపటైటిస్-సి.. హెపటైటిస్ బి వైరస్ సోకగానే బయటకు ఎటువంటి లక్షణాలు కనిపించవు. కొంత కాలం పాటు వారు ఆ వైరస్ శరీరంలో నిద్రాణంగా ఉంటుంది. తరువాత మెల్లమెల్లగా కాలేయాన్ని నిర్వీర్యం చేస్తూ ప్రాణాంతంగా మారుతుంది. లివర్ క్యాన్సర్, సిర్రోసిస్, వైరల్ హెపటైటిస్ వ్యాధులు రావడానికి కారణమవుతుంది. హెపటైటిస్-బి వల్ల కాలేయంలోని కణజాలం క్రమక్రమంగా పాడవుతుంది. రోగనిరోధక వ్యవస్థ తగ్గడం వలన కాలేయ విధులకు ఆటంకం ఏర్పడుతుంది. దీనివల్ల కాలేయంలో వాపు వచ్చి పలురకాల సమస్యలు తలెత్తుతాయి.

### లక్షణాలు

హెపటైటిస్ వైరస్ శరీరంలోకి ప్రవేశించిన వెంటనే లక్షణాలు బయటపడవు. రోగలక్షణాలు కనిపించడానికి చాలా ఏళ్ల పడుతుంది. కొంతమందిలో మాత్రం వైరస్ సోకిన కొద్దిరోజులకే కామెర్లు వస్తాయి. దీనిని ఎక్యూట్ స్టేజ్‌గా చెప్పవచ్చు. ఈ దశలో వ్యాధి దానంతట అదే తగ్గిపోతుంది. కొంతమందిలో ఈ వైరస్ తొలగిపోకుండా, శాశ్వతంగా శరీరంలో ఉంటూ బలం పెంచుకుంటూ పోతుంది. దీనిని క్రానిక్ స్టేజ్ అంటారు. ది. కాళ్లవాపు, పొట్ట ఉబ్బరం, వాంతులు, ఆకలి తగ్గిపోవడం, వాంతులు, మూత్రం పచ్చగా రావడం, కళ్లు పసుపుపచ్చగా మారడం, జ్వరం, ఒళ్లు నొప్పులు అధికంగా ఉండటం వంటి లక్షణాలు కనిపిస్తాయి.

### హోమియో చికిత్స

రోగి శారీరక మానసిక లక్షణాలను పరిశీలించి చికిత్స అందించడం ద్వారా మంచి ఫలితం సాధించవచ్చు.

## నడుం నొప్పిని ఎన్నాళ్లు భరిస్తారు?

నడుంనొప్పి తగ్గితే చాలు అని సర్జరీకి సిద్ధపడితే, ఆ సర్జరీ విఫలమై కొత్త సమస్యలు మొదలైతే ఆ బాధలు చెప్పనలవి కాదు. కానీ చాలా మంది విషయంలో ఇలాగే జరుగుతోంది. డిస్క్‌ల్లో సమస్య అని సర్జరీ చేస్తే అది కొత్త సమస్యలకు దారితీస్తుంది. నిజానికి ఆపరేషన్ అవసరం లేకుండా హోమియో మందులతో స్పాండిలోసిస్ సమస్యలను సమూలంగా తగ్గించే వీలుంది.

నడుము భాగంలో నొప్పి వస్తున్నట్లయితే దాన్ని లంబార్ స్పాండిలోసిస్ అంటారు. నడుము నొప్పి మూలంగా ఏ పనీ చేసుకోలేకపోతారు. ఉదయం వేళ నొప్పి తీవ్రంగా ఉంటుంది. నొప్పి క్రమంగా నడుము నుంచి కాళ్లలోకి విస్తరిస్తుంది. అరుదుగా మూత్రవిసర్జనపై నియంత్రణ కోల్పోవడం జరుగుతుంది. లంబార్ స్పాండిలోసిస్‌తో దీర్ఘకాలంగా బాధపడే వారిలో శృంగార సమస్యలు కూడా ఎదురవుతాయి. సరియైన భంగిమలో కూర్చోకుండా పని చేసే వారిలోనూ, గంటల తరబడి కూర్చుని పనిచేసే వారిలోనూ ఈ సమస్య వస్తుంది.

### హోమియో చికిత్స

నొప్పి ఏదైనా సమూలంగా తగ్గాలంటే హోమియో చికిత్స ఒక్కటే మార్గం. దీర్ఘకాలంగా వేధిస్తున్న నడుం నొప్పి సమస్యలకు హోమియో వైద్య విధానంలో అద్భుతమైన చికిత్స అందుబాటులో ఉంది. ఎక్స్‌రే, ఎమ్ఆర్ఐ స్కాన్, సీటీ స్కాన్ పరీక్షల ద్వారా డిస్క్‌ల్లో తేడాను, నడుము నొప్పికి గల కారణాలను గుర్తించవచ్చు. హోమియో మందుల ద్వారా నడుము నొప్పిని పూర్తిగా దూరం చేయవచ్చు. వెన్నుపూసలో జరిగే మార్పులను నివారిస్తూ, కండరాలకు బలం చేకూరే విధంగా చికిత్స ఇవ్వడం వల్ల మంచి ఫలితం ఉంటుంది. అయితే పరిస్థితి పూర్తిగా విషమించకముందే వైద్యులను సంప్రదించాలి.


**Dr. K Ravikirane**
M.D.,M.sc(psych), P.G(virology)LONDON
గోల్డ్‌మెడల్ ఫర్ ఎక్సలెన్సీ ఇన్ మెడిసిన్
మాస్టర్స్ హోమియోపతి
అమీర్‌పేట్, కూకట్‌పల్లి, దిల్‌సుఖ్‌నగర్, హైదరాబాద్,
విజయవాడ, కరీంనగర్, విశాఖపట్నం,తిరుపతి
ఫోన్ : 7842 106 106, 9032 106 106




## లైంగిక వ్యాధులకు చికిత్స ఉంది

### హెచ్ఐవి

ఈ వ్యాధి పేరు చెబితేనే ప్రతీ ఒక్కరూ భయపడిపోతారు. నిజానికి హోమియోలో హెచ్ఐవి వైరస్‌ను కట్టడి చేసే మందులు ఉన్నాయి. హెచ్ఐవి ఎక్కువ విస్తరిస్తుండటానికి కారణం దీని లక్షణాలు కొన్ని ఏళ్ల తరువాత బయటపడటమే. అప్పటి వరకు వారికి హెచ్ఐవి ఉన్న విషయం కూడా తెలియదు. రోగనిరోధక శక్తి తగ్గినపుడు వ్యాధి లక్షణాలు బయటపడతాయి. విరేచనాలు కావడం, బరువు తగ్గడం, అవకాశవాద వ్యాధులు విజృంభించడం, చిన్న చిన్న వాతావరణ మార్పులను తట్టుకోలేకపోవడం, త్వరగా వ్యాధులు వస్తుండటం జరుగుతుంది.

### హెర్పిస్ సింప్లెక్స్

పురుషాంగంపైన చెమట పొక్కుల మాదిరిగా నీటి పొక్కులు కనిపిస్తాయి. నీటిపొక్కులు ఎర్రగా ఉండి దురద ఉంటుంది. నీటిపొక్కులు పగిలి ఎర్రగా పుండు పడుతుంది. ఇటువంటి సమయంలో తగు చికిత్స తీసుకోకపోతే ఇతరులకు సోకే ప్రమాదం ఉంది. లైంగిక కలయిక ద్వారా సంక్రమించే ఈ వ్యాధిని హెర్పిస్ అని అంటారు.

**హోమియో చికిత్స :** హోమియో మందులతో రోగనిరోధక శక్తి బలపడుతుంది. తద్వారా హెచ్ఐవి రోగుల్లో అవకాశవాద వ్యాధులన్నీ దూరమవుతాయి. వైరల్‌లోడ్ బాగా తగ్గిపోతుంది. ఆరోగ్యవంతమైన జీవనం గడపడానికి ఆస్కారం లభిస్తుంది. హెర్పిస్ సింప్లెక్స్ వంటి లైంగిక వ్యాధుల నివారణకు కూడా హోమియో చికిత్స అద్భుతంగా పనిచేస్తుంది. హోమియో చికిత్స మూలకారణాన్ని తొలగిస్తుంది. సాధారణంగా హెర్పిస్ తగ్గినట్టే తగ్గి మళ్లీ వస్తుంది. అయితే హోమియో చికిత్స అనంతరం వ్యాధి మళ్లీ తిరగబెట్టడం ఉండదు.

## సైనసైటిస్ సమస్యకు గుడ్‌బై

వాతావరణ మార్పులు జరిగినప్పుడల్లా సైనసైటిస్ సమస్య మొదలవుతుంది. మళ్లీ మళ్లీ వస్తూ దీర్ఘకాలం వేధించే ఈ సమస్యతో కాలం వెళ్లదీస్తున్న వారు చాలా మందే ఉంటారు. ఈ సమస్యను మూడు విభాగాలుగా చూడవచ్చు. ఒకటి ఎక్యూట్. ఇది వస్తే వారం రోజులుంటుంది. రెండోది సబ్‌ఎక్యూట్. ఇది నాలుగు నుంచి ఎనిమిది వారాలుంటుంది. మూడోది క్రానిక్.

**కారణాలు :** బ్యాక్టీరియా, వైరస్, ఫంగస్ ఇన్‌ఫెక్షన్లు, ఉపరితల శ్వాసకోశ వ్యాధులు, ముక్కులో ఎముక పెరుగుదల, అలర్జీ, పొగ, వాతావరణ కాలుష్యం, అకస్మాత్తుగా వాతావరణ మార్పులు, గాలిలో తేమ ఎక్కువగా ఉండటం, స్విమ్మింగ్ చేయడం, జలుబు, గొంతునొప్పి, పిప్పి పన్ను, టాన్సిల్స్ వాపు, రోగనిరోధక శక్తి తగ్గడవం వంటివి కారణమవుతాయి.

**వ్యాధి లక్షణాలు :** తలనొప్పి, తలంతా బరువుగా ఉండుట, ముఖంలో వాపు, సైనస్ భాగంలోనొప్పి, ముక్కు దిబ్బడ, ముక్కు దురద, నీరు కారడం, గొంతులోకి ద్రవాలు కారడం, దగ్గు, జలుబు, చెవిలో చీము వంటి లక్షణాలుంటాయి. తరచు జలుబు చేయడం, జలుబుతో ఎక్కువ రోజులు బాధపడటం అనేది సైనస్ వ్యాధి ప్రాథమిక లక్షణం. ఆ తరువాత దశలో జలుబు చేసినపుడు ముక్కులు బిగదీసుకుపోతాయి. తీవ్రమైన తలనొప్పి, దగ్గు, శ్వాస దుర్గంధంతో కూడి ఉండటం కూడా జరుగుతుంది.

**హోమియో చికిత్స :** హోమియో చికిత్స వల్ల సర్జరీ అవసరం లేకుండానే సైనసైటిస్‌ను సమూలంగా తగ్గించుకోవచ్చు. హోమియో మందుల్లో ఎటువంటి దుష్ప్రభావాలు ఉండవు. ఇతర చికిత్సల వల్ల తాత్కాలిక ఉపశమనం కలుగుతుందే తప్ప శాశ్వత పరిష్కారం లభించదు. కానీ హోమియో చికిత్స వల్ల సైనసైటిస్ సమస్య సమూలంగా తొలగిపోతుంది. మళ్లీ మళ్లీ బాధించడం జరగదు.




**బాల్యం, కుర్రతనం నుంచి యవ్వనం లోకి ప్రవేశించే ప్రాయం...**

**ఆ సమయంలో ఏర్పడే మార్పులు సరికొత్త భావాలు కలగజేస్తాయి. ప్రతీదాన్ని కుతూహలంగా చూడడం, ఉత్సుకతతో పరిశీలించడం టీనేజ్ సహజ లక్షణం. ఆపోజిట్ జెండర్ కనపడగానే మనసులో ఏదో తెలియని తుళ్లింత...**

**ప్రతీది అనుభవ పూర్వకంగా తెలుసుకోవాలనే ఆసక్తి...**

**ఆ ఆసక్తే వారిని ప్రతిదానివైపూ ఆకర్షిస్తుంది.**

**అలా ఆకర్షించిన ప్రతిదాని వెంట పడేలా చేస్తుంది.**

ఆడపిల్లల్లోగానీ, మగపిల్లల్లోగానీ ఇలాంటి మార్పులు సడెన్‌గా ఒక్కసారిగా చోటుచేసుకోవు. క్రమంగా నిదానంగా జరుగుతాయి. ఒక్కోసారి పద్నాలుగేళ్ల టీనేజర్స్‌లో కూడా యవ్వనం తాలూకు ఛాయలు కనిపిస్తున్నా కూడా బాల్య లక్షణాలు తొంగిచూస్తూ ఉంటాయి.

బాల్యం వరకు అబ్బాయి అమ్మాయి కలిసి ఆడుకుంటున్నా ఇంట్లో ఎవరూ వద్దనరు కానీ టీనేజి వయసులోకి అడుగిడిన తర్వాత మాత్రం చాలామంది తల్లిదండ్రులు అమ్మాయిలను అబ్బాయిలకు దూరంగా ఉంచుతారు, వారితో ఎక్కువగా కలవనీయరు, అనేక కట్టుబాట్లు పెడుతుంటారు. అబ్బాయిలు ఏం చేస్తున్నారన్నది ఓకంట గమనిస్తుంటారు. టీనేజ్‌లో ఉండే అమ్మాయికి అయినా అబ్బాయికి అయినా ఒకరినొకరు చూసుకుంటే వారిలో ఏదో తెలియని భావోద్వేగం, ప్రత్యేక ఆకర్షణ కనిపిస్తుంటాయి. ఇలాంటి లైంగిక పరమైన భావనలు కలగడానికి వారిలో ఏర్పడే హార్మోన్లే కారణం.

# వయసు మధురిమలు



మనుషుల్లో లైంగికత్వం అనేది ప్యూబర్టీ దశ నుంచే ప్రారంభమవుతుందని పూర్వం భావించే వాళ్లు కానీ నేటి ఆధునిక పరిశోధనలు అవి వాస్తవం కాదని చెబుతున్నాయి. లైంగికత్వం అనేది పిల్లల్లో పుట్టినప్పటి నుంచి ఉంటుంది. అయితే అది బహిర్గతం కాదు. పిల్లలు మొదటి ఏడాదిలోనే అంగస్పర్శానుభూతికి పాల్పడతారు. ఈ విషయం కొందరిలో బైట పడితే, మరికొందరిలో బైట పడదు. చిన్నపిల్లలు తెలిసీ తెలియని వయసులోచేసే ఈ చర్య అమాయకమైనది. అయితే అది తప్పకుండా లైంగిక సంబంధమైనదే. దీన్ని బట్టి లైంగికత్వం అనేది పిల్లల్లో యవ్వనత్వం చిగురించేటప్పుడు మాత్రమేకాదు బాల్యం నుంచే ఉంటుందని చెప్పొచ్చు. దీన్నే 'థియరీ ఆఫ్ యాంటిసిపేషన్' అంటారు. అంటే కొన్ని పనుల్ని అవసరాన్ని బట్టి అంతకు ముందు కూడా చేయగలిగే స్థితి.

## సెక్స్ గ్రంథుల ప్రభావం

లైంగికత్వం అనేది చిన్నప్పటి నుంచే ఉంటుందని అనుకున్నాం కదా, మరి ఈ ప్యూబర్టీ దశలో ఇది మొదలు కాకపోయినా ఈ దశకు ఎందుకంత ప్రాముఖ్యం ఇవ్వడం అనుకుంటున్నారా? ప్యూబర్టీ దశలోనే లైంగిక అవయవాలు రకరకాల మార్పులు సంతరించుకుంటాయి. ఈ మార్పులు స్త్రీ, పురుషులలో విభిన్నంగా ఉంటాయి. పిల్లల్లో తల్లిదండ్రులు కావడానికి అనుగుణమైన మార్పులు శరీరంలో ఈ దశలోనే ఏర్పడతాయి. ఈ సమయంలోనే వారిలో దాగిన లైంగిక అనుభూతులు, భావోద్వేగాలు ఎక్కువవుతుంటాయి.

బాల్యదశలో ఉన్నప్పుడు ఇంకా యవ్వనం రానప్పుడు లైంగికానుభూతులనేవి బాహ్యప్రేరణ ద్వారా మాత్రమే ఉంటాయి. అంటే ఒకరికొకరు తాకడం, చూడడం... ఇలా అన్నమాట. ఇవి అంతర్గతంగా ఎక్కువ ప్రభావం చూపవు కానీ యవ్వనం చిగురించాక అంటే ప్యూబర్టీదశ నుంచి లైంగికానుభూతులనేవి అంతర్గతంగా వస్తాయి. అందుకు కారణం సెక్స్ గ్రంథులు శరీరంలో అభివృద్ధి చెందడం. ముఖ్యంగా పిట్యూటరీ గ్రంథి ఈ విషయంలో ప్రముఖ పాత్ర వహిస్తుంది.

ఈ సెక్స్ గ్రంథులు బాల్యమంతా అచేతనంగా ఉండి యవ్వనారంభంలో వృద్ధి చెందుతాయి. ఈగ్రంథులు విడుదల చేసే రసాయనాలను హార్మోన్లు అంటాం. ఈగ్రంథులకు శరీరంలోని ఏ అవయవాలతోనూ లింక్ ఉండదు. ఇవి నేరుగా తమ హార్మోన్లను రక్తంలోకి విడుదల చేస్తాయి.

రక్తం ఈ హార్మోన్లను శరీరంలోని మిగతా అవయవాలన్నింటికీ సరఫరా చేస్తుంది. ఆడపిల్లలు, మగపిల్లల్లో సెక్స్ అవయవాలు, సెక్స్ లక్షణాలు అభివృద్ధి చెందడానికి ఈ హార్మోన్లే దోహదం చేస్తాయి. స్త్రీ తాలూకు సెక్స్ గ్రంథులు పక్వానికి వచ్చాయనడానికి రజస్వల ఒక చిహ్నామైతే, పురుషుడి తాలూకు సెక్స్ గ్రంథులు వృద్ధి చెందుతున్నాయనడానికి నిద్రలో స్కలనం కావడం, లైంగిక ఉద్రేకతను పెంచే కలలు రావడం లాంటివి చిహ్నాలుగా చెప్పుకోవచ్చు.

ఒక్కోసారి కొందరు పిల్లల్లో ఈ సెక్స్ గ్రంథులు అసలు వయసు కంటే ముందే అభివృద్ధి చెందు తుంటాయి. అలాంటి వాళ్ల వారి వయసుకంటే పెద్దగా కనిపిస్తుంటారు. అంటే లావుగా, పెద్ద వాళ్లలాగా. ఇక మరికొందరిలో అసలు అభివృద్ధే ఉండదు. ఇలాంటి సమస్యలు టీనేజర్లను చాలా ఇబ్బంది పెడుతుంటాయి.

### ఆకర్షణలకు కారణం ఇదీ!

ఆడపిల్లలు, మగపిల్లల్లోని సెక్స్ గ్రంథులు ఉత్పత్తి చేసే హార్మోన్లలో తేడాల కారణంగా వాళ్ల మౌలిక నైజాలలో వైవిధ్యం కనిపిస్తుంది. మగ పిల్లలు రఫ్‌గా, అగ్రెసివ్‌గా ఉంటే ఆడపిల్లలు సుకుమారంగా ఉంటారు. మగపిల్లవాడు ఆడ పిల్లని సమ్మోహించాలని తాపత్రయపడతాడు. అలాగే, తన అందంతో, మాటలతో మగపిల్ల వాణ్ణి ఆకట్టుకోవాలనే కోరిక ఆడపిల్లలో కలుగు తుంది.

వారిలో ఉండే ఈ సెక్స్ పరమైన హార్మోన్ల వల్లనే ఇద్దరిలో పరస్పర ఆకర్షణ కలుగుతుంది. అవే ప్రకృతి సహజమైన స్త్రీ పురుష లక్షణాలు. అందుకే యవ్వనంలో ఉన్న పిల్లలు మనసులో కదిలే మధురమైన భావనల కారణంగా ఎక్కు వగా పగటికలల్లో మునిగి ఉంటారు. ఈ పగటి కలల్లో కూడా ఎక్కువగా భాగస్వామికి సంబం ధించినవే. అధికభాగం శృంగారం, ఫాంటసీకి సంబంధించినవే ఉంటాయి.

యవ్వనారంభంలో స్త్రీ పురుషుల శరీరాల్లో మార్పులు జరుగుతాయి. ఆడపిల్ల రజస్వల అయితే ఆమె యవ్వనానికి వచ్చింది అని అర్థం. అయితే రజస్వల అవ్వగానే సెక్స్ జీవితంలో పాల్గొంటే ఆడపిల్ల గర్భం దాలుస్తుంది అనుకుం టారు. కానీ అది తప్పు. రజస్వల అయిన ఒకటి లేదా రెండు సంవత్సరాల వరకు ఆడపిల్ల గర్భం దాల్చలేదు.

ఎందుకంటే ఆ క్రమంలో ఆమె శరీరంలో రకరకాల మార్పులు చోటు చేసుకుని గర్భాశయ నిర్మాణానికి పట్టే కాలం అది. ఈ విరామ కాలాన్నే మనస్తత్వవేత్తలు ఏజ్ ఆఫ్ నుబిలిటీ అంటారు, అడాలసెంట్ స్టెరిలిటీ అని కూడా దీనికి పేరు. ఇక మగవారితో పోలిస్తే ఆడపిల్లల్లో సెక్స్ అనుభూతుల పట్ల కాస్త ఏహ్యభావం ఉంటుంది. నైతిక పరంగానే గాక శరీర నిర్మాణం కూడా దీనికి ఒక కారణం.

ఆడపిల్లల శరీరాల్లో మార్పులు జరిగినట్లే, మగపిల్లల శరీరాల్లో కూడా కొన్ని లైంగిక పర మైన మార్పులు జరుగుతాయి. ప్యూబర్టీ దశలో ఆడపిల్లల శరీరం మృదువుగా గుండ్రంగా తయారైతే మగపిల్లవాడి శరీరం బలమైన కండరాల్ని సంత రించుకుంటుంది.

మగపిల్లలకు నూనూగు మీసాలు, చుబుకం మీద గడ్డం మొలవడం ప్రారంభమవగానే అతను యవ్వనారంభంలోకి అడుగిడినట్లే. టీనేజ్‌లో ఆడ పిల్లలు, మగపిల్లలిద్దరి కంఠస్వరాల్లో మార్పు వస్తుంది.

ఈ మార్పు ఆడపిల్లల్లో స్వల్పంగా ఉంటే, మగపిల్లాడి కంఠం పూర్తిగా మారిపోతుంది. స్వరనాళాల గోడలు మందం కావడంవల్ల అంత ర్గత గ్రంథుల ప్రభావంవల్ల ఇలా స్వరంలో మార్పు జరుగుతుంది. స్త్రీ పురుషుల్లో ఉత్పత్తి అయ్యే ఈ లక్షణాలవల్లే వారిలో అనేక రకాల భావోద్వేగాలు చెలరేగుతాయి. ఇవి పిల్లల మన సుపై తీవ్ర ప్రభావం చూపుతాయి. అందుకే ఈ వయసులో వారి మధ్య ఏర్పడే స్నేహం, ప్రేమ, ఆకర్షణల మధ్య తేడాను వాళ్లు గుర్తించలేరు. ఇవి ఎలా ఉంటాయన్నది ముందుముందు చూద్దాం!

**-లతాకమలం**

email:lathakamalam.me@gmail.com



## టీవీ కార్యక్రమాల వల్లే

ఇడియట్ బాక్స్‌గా పేరున్న టీవీలో అన్ని రకాల కార్యక్రమాలు ప్రసారమవుతాయన్న విషయం తెలిసిందే! అయితే టీవీలో శృంగార కార్యక్రమాల సంఖ్య క్రమంగా పెరుగుతూ ఉండడం పట్ల పలువురిలో ఆందోళన వ్యక్తం అవుతోంది.

ఈవిధంగా బుల్లితెరపై విజృంభిస్తున్న శృంగార సన్నివేశాలు టీనేజ్ యువతలో సెక్స్ సంబంధాలకు దారి తీస్తున్నా యని తాజా పరిశోధనలు వెల్లడిస్తున్నాయి. మనదేశంలో ఈ తరహా వ్యవహారం ఇంకా ప్రమాదస్థాయికి చేరుకోకున్నా విదేశాల్లో మాత్రం టీవీ ప్రభా వంతో టీనేజ్ యువత పక్కదారి పడుతోంది. చికాగోకి చెందిన ఓ ఔత్సా హిక పరిశోధనా బృందం నిర్వహించిన సర్వే ప్రకారం, టీనేజ్ దాటని యువత టీవీల్లో ప్రదర్శిస్తున్న శృంగారభరిత నటనా దృశ్యాలే యువత పక్కదారి పట్టే సమస్యలకు దారి తీస్తోందని వెల్లడైంది. టీవీలో వచ్చే ఈ తరహా కార్యక్రమాలను చూసే టీనేజ్ యువత తాము సైతం అలా చేసేందుకు ప్రయత్నిస్తూ, తెలిసీ తెలియని శృంగార సుఖానికి అలవాటుపడు తున్నారు. ఈవిషయానికి సంబంధించి 12 నుంచి 17 ఏళ్ల వయసున్న 2000 మంది బాల బాలికలపై పరిశోధన నిర్వహించారు. ఈ సర్వేలో పాల్గొన్న టీనేజర్లు ఎక్కువమంది సెక్స్‌పై మక్కువ చూపడానికి కారణం టీవీ కార్యక్రమాలే అని పేర్కొన్నారు.



## ఇదీ ఒక కారణమే!

టీనేజ్ యువతీ యువకుల్లో కామ వాంఛలు ఎక్కువగానే ఉంటాయన్నది అందరికీ తెలిసిన విషయమే. అయితే ఈ వయసులో వారికి ఎందుకు ఈ కోరికలు ఎక్కువగా ఉంటా యన్న దానిపై సెక్స్ వైద్యులు పలు విషయాలు చెబుతున్నారు. తమలో ఏర్పడే సెక్స్ కోరికలను నిగ్రహించుకోలేని టీనేజర్లు పక్కదార్లు తొక్కు తారట. ఇందుకోసం విచ్చలవిడిగా డబ్బులు వెచ్చించేందుకు సైతం ఏమాత్రం వెనుకంజ వేయడం లేదని కొన్ని సర్వేలు చెబుతున్నాయి. మోడ్రన్ యూత్ అయితే టీనేజ్ వయసులో తమ సెక్సువల్ కోరికలను అణచుకోలేక వాటిని తీర్చుకునేందుకు ఎక్కువగా ఖర్చు పెట్టేందుకు సిద్ధపడుతున్నట్లు సర్వేలు చెబుతున్నాయి. టీనేజర్లు కోరికలు తీర్చుకునేందుకు ఉవ్విళ్లూర డానికి కారణం అసలు శృంగారం అంటే ఏంటో తెలుసుకోవాలన్న తపనేనట. ఆ తపన వల్లనే అమ్మాయితో అబ్బాయి, అబ్బాయితో అమ్మాయి సంబంధాలు పెంచుకోవడానికి, ఆ తరువాత ప్రేమలో మునిగి తేలేందుకూ ప్రయత్నిస్తా రట! వీరిలా ప్రయత్నించడానికి దీనితో పాటు ఇంకా 237 ఇతర కారణాలు న్నట్లు కూడా సెక్స్ నిపుణులు చెబుతున్నారు.

# మహానంది



-వక్కంతం సూర్యనారాయణరావ్, సెల్:98662 67287

15

**"ఉపాయం చక్కగా ఉంది ఉలూకా. అపాయం ఏదైనా పొంచి ఉందేమో అని నిశితంగా ఆలోచించాలి.." కళింగరత్న వాతాయనం గుండా ఆకాశంలోకి చూస్తూ అన్నాడు.**

**"మనం ఆలోచించే ఉపాయాలకు అపాయాల నీడ తగిలే అవకాశం లేదు యువప్రభూ!" ఉలూకుడు సగర్వంగా అన్నాడు.**

"అలా తేలికగా అనుకోడానికి లేదు. మనకు వ్యతిరేకంగా ఆలోచించే బుర్రలు నాలుగు దిక్కులా నాలుగున్నాయి!" కళింగరత్న అన్నాడు. "మహారాజు గారు, మహారాణిగారూ, జలజ"

"అంతే, యువప్రభూ...ముగ్గురంటే ముగ్గురే!"

కళింగరత్న చిన్నగా నవ్వుతూ ఉలూకుడి వైపు తిరిగాడు. "నాలుగో వ్యక్తి ఎవరో చెప్పనా?"

"చెప్పండి!"

"యువరాణి లాలస!" కళింగరత్న అన్నాడు. "చూశావా, చుట్టూ ఉన్న తలల్ని లెక్కపెట్టడంలోనే పొరపాటు చేశాం! ఉపాయంలో లొసుగులు ఉండ వచ్చుగా! ఆలోచిద్దాం!"

"ఆజ్ఞ! ఆలోచిద్దాం!"

ఇద్దరూ కాసేపు మౌనంగా ఉండిపోయారు. కళింగరత్న ఆంతరంగిక సేవకుడివైపు తదేకంగా చూశాడు. "ఎదురయ్యే సమస్య ఏమిటో తట్టింది!"

ఉలూకుడు తలతిప్పి, ఆశ్చర్యంగా చూశాడు.

'అపహర్తను తుదముట్టించి, యువరాణిని రక్షించి తీసుకు వచ్చామని కామరూప చక్రవర్తికి మన మేమో చెబుతాం. మన మాట అసత్యం అంటూ లాలస తన తండ్రికి చెబుతుందిగా! మన నాట కాన్ని బైట పెట్టేస్తుందిగా..." కళింగరత్న ఆగి, అర్థ మైందా అన్నట్టు ఉలూకుడి వైపు చూశాడు.

ఉలూకుడు నాలుక కరుచుకున్నాడు.

కళింగరత్న మళ్ళీ వాతాయనం ముందుకు వెళ్ళి, సమస్య పరిష్కారం కోసం నీలాకాశంలో కళ్ళతో వెతుకుతూ ఉండిపోయాడు.

"నేనే తనని అపహరించి తీసుకువచ్చాననీ, ఇష్టపడకపోతే, రాక్షస వివాహం చేసుకుంటాననీ, నిర్భయంగా, గర్వంగా, ఆమెకు స్వయంగా చెప్పాను.." కళింగరత్న కంఠంలో పశ్చాత్తాపం ధ్వనించింది.

"ఈ ఉపాయం ఆనాడే తట్టి వుంటే ఎంత బాగుండేది.." కళింగరత్న మళ్ళీ తనే అన్నాడు.

"యువప్రభూ! ఆ అపాయానికి అద్భుతమైన విరుగుడు!" ఉలూకుడు ఉద్రేకంతో అరిచాడు.

## జరిగిన కథ

కామరూపరాజ్య సర్వసైన్యాధ్యక్షుడు రుద్రాక్షుణ్ణి రాజద్రోహిగా నిర్ధారించి యావజ్జీవ కారాగారశిక్ష విధించాడు మహారాజు కుబేరవర్మ. రుద్రాక్షుడి కుమార్తె దీపాంకురకు అంతఃపుర శౌచాలయాలు శుభ్రంచేసే శిక్ష, కొడుకు నందికి రాజ్యబహిష్కార శిక్ష విధిస్తాడు రాజు. పొరుగు రాజ్యంలో సత్రం నిర్వాహకురాలి ఆశ్రయం పొందుతాడు నంది. స్వయంవరం రోజున, ఆలయానికి వెళ్ళిన యువరాణి లాలసాదేవి మాయమవుతుంది. రాకుమార్తెను సుకర్మ, కళింగ యువరాజు కళింగరత్నకి అప్పగిస్తాడు. కళింగరత్న ఆమెని ఒక మందిరంలో ఉంచి జరిగిన విషయాలన్నీ వివరిస్తాడు. జలజ ద్వారా విషయం తెలుసుకున్న మహారాణి చేసిన తప్పు దిద్దుకోమని కొడుకును మందలించి, తమ పూజా మందిరంలో ఉన్న కలశ చరిత్రను వివరిస్తుంది.

ఆ తర్వాత....

కళింగరత్న వాతాయనం ముందు నుండి అతని వైపు తిరిగాడు. ప్రశ్నార్థకంగా చూశాడు.

"తమరు రక్షించే సమయానికి యువరాణీ వారు స్పృహ లేకుండా అపహర్త గుర్రం మీద అడ్డంగా బోర్లా పడుకున్నారు. తమరు ఇక్కడికి తీసుకు వచ్చి చికిత్స చేయించి, ఆమెకు స్పృహ తెప్పించారు. కళ్ళు తెరిచాక కనిపించిన మిమ్మల్నే తన అపహర్తగా అనుకున్నారు. మీరు ఎంత మొత్తుకున్నా ఆమె నమ్మలేకపోతున్నారు!" ఉలూకుడు గర్వంగా చూశాడు. "ఎలా ఉంది యువరాణి చేయబోయే వాదనకు మన ప్రతివాదన?"

కళింగరత్న కొన్ని క్షణాలు రెప్పపాటు మరిచిపోయి అలా చూస్తూ ఉండిపోయాడు. సాలోచనగా తల పంకించాడు.

"ఉపాయం ఉపయోగకరంగానే ఉంది, ఉలూకా.." కళింగరత్న సాలోచనగా అన్నాడు. ఉలూకుడిని రెప్పవేయకుండా చూశాడు. అతని ముఖం మీద చిరునవ్వు మెరిసింది. "విను! నేను ఆమెను రాక్షస వివాహ పద్ధతిలో అపహరించినట్టు ఎప్పుడూ ఆమెకు చెప్పనేలేదు. నిజంగా ఆమెను అపహరించి ఉంటే ఎప్పుడో మంగళసూత్రంతో బంధించేవాణ్ణి! ఆమె మీద అఘాయిత్యం చేసేవాణ్ణి! పైగా ఆమె అపహరించబడిన సమయంలో నేను కామరూప నగరంలో, స్వయంవర మండపంలో ఇతర రాకుమారులతో పాటు ఉన్నానాయే! ఈ విధంగా మన ప్రతివాదన ఉంటే కుబేరవర్మ చక్రవర్తి ఏం చేస్తారు? ఎవర్ని నమ్ముతారు?"

"తన ఏకైక పుత్రికను సురక్షితంగా, సలక్షణంగా తీసుకువచ్చి, అప్పగించిన కళింగ యువరాజుగారినే నమ్ముతారు!" ఉలూకుడు ఉత్సాహంగా అన్నాడు.

"మహారాజుగారు నేడు సైన్య పరిచయ కార్యక్రమం నిర్ణయించారు. ఇవాళ బయలుదేరలేం! రేపు ఉదయమే మన ప్రయాణం...కామరూప నగరానికి...యువరాణి లాలసాదేవిగారితో పాటు..."

"కామరూప నగరం కాదు, యువప్రభూ! అత్తవారిల్లు అనండి!" ఉలూకుడు నవ్వుతూ అన్నాడు.

కళింగరత్న తన మెల్లకంటితో క్షణంపాటు శూన్యంలోకి చూశాడు. "యువరాణి వేసే ఎత్తుకు పై ఎత్తు మన గుప్పిట్లో ఉంది. ఇంకా మూడు బుర్రలున్నాయి. మహారాజుగారు, మహారాణిగారు; జలజ.."

"వాళ్ళను మరిచిపోండి యువప్రభూ! కన్యాదాత అయిన కామరూప చక్రవర్తి కల్పించుకుని, కల్యాణ సంకల్పం చేశాక ఎవ్వరూ ఏమీ చేయలేరు!"

"నీకు తెలీదు. మా జననీ జనకుల ధర్మప్రవర్తన నీకు తెలీదు. కామరూప చక్రవర్తిగా వివాహ ప్రతిపాదన చేస్తూ ఆహ్వానించగానే ఇద్దరిలో ఎవ్వరో ఒకరు అపహర్త తమ కుమారుడే అని చెప్పేస్తారు! అందుకు మహాబలమైన కారణం ఉంది. అది మా వంశానికి సంబంధించిన, శతాబ్దాల నాటి భయంకర గతం..."

"అంటే..అంటే...మహారాజుగారూ, మహారాణిగారూ తమ ఏకైక పుత్రుడిని, ఏకైక వారసుణ్ణి శాశ్వతంగా కోల్పోతారా?" ఉలూకుడు నోరు వెళ్ళబెట్టాడు.

"దోషిగా నన్ను అప్పగించకపోవచ్చు. యదా

ర్థాన్ని ఎరుకపరిచి, తమ వంశాంకురాన్ని క్షమించి వదిలిపెట్టమని అర్థిస్తారు. 'మీ కుమార్తె మీకు దక్కింది. మా కుమారుడిని మాకు దక్కించండి' అని నా వివాహాన్ని విధ్వంసం చేసి, నన్ను తెచ్చుకుంటారు! నీకు తెలీదు...నీకు తెలీదు..." కళింగరత్న గొణుగుతూ అటూ ఇటూ తిరగసాగాడు.

ఉలూకుడు తీవ్రంగా ఆలోచిస్తూ, కాసేపు కళ్ళు మూసుకున్నాడు. తటాలున కళ్ళు తెరిచాడు. "తట్టింది!" అన్నాడు ఉద్రేకంగా. కళింగరత్న ఆగి, ప్రశ్నార్థకంగా చూశాడు.

"ఒక పనిచేద్దాం, యువప్రభూ! యువరాణిని కామరూప చక్రవర్తిగారికి క్షేమంగా అప్పజెప్పి, కళింగరత్న 'అపహర్త' కాదనీ, 'ఆపద్బాంధవుడు' అనీ అక్కడ నమ్మకం కలిగిస్తాం. చక్రవర్తి గారు వివాహ ప్రస్తావన తెస్తారు. వివాహం విషయంలో తమ తల్లిదండ్రుల అంగీకారం అవసరమని విన్నవించండి. రాజదంపతులు రాజధాని రత్నకటకంలో లేరనీ, నాలుగు రోజులు ఆగి, సంప్రదింపులకు తగిన పెద్దలను పంపించమనీ కామరూప చక్రవర్తిగారికి చెప్పి మనం రాజధానికి తిరిగి వచ్చేద్దాం.."

"వచ్చి..?"

"మహారాణి వారి శ్రీపాదాలను ఆశ్రయించండి. చేసిన తప్పు తెలుసుకుని, యువరాణిని ఆమె తల్లిదండ్రులకు క్షేమంగా అప్పగించినట్టు చెప్పండి.."

కళింగరత్న చెయ్యెత్తి ఆంతరంగిక సేవకుడిని ఆపాడు.

"ఆగు! కర్తవ్యం కరతలామలకం అయ్యింది. కామరూప చక్రవర్తి ఆనాడు చేసిన శపథం ప్రకారం తన కుమార్తెను వివాహం చేసుకోమని చెప్పాడన్న విషయం చెప్తాను. తల్లిదండ్రుల అనుమతి అవసరమన్న విషయం చెప్తాను. నేను అనాలోచితంగా చేసిన అపహరణ నేరాన్ని మరిచిపోయి లాలసను కోడలిగా స్వీకరించమని బ్రతిమాలుతాను. రాజదంపతులైన నా తల్లిదండ్రులు మొండిగా ప్రవర్తిస్తూ నిరాకరిస్తే భీష్మంగా బ్రహ్మచారిగా ఉండిపోతానంటూ తీవ్రంగా హెచ్చరిస్తాను. 'ఆత్మహత్య' అంటే భయపడనని మహారాణిగారు చెప్పేశారు."

"అద్భుతం! మహాద్భుతం! తమ కుమారుడితో తమ వంశం అంతరించిపోవడం తమ జననీ జనకులు సహించరు!"

"కద! ఇక జలజ సంగతి కూడా మా తల్లిగారు చూసుకుంటారు! మన వివాహ ప్రయాణం ఇక రాజమార్గంలో సాగిపోతుంది!" కళింగరత్న సగర్వంగా అన్నాడు.

"తమ మేధస్సు వికసించిపోయింది యువప్రభూ! కన్యాదాతకు లేని అభ్యంతరం కన్నవారికి ఎందుకు? కామరూప రాకుమారి లాలసాదేవి గారితో కళింగ యువరాజు కళింగరత్నగారి వివాహం తథ్యం!" ఉలూకుడు ఉత్సాహంగా అన్నాడు.

"అందుకో ఉలూకా, పానపాత్ర!" కళింగరత్న సగర్వంగా అన్నాడు. ఆసనం మీద ఠీవిగా కూర్చుని, ఉలూకుడు అందించిన స్వర్ణపాన పాత్రను అందుకుని, ఉలూకుడివైపు మెరుస్తున్న మెల్లకంటితో చూశాడు.

"ఉలూకా, కన్యతో కొంగులో ముడివేసుకు వచ్చే కానుక ఏమిటో తెలుసా?"

"నవరత్నాలు కలిపిన ఒడిబ్రాలా?" ఉలూకుడు ప్రశ్నించాడు.

కళింగరత్న ఒక్కసారి మధువును చప్పరించి, గొల్లున నవ్వాడు.

"పిచ్చివాడా! నవరత్నాలు కలిపిన పిడికెడు బియ్యం కాదు; కామరూప సామ్రాజ్యం! కన్నకూతుర్ని అన్వేషించి అప్పగించే వీరుడికి, కుమార్తెనూ, సామ్రాజ్యాన్నీ అప్పగిస్తానంటూ శపథం చేశాడు కుబేరవర్మ!" కళింగరత్న ఉత్సాహంగా అన్నాడు. "ఎల్లుండి సూర్యోదయానికి ముందే మన ప్రయాణం! రేపు రాత్రికే అంతా సిద్ధం చేయి! అతి రహస్యం సుమా!"

●●●

లాలస వాతాయనం ముందు నిలుచుంది. సంధ్యారాగం అందాలను అందిపుచ్చుకున్న పడమటి ఆకాశం ఆమె చూపులను ఆకర్షిస్తోంది.

> **లాలస అక్కడినుంచి ఎలా తప్పించుకోవాలా? అని పరిపరివిధాలుగా ఆలోచిస్తోంది. ఇంతలో ద్వారం తెరుచుకుని కురంగి లోపలికి వచ్చింది. లాలసను చూసి చిరునవ్వు నవ్వింది. పెదవులు కదిలాయి. అదిరిపడింది లాలస. నేను మూగదాన్ని, చెవిటిదాన్ని కాదు, నటిస్తున్నాను అంది కురంగి. ఇంతకీ కురంగి ఎవరు? ఆమె ఎందుకలా నటిస్తోంది?**

సింధూర వర్ణంలో గుండ్రంగా వెలిగిపోతున్న సూర్యబింబం తన నగరంలోని కామరూపాంబిక దేవత నుదుటి మీద అర్చకుడు దిద్దిన కుంకుమ తిలకాన్ని గుర్తుకు తెస్తోంది.

జీవితంలో-ఈ జన్మలో తనకు ఇంక కామరూపాంబిక దర్శనం లభిస్తుందా? తను తల్లిదండ్రులను కలుసుకోగలదా? కామరూప నగరానికి వెళ్ళగలదా? ఎర్రటి, గుండ్రటి సూర్యబింబం మధ్య నల్లటి గీత ఏదో గీస్తున్నట్టు ఏదో పక్షి ఎగురుతూ వెళ్ళింది. తను కామరూప నగరానికి వెళ్ళగలదు. తల్లిదండ్రుల్ని కలుసుకోగలదు. కామరూపాంబికను దర్శించగలదు. అయితే-అందుకు తను ఆ పక్షిలా మారిపోవాలి!

లాలస బరువుగా నిట్టూర్చింది. మెల్ల కంటి మేటి వీరుడు తనను వదలడు. తనను హెచ్చరించిన విధంగా రాక్షస వివాహం చేసుకుంటాడు. రాక్షస వివాహబంధం నుండి తప్పించుకోడానికి తనకి ఒకే ఒక మార్గం ఉంది. ఆత్మహత్య...ఔను... తనను అపహరించి తెచ్చిన రాక్షసుడికి తను తన మనసును ఇవ్వలేదు; తనువునూ ఇవ్వదు... చరిత్రలో ఎందరో రాజపుత్ర స్త్రీలు ఆత్మహత్యలు చేసుకుని, మనసులనూ, తనువులనూ పవిత్రంగా ఉంచుకున్నారు. వాళ్ళే, ఆ వీరకాంతలే తనకు ఆదర్శం.

తలుపు గొళ్ళెం చప్పుడు లాలసను గిరుక్కున వెనక్కు తిప్పింది. మూగ బధిర వృద్ధ పరిచారిక కురంగి తలుపులు మూసి, జాగ్రత్తగా గొళ్ళెం బిగిస్తోంది. లాలస తన సంధ్యారాగ సందర్శననూ, ఆలోచనలనూ మాని, మంచంవైపు నడిచి, తలగడలకు ఆనుకుని వాలుగా కూర్చుంది. చెవిటి పరిచారిక అడుగుల చప్పుడు కాకుండా మంచాన్ని సమీపించింది. ఆమె చంకలో ఏదో గుడ్డల మూట ఇరికించి ఉంది. ఆ మూటను తలగడల కింద దోపి, లాలసవైపు తదేకంగా చూసింది. ఆమె ముఖం మీద చిరునవ్వు ప్రత్యక్షమైంది. తనను

## విందుల్లో విడాకుల జంట

బాలీవుడ్‌లో విడాకులు మనసుకు సంబంధించి కాకుండా మనీకి సంబంధించినవిగానే ఉంటున్నాయి. మొన్నటికి మొన్న హృతిక్ సజానె విడాకుల కేసు 50 నుంచి 100 కోట్ల భరణంతో పరిష్కారమైతే ఇప్పుడు అర్బాజ్‌ఖాన్, మలైకా అరోరాల విషయంలో 15 కోట్లకు డీల్ కుదిరిందని అంటున్నారు. ఈ జంటకు త్వరలోనే విడాకుల మంజూరు ఖాయం అని అందరూ అనుకుంటున్న తరుణంలో వీరిద్దరూ కలిసి న్యూఇయర్ పార్టీలో సందడి చేశారు. విడాకులు తీసుకోబోతున్నారు కదా? పార్టీకి కలిసి ఎలా వచ్చారు? అన్న అనుమానం వచ్చి, అదే విషయాన్ని అడిగితే, విడాకులు విడాకులే, విందులు విందులే అన్న రీతిలో సమాధానమిచ్చారట! వీరిద్దరూ బహుశా హృతిక్, సుజానెలను ఫాలో అయిపోతున్నారని బాలీవుడ్ జనాలు అంటున్నారు.

చూస్తూ మొట్టమొదటిసారిగా చిరునవ్వు నవ్వుతున్న నోరులేని, చెవిటి వృద్ధురాలిని లాలస అర్థం కానట్టు చూసింది. కురంగి పెదవులు కదిలాయి.

"అమ్మా యువరాణీ, నీకు ప్రమాదం పొంచి ఉంది..." అంది కురంగి తగ్గుస్వరంతో. లాలస అదిరిపడింది. ఆశ్చర్యంతో ఆమె విశాల నేత్రాలు గిన్నెల్లా అయ్యాయి. నివ్వెరపాటు ఆమె ఎర్రటి పెదాలను అదిరేలా చేసింది.

కురంగి మళ్ళీ చిరునవ్వు నవ్వింది. "ఆశ్చర్యపడవద్దు. భయపడవద్దు. నేను మూగదాన్ని కాను; చెవిటి దాన్నీ కాను. మహారాణిగారి కొలువులో చేరిన నాటి నుండీ, ఆమె ఆంతరంగిక పరిచారికగా ఉంటూ, అంతఃపుర రహస్యాల రక్షణ కోసం నోరూ చెవులూ లేనిదానిలా నటిస్తూ వస్తున్నాను. నా నటన ఒక్క మహారాణిగారికే తెలుసు..."

"...కు...కు..రంగీ.."

"మాట్లాడకుండా విను తల్లీ. మా యువరాజు కళింగరత్న, ఆయన తొత్తు ఉలూకుడూ దారుణమైన ఎత్తు వేశారు. ద్వారం వద్ద పొంచి ఉండి, అంతా ఆలకించాను..." కురంగి తగ్గు స్వరంలో చెప్పసాగింది. లాలస నివ్వెరపాటుతో మౌనంగా వినసాగింది.

"మా నాన్నగారు ఆ విధంగా ప్రకటించి ఉంటే మెల్లకంటి వాడైనా సరే, కళ్ళు లేని కబోది అయినా సరే నన్ను అప్పగించే వాడికిచ్చి వివాహం జరిపిస్తారు!" లాలస వణికే కంఠంతో అంది. ఆమెకు కళింగరత్న పథకం అర్థమైపోయింది.

"అది తప్పించుకోవాలంటే ఉన్న మార్గం ఒక్కటే తల్లీ!" కురంగి లాలస కళ్ళల్లోకి చూస్తూ అంది. "ఇక్కణ్ణుంచీ తప్పించుకోవాలి!"

లాలస ఆశగా, ప్రశ్నార్థకంగా, ఆందోళనగా చూసింది.

"నీకు ఒక రహస్య మార్గం చూపిస్తాను. ఒక పేదయువతి ధరించే వస్త్రాలు నీ తలగడ క్రింద దాచాను. పరిచారికలు నీకు రాత్రి భోజనం అందిస్తారు. దానిని ఆరగించవద్దు. ఆహారం అందించి వెళ్ళగానే, లోపల్నుంచీ గొళ్ళెం బిగించు. వస్త్రాలు మార్చుకో. నేను చూపించే దారి గుండా పారిపో.."

"...పరిచారికలు...భటులు..." లాలస వణికే కంఠంతో అనుమానం వ్యక్తం చేసింది.

కురంగి చిరునవ్వుతో రొంటిన దోపుకున్న చిన్న భరిణెను తీసి చూపించింది. ఇది మహాశక్తిమంతమైన మత్తు మందు. ఈ పూట ఆహార పదార్థాలన్నింటిలోనూ ధారాళంగా కలిపేస్తాను. మందిరంలో ఆరగించే వాళ్ళందరూ-పరిచారికలూ, భటులూ, యువరాజూ - అందరూ గాఢనిద్రలోకి జారుకుంటారు. తెల్లవారేదాకా వాళ్ళందరూ శవాలే! ఆ...జాగర్తగా విను! రహస్య మార్గం నిన్ను ప్రజల ఉపయోగంలో లేని పాత ఉద్యానవనంలోని నడిబావిలోకి చేరుస్తుంది. దానికి నలువైపులా శిలా తోరణాలతో కూడిన ద్వారాలు ఉంటాయి. దక్షిణ ద్వారం గుండా బైటపడు. నగర ప్రజలు నిషేధించిన వనం అది. విటులకూ, అభిసారికలకూ సంకేత స్థలంగా ఉపయోగపడుతోంది..."

"మార్గం నడిబావిలోకే చేర్చుతుందన్నావు. బావి..." లాలస అనుమానం వ్యక్తం చేసే ప్రయత్నం చేసింది.

"అందులో నీళ్ళు లేవు! బావిలోకి చేరుకోగానే మెట్లెక్కి, దక్షిణ ద్వారం వైపు వెళ్ళు. భయంలేదు; బావి పై నుండి వేలాడుతూ ఉండే తీగలు సొరంగ మార్గాన్ని దట్టంగా కప్పి ఉంటాయి. పొదల మాటునా, చెట్లచాటునా దాగి ఉండే యువ జంటలు నిన్ను పట్టించుకునే స్థితిలో ఉండరు.."

"రాత్రికి...నువ్వు..."

"నేనిక్కడ ఉండను. కేతకిగానీ, సుగంధిగానీ ఉంటారు. ప్రధాన ద్వారం ముందు భటులు ఉంటారు. ఎందుకైనా మంచిదన్న ముందు చూపుతో భటులు తినే తిండిలో కూడా నిద్రా చూర్ణం కలుపుతాను! చెవులు రిక్కించుకుని ఆలకిస్తూ ఉండు. నీ పళ్ళెంలో ఉన్న ఆహారంలో కొంత ఉండేట్టు ఏర్పాటు చెయ్. పరిచారిక ఎంగిలి పళ్ళెం తీసుకు వెళ్ళాక, తాను భోం చేస్తుంది. జాగ్రత్త కోసం ఒక గంట పాటు వేచి ఉండు. ఆ తరువాతే పలాయన ప్రయాణం ప్రారంభించు. పరిచారికలిద్దరూ వంటపనిలో ఉన్నారు. రా...దారి చూపిస్తాను. బాగా గుర్తుపెట్టుకో. ఇది చాలా విశాలమైన నగరం. పొలిమేర సమీపించేదాకా దక్షిణ ముఖంగానే సాగిపో. నక్షత్రాలను ఆధారంగా చేసుకో. పొలిమేర దాటాక, నాలాగా మూగదానిలాగో, పిచ్చిదానిలాగో నటిస్తూ మా రాజ్యం దాటి, మీ రాజ్యం చేరుకో. దారి చూపించే బాధ్యత నాది; తప్పించుకునే బాధ్యత నీది! రా వెళ్దాం!"

•••

లాలస పళ్ళెంలో కొన్ని పదార్థాలను వదిలి వేసి, పళ్ళెం తీసుకు వెళ్ళడానికి వచ్చే పరిచారిక కేతకి కోసం వెయ్యి కళ్ళతో ఎదురు చూస్తూ కూర్చుంది. ఆమె వచ్చి వెళ్ళాక తాను గంట పాటు వేచి ఉండాలి. గది మూలలో పీఠం మీద ఉన్న ఇసుక గడియారం తనకి సమయం తెలియజేస్తుంది. తరువాత వస్త్రాలు మార్చుకుని, పేద యువతిలా మారాలి. మందిరం వాయువ్య దిశలో ఉన్న చిన్న ఆయుధాగారంలో అదృశ్యంగా ఉన్న రహస్య ద్వారం గుండా తను బైట పడాలి. గోడ మీద చెక్కిన బొజ్జగణపతి బొడ్డులో చూపుడు వేలు పెట్టి సున్నితంగా నొక్కితే చాలు, నేలను ఆనుకున్న రహస్య ద్వారం తెరుచుకుంటుంది! కురంగి ఆ కిటుకు చేసి చూపింది. తన చేత చేయించింది. మందిరంలో ప్రవేశ ద్వారాలూ, కక్ష్యలూ అల్లిబిల్లిగా ఉన్నాయి. కురంగి నెమ్మదిగా, జాగ్రత్తగా చూపించింది. ద్వారాలు గుర్తుంచుకోవడానికి ఉపాయాలు చెప్పింది. ఉద్యానవనానికి చేర్చే రహస్య మార్గం చీకటిగా ఉంటుందట. నిర్భయంగా, ఒక చేత్తో గోడను తడుముకుంటూ వెళ్తే చాలు అంది కురంగి. తనకు ధైర్యం చెప్పింది. అంధకార బంధురమయ్యే భవిష్యత్తు నుండి తప్పించుకోవడానికి తను ఎంత కటిక చీకటినైనా భరించగలదు!

కురంగి నిజరూప దర్శనం ఒక అద్భుతం. ఒక ఆశ్చర్యం. తన పాలిట ఒక అదృష్టం. బాల్యం నుండీ, నిత్యం తను ఆరాధించిన కామరూపాంబిక కురంగి రూపంలో తనకి సహాయం చేస్తోంది. ఆపదలో ఆదుకుంటోంది. బైట పడిన అనంతరం తను చాలా జాగ్రత్తగా ప్రయాణం సాగించాలి. కురంగి చెప్పినట్టు నటించవచ్చు. అయితే ఒక ప్రమాదం ఉంది. ఆ ప్రమాదానికి కారణం తన అందం! తన అందాన్ని కప్పిపుచ్చుకోవాలి. లోకం కళ్ళకు తన అందం కనిపించ




## వలయం

*ప్రతి మనిషి...కుటుంబం... మనోభావం*
*అసలు ఈ భూగోళం కూడా*
*పరిభ్రమిస్తున్నది ఒక వలయంలోనే!*
*రంగులరాట్నంలో తిరిగే*
*గుర్రం మీద కుర్రాడిలా!*

*కానీ...వేగం ఎప్పుడూ ప్రమాదమే!*
*ఒకే ఒక భావసృష్టి*
*ఒకే ఒక సూత్ర వృష్టి*
*ఒకే ఒక భ్రమణ పరిధి ముందు*
*మిగతా విలువలన్నీ*
*దిగదుడుపు దిష్టిచుక్కలే!*
*ఏ మనిషైనా ఆకాశం వైపు ఎదిగితేనే*
*ఎదుటి వేదనకు సానుభూతి ఉండేది!*
*భావజగత్తులో మరొకరికి చోటిస్తేనే*
*విశ్వాన్నంతా తనలో దర్శించటమౌతుంది!*

*జీవితాన్ని గుప్పెట్లో బిగించకుండా ఉంటేనే*
*చివరి మనిషయినా మిగిలేది!*
*ఆవేశకావేషాల నీటివాలుకు కొట్టుకుపోకుండా*
*ప్రవాహానికి ఎదురునిల్చే వృక్షంలా*
*లోకానికి హరితాన్ని పంచగలిగేది!*



*వేడి నిట్టూర్పుల్ని దిగమింగలేకపోయినా*
*ప్రతి వలయం స్వశక్తివంతమే!*
*అనుక్షణం అస్తిత్వ యుద్ధ శంఖారావమే!*

**-డా. సి.భవానీదేవి**
**సెల్: 98668 47000**

కూడదు! ఏం చేయాలి?

తలుపు తెరుచుకున్న చప్పుడు లాలస ఆలోచనలను అడ్డుకుంది. పరిచారిక కేతకి పళ్ళెం కోసం వస్తోంది.

•••

లాలస భోజనం చేసిన పళ్ళెంతో కేతకి వంటశాలలోకి వచ్చింది. పళ్ళేన్ని శుభ్రంగా కడిగి, దాని స్థానంలో ఉంచింది. యువరాజుగారు ఆరగించిన పళ్ళేన్నీ, ప్రధాన ద్వారం ముందున్న భటులు ఆరగించిన పళ్ళేలు తీసుకు వచ్చాక, తను భోజనం చేయాలి. తనతో పాటు ఆరగించడానికి ఉలూకుడు వస్తాడు. ప్రతీ శుక్రవారం ఇద్దరూ కలిసి భోజనం చేయడం ప్రేమతో కూడిన ఆచారంగా మారిపోయింది! ప్రతీ శుక్రవారం ఉలూకుడు ఆరగించడం ఇక్కడే; ఆదమరవడం ఇక్కడే! వారం వారం ప్రణయ కైవారం! కేతకి నవ్వుకుంటూ భటులు పళ్ళేల కోసం ప్రధాన ద్వారం వైపు బయలుదేరింది. భటులు వాటిని ద్వారం లోపల పెట్టి ఉంటారు.

భటుల పళ్ళాల్ని వాటి స్థానంలో ఉంచి, యువరాజుగారి కక్ష్యలోకి వెళ్ళిన కేతకి కొద్దిగా తూలుతూ నడుస్తున్న కళింగరత్నను చూసి ఆశ్చర్యపోయింది. మద్యం సేవించినప్పుడు కూడా యువరాజుగారు తూలరు! అత్యధికంగా సేవించి ఉంటారు! కేతకి రాకను గమనించనట్టు కళింగరత్న ముందుకీ వెనక్కీ ఊగుతూ వాతాయనం వద్దకు వెళ్ళాడు. రెండుచేతుల్తో ఊచలు పట్టుకుని నిటారుగా నిలబడే ప్రయత్నం చేస్తున్నాడు. కేతకి యువరాజుగారి బంగారు పళ్ళేన్ని తీసుకుని బైటికి నడిచింది.




వంటశాలలో కూర్చున్న కేతకి అలసటగా ఆవులించింది. ఆమెకు ఆకలిగా ఉంది. అలసటగా ఉంది. ఆకలి తీర్చుకున్న అనంతరం తను యువరాణి శయనాగారం ముందు మెలకువతో కాపలా ఉండాలి. తనకు తెలుసు. ఎవ్వరూ కళ్ళల్లో వత్తులు వేసుకుని సూర్యాస్తమయం నుండీ సూర్యోదయం దాకా 'కళ్ళు తెరుచుకుని' కాపలా కాయలేరు; కాయరు. కళ్ళు మూస్తూ, కునుకు తీస్తూ కాపలా ఉంటారు! తనూ అంతే!

ఉలూకుడు ఇప్పుడప్పుడే వచ్చేలా లేడు. ఆకలి మండిపోతోంది. దాన్ని కొద్దిగా అదుపులో ఉంచి, అతని రాక కోసం ఎదురు చూస్తే సరి. కేతకి నవ్వుకుంటూ లేచి, పాయస పాత్ర మీద ఉన్న మూతను తీసింది. స్వచ్ఛమైన నెయ్యి వాసన ఆమె ఆకలిని హెచ్చవేత వేస్తూ పాత్రలోంచి దూసుకు వచ్చింది! కేతకి నాలుగు గరిటెల పాయసాన్ని చిన్న గిన్నెలోకి పోసుకుంది. నోరూరిస్తున్న పాయసాన్ని ఆప్యాయంగా ఆరగించసాగింది. అమ్మ నేర్పిన పాయసం. అమృతంలా ఉంటుంది! ఆకలి నిమ్మళించింది. ఇంక ఎంతసేపైనా ఉలూకుడి కోసం వేచి ఉండగలదు తను! కేతకి పాయసపాత్ర మీద మూతపెట్టి, తన విశ్రాంతి కక్ష్యవైపు బయలుదేరింది. ఉలూకుడు ముందుగా అక్కడికే వస్తాడు.

•••

ఇసుక గడియారం లాలసను హెచ్చరించింది. లాలస తన వస్త్రాలను విసర్జించి, కురంగి తలగడల చాటున ఉంచిన వస్త్రాలు ధరించింది. నిలువుటద్దం ముందుకు వెళ్ళి నిలుచుంది. పేదరికాన్ని కళ్ళకు కట్టుతోంది ప్రతిబింబం. ప్రమాద స్థలం నుండి క్షేమంగా గట్టెక్కించమని ఆ దేవిని ప్రార్థించింది. మెల్లగా కళ్ళు తెరిచిన లాలసకు ఏదో గుర్తొచ్చింది. తన పేదరిక రూపం వస్త్రాలకే పరిమితమైంది. నాసికాభరణం, కర్ణాభరణాలూ చాలా విలువైనవి. చూపరులలో అనుమానాలకు అవకాశం ఇస్తాయవి! లాలస కర్ణాభరణాలనూ, నాసికాభరణాన్నీ చకచకా తీసి నడుములో దోపిన కొంగు చివర్లో జాగ్రత్తగా ముడివేసి, దోపుకుంది.

ఇన్నాళ్ళూ తనకు చెరసాలలా ఉన్న శయనాగారాన్ని క్షణం సేపు కలియజూసింది. తను త్వరపడాలి. మందిరంలోని వ్యక్తులు మత్తు నుండి కోలుకుంటే ప్రమాదం! కురంగి తీసుకు వెళ్ళిన దారిని గుర్తు చేసుకుంటూ లాలస శయనాగారం ద్వారాన్ని దాటి, అటూ ఇటూ చూసి, ఎడమ వైపుకు తిరిగి చప్పుడు కాకుండా స్వేచ్ఛాలోకం వైపు నడవసాగింది.

ఉలూకుడు గుర్రం మీద నుండి దిగి, ఉల్లాసంగా, ఈల వేసుకుంటూ పర్వత మందిర ద్వారం వైపు నడిచాడు. ద్వారం ముందు ద్వారపాలకులు నిలుచుని లేరు. ద్వారానికి ఇరువైపులా గోడకి వీపులు ఆన్చి కూచున్నారు. ఉలూకుడు ఆ ఇద్దరినీ ఆక్షేపణగా చూశాడు.

"రేయ్! పర్వతాలూ, లింగా లేవండ్రా!" ఉలూకుడు వేగంగా మెట్లెక్కుతూ ద్వారపాలకుల్ని ఒకసారి హెచ్చరించి; తలుపులు తెరిచి, లోపలికి వెళ్ళి తలుపుల్ని మూసివేశాడు. కేతకి తన కోసం మేలుకుని ఉంటుంది. ద్వారం వద్ద కాపలా ఉన్న ద్వారపాలక సోమరిపోతుల్ని మేలుకొలిపే ఓపిక తనకు లేదు!

మందిరంలో ప్రవేశించిన ఉలూకుడు తటాలున ఆగాడు. యువరాణి శయనాగారం తలుపు తెరిచి ఉంది. అక్కడ ఉండాల్సిన కేతకి లేదు. కేతకి మందిరంలో తన విశ్రాంత కక్ష్యలో ఉంటుంది. శయనాగారం తలుపు ఎందుకు తెరిచి ఉంది? ఎవరు తెరిచారు? వెలుపల గొళ్ళెం బిగించి ఉండాలి కదా? ఆలోచిస్తూ ఉలూకుడు ద్వారం ముందు ఆగి, శయనాగారం లోపలకి చూశాడు. మంచం మీద యువరాణి లేదు. ఉలూకుడు కళ్ళు చిట్లిస్తూ శయనాగారంలోకి వెళ్ళాడు. నలుమూలలా కలియజూశాడు. యువరాణి లేదు. కేతకి వెంట మందిరంలో తిరుగుతోందా? ఇంత రాత్రివేళ ఆ అవసరం ఎందుకు వచ్చింది? యువరాజుగారికి తెలిస్తే ప్రమాదం! ఆయనకి చిక్కే మొదటి బలిపశువు తనే!

ఉలూకుడు శయనాగారం వెలుపలికి వేగంగా వెళ్ళాడు. కాస్సేపట్లో మందిరంలోని ప్రధాన కక్ష్యలన్నింటిలోనూ చూశాడు. తన శయనాగారంలో యువరాజు చెవులు చిల్లులు పడేలా గురక పెడుతూ గాఢ నిద్రలో ఉన్నాడు. ఇతర కక్ష్యలలో ఎవ్వరూ లేరు. ఇక మిగిలింది వంటశాల; కేతకి కక్ష్య. ఉలూకుడు పాకశాలలోకి తొంగి చూసి, కేతకి లేదని నిర్ధారించుకుని, ఏకాంతంలో ఆమె తనను కలుసుకునే కక్ష్యవైపు వేగంగా వెళ్ళాడు.

కేతకి గోడవారగా ఉన్న అరుగు మీద వెల్లకిలా పడుకుని, ఆదమరిచి నిద్రపోతోంది. ఉలూకుడు ఆమెను పిలుస్తూ చేతితో కదుపుతూ మేలుకొలిపే ప్రయత్నం చేశాడు. కేతకిలో చలనం లేదు! మొదటిసారిగా ఏదో అనుమానం ఉలూకుడిలో పొటమరించింది. అతని గుండె దడదడమంటూ వేగంగా కొట్టుకుంది. అన్నాళ్ళూ పూర్తిగా మరిచిపోయిన, ఉపయోగంలేని చిన్న ఆయుధాగారం గుర్తొచ్చిందతనికి. ఉలూకుడు గుమ్మం వైపు పరుగెత్తాడు.

ఆయుధాగారంలో నోరు తెరిచి చూస్తున్న రహస్య ద్వారాన్ని చూసి, వణుకుతున్న కాళ్ళను అదుపులో పెట్టుకునే ప్రయత్నం చేస్తూ, ఉలూకుడు ద్వారం వైపు పరుగెత్తాడు. రహస్యమార్గం గుండా వెళ్ళడం వృథా. సమయం వ్యర్థమైపోతుంది. ఆ మార్గం ఉద్యానవనానికి తీసుకు వెళ్తుందని తనకి తెలుసు. సందేహం లేదు. యువరాణి రహస్యమార్గం గుండా పారిపోయింది! ఆ మార్గం గురించి ఆమెకి ఎలా తెలిసింది? ఎవరు చెప్పారు? కేతకీ, ద్వారపాలకులూ, యువరాజుగారూ ఆదమరిచి ఎందుకు నిద్రపోతున్నారు?

లోపల నుంచి ఒకదాని తరువాత ఒకటిగా తన్నుకు వస్తున్న ప్రశ్నలకి సమాధానాలు వెతికే ప్రయత్నాన్ని మనసులోంచి తీసేసి ఉలూకుడు ప్రధాన ద్వారంవైపు పరుగెత్తసాగాడు. ముందు తాను కనిపెట్టాల్సింది ప్రశ్నలకు సమాధానాలు కావు! పారిపోయిన యువరాణి లాలసను! మత్తు నిద్రలోనే ఉన్న ద్వారపాలకుల్ని నిర్లక్ష్యం చేస్తూ ఉలూకుడు తన గుర్రం వైపు పరుగెట్టాడు. కొద్ది క్షణాల్లో ఉలూకుడు అధిరోహించిన అశ్వం పర్వత పాదం వైపు పరుగు ప్రారంభించింది.

***(ఇంకా వుంది)***

## హార్మోన్ ప్రాబ్లమ్స్

మనిషి జీవించడానికీ శ్వాస ఎంత ముఖ్యమో, మనిషి ఆరోగ్యంగా ఉండాలంటే శరీరంలో ఉత్పత్తి అయ్యే హార్మోన్లు అంతే ముఖ్యం. గర్భాశయంలో పిండంగా ఏర్పడినప్పటి నుంచి మనిషికాలం తీరేంతవరకు శరీరం మీద హార్మోన్ల ప్రభావం ఉంటుంది.

శరీరంలోని ఒక కణం నుంచి మరోక కణానికి రసాయనిక సమాచారం అందచేయబడి సంకేతములను తెలిపే కెమికల్స్‌ను హార్మోన్లు అంటారు. మెదడు భాగంలోని హైపోథాలమస్ మరియు పిట్యూటరి గ్రంథి హార్మోన్ల ఉత్పత్తికి దోహదపడి శరీరంలోని కణాల క్రమబద్ధతకు ప్రాముఖ్యత వహిస్తుంది. ఈ హార్మోన్లు శరీర ఉష్ణోగ్రతను, ఆకలిని, మానసిక స్థితిని, నిద్రను, దాహము కామక్రోధాల్ని అదుపులో ఉంచుతాయి. ఈ మధ్యకాలంలో హైపోథైరాయిడ్, పిసిఓడి, సంతానలేమి, డయాబెటీస్ వంటి దీర్ఘకాలిక జబ్బులన్నీ హార్మోన్ అసమతుల్యత వల్ల వచ్చేవి. చాలా రకాల హార్మోన్లు మన శరీరాన్ని ప్రభావితం, చేస్తాయి. హార్మోన్లు పాలిపెప్టైయిడ్‌తో నిర్మితమైన రసాయన వాహకాలు, ఇవి శరీరంలో ఒక ప్రాంత కణజాలం, అవయవాల నుంచి ఉత్పత్తి అయి వివిధ శరీర భాగాలకు రక్తం ద్వారా ప్రవహించి నిర్దిష్ట అవయవాన్ని ప్రభావితం చేసి జీవప్రక్రియల సమతుల్యతకు తోడ్పడతాయి. ఈ హార్మోన్ల సమతుల్యం దెబ్బతిన్నప్పుడు దీర్ఘకాలిక వ్యాధుల బారిన పడతారు. ఈ హార్మోన్లు ఎండోక్రైన్ గ్రంథుల నుంచి ఉత్పత్తి అవుతాయి. శరీరంలో ఇవి సూక్ష్మమోతాదులో ఉత్పత్తి అయినప్పటికీ ప్రభావం ఎక్కువగా ఉంటుంది. సాధారణ జీవక్రియలైన జీర్ణక్రియ, శారీరక, మానసిక ఎదుగుదల, మానసిక సమతుల్యత జీవక్రియలకు తోడ్పడతాయి. థైరాయిడ్ హార్మోన్లు టి3, టి4 ఇవి థైరాయిడ్ గ్రంథి నుంచి ఉత్పత్తవుతాయి. వాటి అసమతుల్యత వల్ల హైపోథైరాయిడ్, హైపర్ థైరయిడ్ గాయిటర్ అనే దీర్ఘకాలిక జబ్బులు వస్తాయి.

**స్త్రీలలో హార్మోన్ సమస్యలు.-** ఈస్ట్రోజన్, ప్రొజెస్టిరాన్, ప్రోలాక్టిన్, ఆక్సిటోసిన్, హార్మోన్లు స్త్రీలలో నెలసరి, ద్వితీయ లైంగిక లక్షణాలు, సంతానోత్పత్తి, ప్రసవంలో ఉపకరిస్తాయి. ఈ హార్మోన్లు అసమతుల్యత వల్ల స్త్రీలలో నెలసరి సమస్యలు, అవాంఛిత రోమాలు, సంతానలేమి సమస్యలు వస్తాయి. స్త్రీలలో మోనోపాజ్, నెలసరి వచ్చే సమయంలో హార్మోన్ల హెచ్చుతగ్గుల వల్ల వేడి ఆవిర్లు, మానసిక అశాంతి, నీరసం, కీళ్ళనొప్పులు వస్తాయి.

**పురుషులలో హార్మోన్ సమస్యలు.-** మగవారిలో ముఖ్యంగా టెస్టోస్టిరాన్ అనే హార్మోన్ ఉత్పత్తి అయి ఎముకల సాంద్రతకు, ఉపయోగపడుతుంది. ఈ టెస్టాస్టిరాన్ లోపం వలన సెక్స్‌ప్రాబ్లమ్స్, కండరాల పటుత్వం తగ్గిపోవటం, డిప్రెషన్, టైప్2 డయాబెటీస్ అంతేకాక ఎల్‌హెచ్2, ఎఫ్ఎస్‌హెచ్ డెఫిసిమెన్సీ ఉంది. టెస్టోస్టిరాన్ హార్మోన్ అసమతుల్యత వల్ల శీఘ్రస్కలనం, అంగస్తంభన సమస్యలు, వీర్యకణలోపాలు, సంతానలేమి సమస్యలు వస్తాయి. పిల్లల్లో బరువు ఎత్తు, ఎదుగుదల సమస్యలు వస్తాయి.

**హోమియో చికిత్స.-** హార్మోన్లప్రభావం శరీరము మీద ఎంతో ఉంది. థైరాయిడ్ సమస్యలతో బాధపడేవారు. జీవితాంతం మందులు వాడాల్సి వస్తుందని



**డా. మురళి అంకిరెడ్డి**
M. D (Homeo)
**స్టార్ హోమియోపతి**

వాపోతుంటారు. అంతేకాక మందులు మానేయటం వలన సమస్య పెరిగే అవకాశం ఉంది. థైరాయిడ్ సమస్య కాకుండా ఇతర హార్మోన్ల సమస్యలను తొలగించడానికి ఇప్పుడు హో మియోపతిలో మంచి మందులున్నాయి. హోమియోపతిలో రోగి యొక్క శారీరక, మానసిక, అనువంశిక, వంశపారంపర్య తత్వాలను విశ్లేషించి చికిత్స చేయటం జరుగుతుంది.

ఉదా। థైరాయిడ్‌కు కల్కేరియా కార్బ్ థైరాయిడిసమ్, ఐయోడమ్, బ్రోమియం, సల్ఫర్ మరియు ఇతర సమస్యలకు హోమియోపతిలో మంచి మందులు ఉన్నాయి. వీటిని అనుభవజ్ఞులైన డాక్టర్ పర్యవేక్షణలో వాడాలి. తద్వారా వ్యాధిని మూలంగా నయం చేయువచ్చు.

www.starhomeopathy.com తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక । దుబాయి । లండన్ । మాంచెస్టర్ 90300 64224

## సోరియాసిస్

సోరియాసిస్ మచ్చలు పింక్ లేక ఎరుపు వర్ణంలో పొలుసులతో కూడి ఉంటాయి. చర్మం దళసరిగా ఉంటుంది. ఈ పొలుసులను బల వంతంగా తీస్తే వాటికింద ఎర్రటిరక్తపు మచ్చలు గాకనిపిస్తాయి.ఈసోరియాసిస్‌మచ్చలు కొంచెం కాని, ఎక్కువ సంఖ్యలో గాని ఉంటాయి.

శరీరంలోని చాలాభాగాలలో అంటే చేతులు, కాళ్ళు, తల,వీపుమీద,మోకాళ్ళ ముందుభాగాన, ఉదరం, అరికాళ్ళు, అరిచేతులలో అధికంగా ఈమచ్చలువస్తాయి.పొలుసులుచాలా దట్టంగా, అధికంగాఉండి కొవ్వొత్తిమైనంలాగాఉంటాయి. ఒక్కొక్కసారి వాపుతో కూడి ఉంటాయి.

సోరియాసిస్ ప్రధానంగా చాతి, కాళ్ళ మీద... యుక్త, మధ్యవయస్సులో అధికంగా కనిపిస్తుంది. చాలా తక్కువగా చిన్నపిల్లలు, వృద్ధులలో కనిపించ వచ్చు. అధికవత్తిడివలన, వంశపారంపర్యంగా తల్లిదండ్రులకు ఉంటే వారి పిల్లలకు ఈ వ్యాధిరావటానికి అవకాశాలు ఉంటాయి. కాలివేళ్ళు, చేతివేళ్ళ గోళ్ళలో గుంటలు పడినట్లు ఉంటాయి.



**చికిత్సా విధానం:** ప్రధానంగా సోరియాసిస్ (కిటిభ కుష్టం) అనే వ్యాధిలో పంచకర్మ చికిత్సా విధానం ఎంతో ప్రముఖమైనది. ఈ పంచకర్మ విధానంలో వమనకర్మప్రధానమైనది. దీనివలన శరీరంలో ఉన్న చెడుభావాలు రసాయనాలు మొదలగు శరీరం నుండి బయటికి పంపబడ తాయి. తక్రధార. ఈ చికిత్సావిధానంలో ప్రత్యేకంగా ఔషధాలతో తయారు చేయబడిన తక్రము లేదామజ్జిగధారతో మచ్చలుగల శరీర భాగాలను శుభ్రంగా తడపటం జరుగుతుంది. దీనివలన శరీరం పైభాగంలోని పొలుసులన్నీ ఊడిపోతాయి.

**నివారణ:** మానసికవత్తిడి నుండి పూర్తిగా విముక్తి వలన, పులుపు పదార్థాలు, మాంసాహార సేవన, సముద్రఉత్పత్తులు పూర్తిగా నిషేదించటంవలన, వాయుకాలుష్యం, జల కాలుష్యం నుంచి దూరంగా ఉండటం, పరిశ్రమలలో సరైనరక్షణ విధానాలు పాటించటం వలన నివారించవచ్చు.

**డా. లక్ష్మీ** M. D (Ayurveda)
**స్టార్ ఆయుర్వేద**

ADVT

90300 85456 తెలంగాణ । ఆంధ్రప్రదేశ్ । కర్నాటక www.starayurveda.com



# జీవితమే ఒక ప్రతిఘటన

(కోట శ్రీనివాసరావు కథాకథనం) 15

**ఒకరోజు రావుగోపాలరావుగారు నా రూమ్ తలుపుతట్టారు. చాలాసేపు ఇద్దరం మాట్లాడుకున్నాం. నీలో నాగభూషణం, రావుగోపాలరావు ఇద్దరూ కనిపిస్తారని అన్నారు ఆయన. 'సర్లేవయ్యా. ఫ్రెష్ అయి రెస్ట్ తీసుకో. రేపు ఉదయం కలుద్దాం' అని తన రూమ్‌కి వెళ్ళిపోయారు.**

ఆ తర్వాత కూడా రెండుమూడు సార్లు నేను డైలాగు చెప్పినప్పుడు రావుగోపాలరావు గారు మెచ్చుకున్నారు. కాకపోతే ఓ మోస్తరు పరిచయం కలిగే సమయానికే గోపాలరావుగారు రాజకీయాల్లో బిజీ అయ్యారు. ఆయన్ని కలవడానికి ఎవరో ఒకరు వస్తూ ఉండేవారు. షాట్ చేయడం, వాళ్లతో మాట్లాడటం, కార్యాచరణ రూపకల్పన చేయడంలో ఆయన బిజీగా ఉండేవారు. మరికొన్నాళ్లకి ఆరోగ్యం కూడా క్షీణించసాగింది. షాట్ ఉన్నప్పుడు వచ్చి డైలాగ్ చెప్పేవారు. ఆ తర్వాత వెళ్లి సోఫాలో కూర్చునేవారు. ఆ సమయంలో వాళ్ల కుటుంబసభ్యులు ఆయనతో పాటే ఎక్కువ సమయం గడిపేవారు. ఏదేమైనా విలక్షణ నటుడితో పనిచేసే అవకాశాలు అలా నాకు పలుమార్లు వచ్చాయి.

### ఈవీవీతో గట్టి బంధం

ఇప్పటికీ నన్ను 'కోటయ్యా' అని ఎవరైనా పిలిస్తే వెంటనే ఈవీవీ సత్యనారాయణ గుర్తొస్తాడు. నా తొలి సినిమాకు ఆయనే కో-డైరెక్టర్. అంతకుముందునుంచే మాకు పరిచయం. ఆయనలో ఉన్న గొప్పగుణం ఏంటంటే, ఎవరిలోనైనా ఏమాత్రం టాలెంట్ ఉన్నా సరే ఏదో విధంగా దాన్ని బైటికి లాగేస్తాడు. వాళ్లకునప్పే పాత్ర సృష్టించి లైఫ్ ఇస్తాడు. మన ఎం.ఎస్.నారాయణ అలా వచ్చినోడే కదా. 'మా నాన్నకు పెళ్ళి'లో ఎం.ఎస్.నారాయణ వేసిన తాగుబోతు వేషాన్ని ముందు నాతో వేయిద్దామనుకున్నాడు ఈవీవీ.

'కోటయ్యకైతే ఈ పాత్ర కాస్త వెరైటీగా ఉంటుంది. తాగుబోతుగా అతన్ని అందరూ అంగీకరిస్తారు. మన సినిమాలో ఈ వేషానికి కోటయ్య ఫిక్స్' అని అసిస్టెంట్లతో కూడా చెప్పేశాడట. కానీ రాత్రికి రాత్రే అందులో మార్పులు జరిగాయి.

## పని రాక్షసుడు ఈవీవీ

అందులో నేను వేసిన వేషాన్ని అక్కినేని నాగేశ్వరరావుగారితో వేయిద్దామని అనుకున్నారు. ఆ మేరకు నాగేశ్వరరావుగారితో మాట్లాడారు కూడా. కానీ ఎందుకో ఆ తర్వాత అది కార్యాచరణకు రాలేదు. కారణాలు నాకు తెలియవనుకోండి.

### కృష్ణంరాజుకు తండ్రి వేషం

ఒకరోజు ఈవీవీ ఫోన్ చేసి 'కోటయ్యా ఇప్పుడు డేట్లు ఎవరు చూస్తున్నారయ్యా' అని అడిగాడు.

'నేనే చూసుకుంటున్నా' అన్నా.

'నీ మొహం నువ్వేం చూసుకుంటావయ్యా ఇంత బిజీగా ఉండి. అయితే అయింది ఒకసారి నువ్వు నోట్ చేసుకున్న డైరీ పట్రా' అని పిలిచాడు. అప్పుడు నా దగ్గరే ఉండేది డైరీ. ఫిల్మ్ నగర్‌లో మా పక్కింట్లోనే ఉండేవాడు ఈవీవీ. షూటింగ్ నుంచి వస్తూ వస్తూ ఇంటికి కూడా రాకుండా, నేరుగా వాళ్లింటికి వెళ్లా.

'ఏంటి డేట్లిచ్చాను కదా? ఇంకేంటి?' అన్నా.

'అదిగాదయ్యా చిన్న చేంజ్. కృష్ణంరాజుగారికి ఫాదర్‌గా నీతో వేషం వేయిస్తున్నాను' అన్నాడు.

కృష్ణంరాజుగారి ఫాదర్ వేషం అనగానే నాకు అనుమానం వచ్చింది.

'ఊరికే జోక్ చేయమాకయ్యా' అన్నా.

'కాదయ్యా. నిజమే. మేం పెద్దాయన నాగేశ్వరరావుగారిని అనుకున్నాం. ఏవో కొన్ని కారణాల వల్ల అక్కినేనిగారు చేయడం కష్టమవుతోంది. అందువల్ల నీతో చేయించుకుంటానని నేను అందరికీ చెప్పేశాను. నీకెందుకు? నేను చేయించుకుంటాను నీతో' అన్నాడు. అంతటితో ఆగకుండా నా చేతిలో డైరీ లాక్కుని రెండు పేజీలుచించి వాటిలో అప్పుడో రెండు రోజులు, అప్పుడో రెండు రోజులు అంటూ 15-20 రోజుల దాకా డేట్లు రాశాడు.

'ఇదిగో ఈ డేట్లు చూసుకో. ఈ డేట్లు ఎవరెవరికి ఇచ్చావో నాకు రాసివ్వు. వాళ్లతో మాట్లాడి నేను తీసుకుంటా. అడ్జస్ట్‌మెంట్ చేసుకుందాం' అన్నాడు. ఇంక చేసేదేముంది, సరేనన్నా. ఫాదర్‌గా నేను ఫిక్స్.. మరి నేను చేయాల్సిన తాగుబోతు పాత్రకు ఎవర్ని తీసుకుంటారు? అనే ఆసక్తి నాక్కూడా మొదలైంది. రెండు రోజులకు ఆ విషయం కూడా క్లియర్ అయింది. అప్పటికి ఎం.ఎస్.నారాయణ రవిరాజా పినిశెట్టి తీసిన 'యమ్‌ధర్మరాజు ఎం.ఎ'లో ఓ పాత్ర చేశాడు. ఆ సినిమా చూసిన వాళ్లెవరో ఈవీవీకి ఆ విషయం చేరవేశారు. వెంటనే అతన్ని పిలిపించి ఫైనలైజ్ చేసేశారు.

ఆ సినిమాతో ఎం.ఎస్.నారాయణగారు ఓవర్ నైట్ స్టార్ అయ్యారు.

### సీన్ రివర్స్

ఏమాత్రం నా ప్రమేయం లేకుండా అక్కినేనిగారి పాత్రకు నేను షిఫ్ట్ అయ్యా. అయితే 'ఆ





ఒక్కటీ అడక్కు'లో మాత్రం నేను చేయాలనుకున్నపాత్ర చేయలేకపోయాను. ఆ వేషాన్ని ఎలాగైనా నాతోనే వేయించాలని ఈవీవీ కూడా చాలా ప్రయత్నించాడు. కానీ కాల్షీట్ కుదరలేదు. అప్పుడైతే ఒక వారం రోజులు హెక్టిక్ వర్క్‌తో మామూలుగా ఇబ్బందిపడలేదు. ఆ విషయాన్ని ఆయన కూడా దగ్గరుండి చూశాడు. 'ఆ ఒక్కటీ అడక్కు' షూటింగ్ వైజాగ్‌లో చేయడంతో అసలు రాలేనని వాళ్లకు అర్థమైపోయింది. అదే హైదరాబాద్ లోకల్లో అయితే కనీసం హాఫ్‌డేలు హాఫ్‌డేలు అయినా అడ్జస్ట్ చేసేవాళ్లం. ఔట్‌డోర్ కాబట్టి ఛాన్సే లేకుండాపోయింది. అప్పుడు నాతో అనుకున్న వేషాన్ని మహానుభావుడు రావుగోపాలరావుగారితో వేయించారు. ఆయనకి అలాంటి వేషాలు వెన్నతోపెట్టిన విద్య కదా. సజావుగా చేసేశారంతే.

### శ్రమజీవి ఈవీవీ

ఈవీవీ దగ్గర నాకు చాలా ఇష్టమైన మరో విషయం ఏంటంటే ఆయన చాలా శ్రమజీవి. రోజూ రాత్రి రెండు, రెండున్నర వరకు రాసేవాడు. రాయడమే కాదు ప్రతి సినిమాకీ ఇద్దరు, నలుగురు రైటర్లని పెట్టేవాడు. ఆయనా ఓ వైపు రాస్తూనే ఉండేవాడు. హెవీ డిస్కషన్స్ జరిగేవి.

నలుగురు రాసిన వాటినీ చూడటం, వాటిలో ఏది బావుంటే అది తీసుకోవడం... ఇలా ఫైనల్ చేసిన పేపర్‌ని ఉదయాన్నే స్పాట్‌లో తెచ్చిచ్చేయడం... ఇదీ వరస. ఆయన గురించి మోటుగా ఒక్క మాటలో చెప్పాలంటే గొడ్డులాగా కష్టపడతాడు. పనిరాక్షసుడు. పొద్దున్నే ఏడింటికి ఫైల్ చేతిలో పట్టుకుని యాక్షన్ అన్నాడంటే రాత్రి రెండింటికి షూటింగ్ ప్యాకప్ చెప్పిన సందర్భాలు కూడా కోకొల్లలు. అయినా ఆ ఎనర్జీలో ఏమాత్రం తేడా ఉండేది కాదు. మరలా ఉదయం ఏడింటికి మా అందరికన్నా ముందే స్పాట్‌లో ఉండేవాడు. '420' సినిమా చేస్తున్నప్పుడైతే ఉదయం ఏడుకి మొదలుపెడితే మర్నాడు పొద్దున తొమ్మిదిదాకా షూటింగ్ చేస్తూనే ఉన్నాం. ఆ సినిమాలో తెల్లవార్లూ డ్యాన్సులు చేయిస్తారు నాతో. ఎదురుగా జనాలు కూడా ఉండరు. ఒకే ఒక్క ప్రేక్షకుడు మాత్రమే ఉంటాడు. నేను డ్యాన్సు చేయడం పూర్తయ్యాక అతన్ని చూసి 'నువ్వు మాత్రం ఎందుకున్నావయ్యా' అని అడుగుతాను.

'నేను ప్రేక్షకుడిని కాదండీ బాబూ. మైక్‌సెట్, షామియానా తీసుకెళ్లేవాణ్ణి' అంటాడు.

అలాంటి గొప్ప గొప్ప జోకులు రాసేవాడు ఈవీవీ. నాతో ఆయన చేయించిన వేషాలు తెలుగు సినిమా హాస్యం ఉన్నంతవరకూ అలా నిలిచిపోతాయి.

### నాకు పేరు తెచ్చిన దర్శకుడు

'హలో బ్రదర్, 'చెవిలో పువ్వు'. 'ఆమె', 'మా నాన్నకు పెళ్ళి', 'ఇంట్లో ఇల్లాలు వంటింట్లో ప్రియురాలు' ఇలా పదీ, పదకొండు సినిమాలున్నాయి. నాలో ఉన్న జీల్‌ని బైటకుతెచ్చిన వ్యక్తి ఈవీవీ. కోట శ్రీనివాసరావు అనే యాక్టర్ ఈ తరంలో వచ్చాడ్రా అనే పేరు నాకు తెచ్చాడు.



ఆయన రుణం ఎలా తీర్చుకుంటానో నాకు తెలియదు. ఆయన కాలం చేయడంవల్ల నిజంగా తెలుగు పరిశ్రమ గ్రేట్ డైరెక్టర్‌ని మిస్ అయింది.

ఈవీవీ ఆఖరి సినిమా 'కత్తికాంతారావు' లోనూ నేను చేశాను. అప్పుడు నిజంగా చాలా ఇబ్బందిలో ఉన్నా.

అబ్బాయి పోవడం...అప్పటికి మా అబ్బాయి పోయి 20-25 రోజులు అయింది.

'కోటయ్యా, ఏమీ అనుకోకు. ఇలా నేను నీ కోసమే ఓ పాత్ర రాసుకున్నానయ్యా. ఆ వేషంలో నిన్ను తప్ప ఇంకెవరినీ ఊహించుకోలేకపోతున్నాను. అబ్బాయి పోయాడు. నాకు తెలుసు. ఇలా ఉంటే నువ్వు కోలుకోలేవు. కాస్త బైటకి రా. నీకూ కాస్త చేంజ్ ఉంటుంది. నేన్నిన్ను చాలా బాగా చూసుకుంటానయ్యా' అని నచ్చజెప్పి తీసుకెళ్లాడు. ఆయన సినిమా అంటే చుట్టూ అంతా తెలిసినవాళ్లేగా... నిజంగానే అప్పుడు వాళ్లందరూ కూడా నన్ను చాలా బాగా చూసుకున్నారు.

**దర్శకుడు ఈవీవీ, కోట శ్రీనివాసరావు మధ్య గట్టి అనుబంధం ఉంది. వారిద్దరూ కలిసి ఎన్నో చిత్రాలు చేశారు. కోట లోని జీల్‌ను బైటకు తీసిన దర్శకుడు ఈవీవీ. ఎవరిలోనైనా ఏ కొంచెం టాలెంటున్నా బైటకులాగి వారికి లిఫ్ట్ ఇస్తాడు. ఎమ్మెస్ నారాయణను కూడా అలాగే రాత్రికి రాత్రే స్టార్‌ని చేసిన దర్శకుడు ఈవీవీ అని ప్రశంసిస్తారు కోట శ్రీనివాసరావు. మరి ఇంతకీ ఎమ్మెస్‌కు ఆ అవకాశం ఎలా వచ్చింది?**

### ఈవీవీది ఒక ఎరా

జంధ్యాలగారి రచన ఎంతగొప్పగా ఉంటుందో అంతగొప్పగా ఉంటుంది ఈవీవీ థాట్ ప్రాసెస్. జంధ్యాల బాణీని ఈవీవీ చాలా బాగా పట్టుకున్నారు. దాన్ని ఆయన తనకు తగ్గట్టుగా మలుచుకుని, మరికాస్త జనరంజకం చేసుకోగలిగారు. ఈవీవీది ఒక ఎరా. అలాంటివారి దగ్గర నటించడం నా అదృష్టం. ఆయనకు ఎవరిమీదైనా కోపం వచ్చినప్పుడు 'కోటయ్యను చూడండ్రా గొడ్డులా పనిచేస్తాడు. పొద్దున్నే ఏడింటికి వచ్చినా, రాత్రి రెండింటిదాకైనా అలాగే ఉంటాడు. అలుపూ సొలుపూ అనడు. నేర్చుకోండి. పనిచేయండి' అని కేకలేసేవాడు. 'ఆరు తర్వాత కూడా షూటింగ్ ఏంటయ్యా' అని అనేవారుంటారుగా... వాళ్లను చూసి!

'ఆర్టిస్టుకి టైమ్ వస్తే టైమ్ ఉండదు. కానీ ఆ టైమ్ అందరికీ రాదు. రెండు షిఫ్టులు, మూడు షిఫ్టులు ఎవరు చేస్తారు? అని విసుగు చెందకండి' అని నేను కూడా తోటివారితో చెప్పేవాణ్ణి. నేను అనుభవంతో అన్న మాటలవి.

### కుర్రకారుకి సాధన తక్కువ-వాదన ఎక్కువ

కొన్నిసార్లు ఇంట్లో ఉన్నప్పుడు నాక్కూడా చాలా అనిపిస్తూ ఉంటుంది. కొత్త కొత్త ఐడియాలు వస్తుంటాయి. ఏవో ఆలోచిస్తూ ఉంటా. ఫలానా తరహా పాత్రలు చేస్తే బావుంటుంది అని కోరిక కలుగుతుంది. కానీ నిజంగా నాకు ఆ పాత్రలు వచ్చినా చేయగలనా? ఆయా వేషాలకు తగ్గ వయసు ఉంటుంది. ఆ వయసులోనే వాటిని చేసేయాలి. మలి వయసులో చేయలేం.

నిజంగానే ఐడియా గొప్పగా ఉంది.. ఎందుకు వేస్ట్ చేయడం అని ఆలోచించి ఎవరికైనా

'నాయనా ఇదిగో ఈ వేషం అనుకున్నా. ఎవరికైనా బావుంటుందేమో చూడండయ్యా' అని డైరెక్టర్లతో చెప్తామనుకోండి. వినరు.

'ఆ వీళ్లకేం పనీపాటా లేదు. ఏం చెయ్యాలో అర్థంకాక ఇలాంటి మాటలు మాట్లాడుతూ కూర్చుంటారు. పాత చింతకాయ పచ్చడి' అని పెడచెవిన పెడతారు.

'ఏదో పెద్దాయన చెబుతున్నాడే, వింటే బావుంటుందేమో' అనే ఆలోచన ఎవరికీ లేదు. నా దృష్టిలో ఇప్పుడున్న కుర్రకారుకు సాధన తక్కువ. వాదన ఎక్కువ. సాక్షాత్తు సిటీ పోలీసు కమిషనరే వచ్చి 'నాయనా ఎడమవైపు నడవండ్రా' అన్నారనుకోండి. ఏదో బాధ్యతగల అధికారి చెబుతున్నాడని ఎవరూ అనుకోరు. 'ఏం కుడివైపు నడిస్తే ఏమవుతుంది' అని ఎవడో మొదలుపెడతాడు. వాడి చుట్టూ కొంతమంది చేరుకుంటారు. అలాంటివారికి చెప్పి ఏం ప్రయోజనం?

**(ఇంకా ఉంది)**


**- డా.చల్లా భాగ్యలక్ష్మి**

**సెల్: 88850 55528**

# కోనేరుగట్టు

-జయంతి ప్రకాశశర్మ

**“అబ్బబ్బా! ఈ కాకులొకటి చంపుకుతింటున్నాయి. ఒక్క నిమిషంకూడా పని చేసుకో నివ్వటంలేదు. మీకేం! ఉదయాన్నే పేపరు పట్టుకుని కూర్చుంటారు. ఒక్క నిమిషం కాఫీ ఆలస్యమైతే గయ్యిమని లేస్తారు. అంతేకాని అయ్యో! పెళ్లాం వంటింట్లో ఏం ఇబ్బంది పడుతోందో అనే ఆలోచన బుర్రలోకి చస్తేరాదు” ప్రతీరోజూ ఉదయాన్నే వంటింట్లోంచి భార్య వసంతమ్మ మాటలు సుందరయ్యకి అలవాటే.**

పేపరు చదువుతున్నాసరే ఓ చెవి ఆమె మాటల మీద పడేస్తాడు. ఎందుకంటే అక్కడనుండి వంటింటి సమస్యలు మొదలు ప్రపంచీకరణ, సాంకేతిక అభివృద్ధి, మనిషి ఆలోచనలో మార్పులు, రాజకీయాల వరకు ఒకటేమిటి సవాలక్ష విషయాల మీద విమర్శలు, విశ్లేషణలు వస్తుంటాయి. వాటిలో కొంత అవసరమైన పరిజ్ఞానం కూడా ఉంటుంది. దాన్ని మెదడులో పదిలపరుచుకోవటం సుందరయ్య అలవాటు చేసుకున్నాడు. ఆ విషయాలన్ని అప్పుడప్పుడు ఆఫీసులో తాను ఉపన్యాసాలు ఇస్తున్నప్పుడు వాడుకుంటూ ఉంటాడు.

“సొంతిల్లు అన్నానని... ఇదిగో ఈ అపార్ట్‌మెంట్ కొని పారేసి నా సరదా తీర్చేశారు. ఈ కొంప ఆకాశానికి జానెడు దూరంలో ఉంది. డాబా మీదకెళ్లి చెయ్యి పైకెత్తితే కైలాసం అందుతుంది. ఏమైనా అంటే మన తాహతుకు ఇంత కంటే రాదు అంటూ నా నోరు నొక్కేస్తారు. ఈ కొంపలకి ఓ ఇరుగూ పొరుగూ, మాటామంతీ ఒక్కటీ ఉండవు. నాలుగు కుటుంబాలు కలిసిమెలిసి ఉండే జాగాలో నలభై కుటుంబాల్ని కుక్కేస్తున్నారు. అయినా ఏంలాభం! ఎవరికి వారే యమునా తీరే కదా! పక్కింట్లో ఎవరుంటారో మనకి తెలియదు. మనం ఎవరిమో పక్కింటివాళ్లకి తెలియదు. ఏమిటో మనుషులు అందరు భౌతికంగా దగ్గరై, సంబంధాలు దూరం చేసుకుంటున్నారు. రోజంతా తలుపేసుకుని చావాల్సిందే. ఎవరికివారు గోరీలు కట్టుకుని బతుకుతున్నారు” అంటూ అపార్ట్‌మెంట్ జీవితాల్ని ఉతికి ఆరేస్తుంది.

ఎప్పుడైనా గ్రైండర్ పని చేయకుండా మొరాయించిందంటే ఇక ఆ వేళ మనుషుల్ని దులిపిపారేస్తుంది.

“తన మేధస్సు ఉపయోగించి మనిషి తనని తాను బద్ధకస్థుణ్ణి చేసుకున్నాడు. వంటనుంచి మొదలెట్టి మొత్తం జీవితాన్ని తాకట్టుపెట్టి ప్రతి పనికీ మిషన్లు కనిపెట్టేశాడు మనిషి. కష్టపడే ఆలోచనలకు ఫుల్‌స్టాప్‌పెట్టి అవసరానికి మించి సుఖపడటం నేర్చుకున్నాడు. మిషన్, కంప్యూటర్ కనిపెట్టి, వాటిని తయారుచేసి, చివరికి వాటి చెప్పు చేతల్లో ఇరుక్కుపోయాడు మనిషి. ఆసలు ఆ మిషన్లని, కంప్యూటర్లని తానే కనిపెట్టేశానని మర్చిపోయి, రిమోట్‌కంట్రోల్ ఎలా నడవమంటే అలా నడుస్తూ, సొంతనడక, నడవడిక మర్చిపోయాడు. మరి రోగాలు రొచ్చులు రాక చస్తాయా?”

ఆ ఉపన్యాసాలు ఎలా ఉన్నాసరే రోజూ ఆ టైముకి కాఫీ వచ్చేది. ఎందుకో ఆ రోజు సుందరయ్య పేపరు చూస్తూ కూర్చున్నాడేగానీ ఇంకా కాఫీమాత్రం రాలేదు. ఎప్పుడూ లేనిది ఆరోజు వంటిల్లు చాలా సీరియస్‌గా ఉంది. ఆడపాదడపా గిన్నెల చప్పుళ్లు వినబడుతున్నాయి. ఇప్పుడే తన పరిస్థితి ఇలావుంటే రిటైర్మెంటు తర్వాత ఎలా ఉంటుందో అనే ఆలోచన రావటంతో అదేదో అడుగుదామని వంటింట్లోకి వెళ్లాడు.

“ఇదిగో ఇవాళ పేపరుకూడా చదవడం పూర్తైపోయింది. కాఫీరాలేదు. నా రిటైర్మెంటు ఇంకా వారం రోజులుంది. తెల్సా?” భార్యతో చమత్కారంగా అన్నాడు.

“మీ భాష అర్థమైందిలెండి. అయినా కట్టుకున్నానుగా! జీవితాంతం తప్పదు. మీకు రిటైర్మెంట్లు ఉంటాయేమో గాని మాకు ఉండవు. మాక్కూడా ఈ వంటింటి ఉద్యోగానికి రిటైర్మెంటు వయస్సు నిర్ణయించి, పార్లమెంటులో బిల్లు చట్టం చేసినా



సరే, దాన్ని అమలు చేయటం వాళ్ల బాబుతరం కూడా కాదు. అంచేత మీకేం బెంగ అక్కర్లేదు లేండి. మీ మగాళ్లకి వంటింట్లో కష్టాలు చస్తే అర్థం కావు. కనీసం అర్థం చేసుకోడానికి ప్రయత్నం కూడా చెయ్యరు. అయ్యో! కాకులు, గద్దలు వంటింట్లో వీరవిహంగం చేస్తున్నాయి, అక్కడ కిటికీకి ఓ జాలీ పెట్టించమని ఐదేళ్ల నుంచి పోరుతున్నాను. మీరు విన్నారా? ఆ రెండుకాకుల్ని చూడండి. ఎలా చూస్తున్నాయో! నేనో క్షణం లేకపోతే లోపలికి జొరబడి ఏదో ఒకటి ఎత్తుకు పోవడానికి రెడీగా ఉన్నాయి. అందుకే కాఫీ మీకు రాలేదు. మీరు ఆఫీసులో వర్క్ టూ రూల్ చేస్తారుగా... ఇది ఓ రకంగా అదే అనుకోండి. అయినా మళ్లీ తొమ్మిది కొట్టేసరికి మీరు భోజనానికి తయారైపోతారు. అంతేకాని రిటైర్మెంటు అంటూ వ్యంగ్యభాషణం అక్కర్లేదు" గ్యాస్‌స్టవ్ మీద కాఫీ గిన్నె తీసి గ్లాసులో పోసి భర్తకి ఇస్తూ అంది వసంతమ్మ.

"నీకు తెల్సో లేదో.. ఆ కాకులరూపంలో మన పితృదేవతలు అంటే మావాళ్లే కాదు, మీ వాళ్ళు కూడా వస్తారుట. ఆ కాకులుతినే ఆ నాలుగు మెతుకులే వాళ్లకి ఆహారం. వాటినేం తిట్టకు... తిడితే నేరుగా వాళ్లని తిట్టినట్టే" సుందరయ్య నవ్వుతూ అన్నాడు.

"ఆc! ఆ పుక్కిటి పురాణాలు నాకూ తెలుసు. కాని మన పితృదేవతలు ఎంత అల్లరి చేస్తారో ఓ పావుగంట ఇక్కడ నిలబడితే తెలుస్తుంది. అప్పుడు మీరే అంటారు, ఇవి కాకులు కావు రాబందులని".

మొత్తానికి ఆ దెప్పుడంతా వంటింటి కిటికికీ జాలి వేయించలేదనే. ఆ విషయం అర్థమైంది సుందరయ్యకి.

"సరే చూద్దాంలే. రిటైరవుతున్నానుగా. వేయిస్తాలే" అంటూ కాఫీగ్లాసు పట్టుకుని వచ్చేశాడు.

"ఆ పాటి పావలాఖర్చుకి రిటైర్మెంటు డబ్బుల గురించి ఎదురుచూసేంత దరిద్రంలో లేరుకదా. మీ బ్యాంకు వాళ్ల డబ్బులమీద కూర్చుంటారని మా నాన్న మీ సంబంధం చేశారు. ఇప్పుడు ఐదొందలఖర్చుకి ఐదు సంవత్సరాలుగా ఎదురుచూస్తూనే ఉన్నాను. ఉత్తిపుణ్యానికి లక్షలు లక్షలు తగలేస్తారు గానీ, ఇక్కడకొచ్చేసరికి లక్ష ఆలోచనలు, ప్రశ్నలు వచ్చేస్తాయి. అదేదో నాగురించి ఖర్చుపెట్టాలనుకుని వాయిదా వేసేస్తారు. అయినా మీ రిటైర్మెంటు డబ్బులకేం రెక్కలొస్తాయో ఎవరు చెప్పొచ్చారు' వసంతమ్మ మాటలకి మళ్లీ వంటింట్లోకి వచ్చాడు సుందరయ్య.

భార్య మాటల్లో ముందుచూపు ఉంటుందనే అభిప్రాయం సుందరయ్యకి ఉంది. కాఫీ తాగుతూ ఏమిటి సంగతి అన్నట్టు చూశాడు.

"మీ రిటైర్మెంట్ ఫంక్షన్‌కి రమ్మని ఫోన్‌చేసి చెప్పారుగా. అమ్మాయి-అల్లుడు, అబ్బాయి-కోడలు వస్తున్నామని ఫోన్ చేశారు".

"వస్తారు! ఏమవుతుంది?"

"అప్పటికి మీరు అమాయకులు. ఏం తెలియదు అని నలుగురూ అనుకోవాలనా? మీ నటన చాలుగానీ, ఆ విషయాలు నా నోటివెంటే చెప్పిస్తారా ఏమిటి? వారం రోజులు ఓపిక పట్టండి. మీకే తెలుస్తుంది" వసంతమ్మ ఆ సంభాషణ అక్కడితో ఆపి వంటపనిమీద దృష్టి సారించింది.

●●●

సుందరయ్యకి బ్యాంకులో ఉద్యోగం తప్పితే వెనక ఆస్తిపాస్తులు లేవు. వాళ్లకి ఓ అమ్మాయి, అబ్బాయి. ఇద్దరికీ పెళ్లిళ్లు చేశారు. ఒకరు బొంబాయిలో, మరొకరు బెంగళూరులో ఉంటున్నారు. ఉద్యోగంలో నిక్కచ్చిగా ఉండే సుందరయ్య బ్యాంకు లోన్లతో పిల్లలిద్దరికీ చదువులు చెప్పించి పెళ్లిళ్లుకూడా కట్నాల్లేకుండానే చేశాడు. ఇవన్నీ జరిగే వరకు సొంతింటి గురించి సుందరయ్య ఆలోచించ లేదు. ఈ మధ్యే ఆ ఊరు జిల్లా కేంద్రంగా ఎదిగింది. అయినాసరే ఓ పెద్ద పల్లెటూరులా ఉంటుంది. ఊరు మధ్యలో ఓ కోనేరు, చతురస్రాకారంలో ఉండే ఆ కోనేరుకి నాలుగువైపులా గట్లు. ఆ గట్లను ఆనుకుని విశాలంగా రోడ్లు ఉన్నాయి. తూర్పుగట్టు మీద ఆంజనేయస్వామి కోవెల, ఉత్తర గట్టుమీద వేంకటేశ్వరస్వామి ఆలయం ఉన్నాయి. ఎప్పుడూ సందడిగా ఉండే కోనేరు గట్లంటే సుందరయ్యకి, వసంతమ్మకి చాలా ఇష్టం. సుందరయ్య పుట్టినప్పటి నుంచి ఆ గట్ల మీదుండే అద్దె ఇళ్లల్లోనే ఉండేవాడు. అంచేతే ఆ గట్టు మీద ఓ ఇల్లు కొను



**సుందరయ్య రిటైరయ్యాడు. ఘనంగా వీడ్కోలు సభ జరిగింది. కొడుకు కోడలు, కూతురు. అల్లుడు వచ్చారు. రిటైర్మెంట్ డబ్బులకోసం వాళ్లుపేచీ పెడతారనీ, ముందుగానే జాగ్రత్తపడమనీ సుంద రయ్యను భార్య హెచ్చరించింది. అతడు రాత్రంతా ఆలోచించి పిల్లల్ని పిలిచి తన నిర్ణయం చెప్పాడు. అప్పుడు పిల్లలు ఏమ న్నారు? సుందరయ్య మాటలకు వాళ్లు షాక్ తిన్నారా? లేక సుందరయ్యే షాక్ తిన్నాడా?**

క్కోవాలనే కోరిక ఉండేది. కాని తనకి బ్యాంకులో వచ్చే లోనుతో స్థలం కొని, ఇల్లు కట్టుకోవడం ఆ గట్టుమీద కాదు కదా ఆ ఊర్లో కూడా ఇప్పుడు కుద రనిపని. ధరలు అంతలా పెరిగిపోయాయి. ఇక గత్యంతరం లేక కనీసం రిటైరయ్యే సమయానికి ఇల్లు ఉండాలనే ఆలోచనతో ఊరు శివారులో అపార్ట్‌మెంట్ తీసుకుని, ఏభై సంవత్సరాల కోనేరు గట్టు వదిలి కొత్తింటిలోకి మారిపోయాడు. పిల్లల చదువులు, పెళ్లిళ్లు అయిపోయాయి. వాళ్లు వెళ్లిపోయినాసరే, ఆ కోనేరుగట్టుమీద ఒంటరి తనం అనిపించలేదు. కానీ ఈ అపార్ట్ మెంట్‌లో ఆ లోటు కొట్టొచ్చినట్టు కనబడుతోంది. వసంతమ్మకి మాట్లాడేవాళ్లు లేకపోవడంతో పుస్తకాలు చదువు కోవటం, టీవీ చూడ్డం అలవాటు చేసుకుంది.

సుందరయ్య బ్యాంకులో ఉన్నంతవరకు ఇంటి విషయాలు ఆలోచించాడు. ఆఫీసు విషయాల్లో పూర్తిగా పట్టున్నవాడు. ఆఫీసులో అందరూ ఆయన సలహాలు తీసుకునే వాళ్లు. కానీ రాను రానూ పాతవాళ్లు రిటైరై, కొత్తవాళ్లు రావడంతో వాళ్ల ప్రవర్తన వేరేగా ఉండేది. ఉద్యోగాన్ని చాలా చులకనగా చూడటమే కాకుండా పనిమీద చిత్త శుద్ధి ఉండేది కాదు. ఏ విషయంలో కూడా వాళ్లలో తృప్తి కనబడేది కాదు. అక్కడికీ స్టాఫ్‌మీటింగ్స్‌లో చెబుతూనే ఉండేవాడు. "ఉద్యోగం దైవంతో సమానం. మనకి హాయిగా ఆనందంగా జీవించ డానికి దోహదపడుతుంది. మనకి సమాజంలో గుర్తింపు, గౌరవం ఇచ్చింది. మన హక్కుల్ని సాధిం చడానికిముందు మనం మన విధులు పూర్తిగా నిర్వర్తించాలి. అలాకాకుండా, బాధ్యతలు వద్దు హక్కులు కావాలంటే అది అరాచకానికి దారి తీస్తుంది" అంటూ తన జీవిత అనుభవాలు చెప్పేవాడు. అయినాసరే కుర్రాళ్లు ఏదో ముస లాడు, చాదస్తం' అంటూ లెక్కచేసేవారు కాదు. 'రోజులు మారాయి. అంచేత మన అనుభవాలు వాళ్లకి పనికిరావు కామ్రేడ్" అంటూ యూని యన్ నాయకులు సుందరయ్యతో అంటూ ఉండే వారు. "ఇదేనేమో జనరేషన్ గ్యాప్ అంటే" అని సరిపెట్టుకోకుండా సుందరయ్య తన ప్రయ త్నాలు తాను చేస్తుండేవాడు.

సాయంత్రం ఆఫీసుపని పూర్తికాగానే ఇంటికి బయలుదేరిన సుందరయ్యకి ఉదయం భార్యతో జరిగిన సంభాషణ గుర్తొచ్చింది. "నిజమే.. తన పిల్లలు కూడా ఈ తరం వాళ్లే కదా! సమాజంలో వచ్చిన మార్పులను చూస్తున్నాం. పిల్లల ఆలోచనలు, ప్రవర్తనలు చూస్తున్నాం. అంతకంటే ఏం తేడా ఉంటుంది? రిటైర్మెంట్ డబ్బులుగురించి బహుశా వాళ్లు తల్లిదగ్గర ఏవైనా అభిప్రాయాలు వ్యక్తపరి చారా' అనే అనుమానం కలిగింది. ఆ విషయమే రాత్రి భోజనం చేస్తూ ప్రస్తావించాడు.

'నా దగ్గర వాళ్లేం అనలేదు. కాని లోకం తీరు చూస్తున్నాంగా. డబ్బులువస్తే చాలు. కాకుల్లా వాలిపోతారు. మన వాళ్లుకూడా దానికి అతీతులు కారేమో అని నా అనుమానం" వసంతమ్మ సూటి గానే తన అనుమానం వ్యక్తం చేసింది.

"ఒకవేళ వాళ్లు అడిగినా, మనం డబ్బులు ఇవ్వడంలో తప్పేం లేదు. మనం దాచేది వాళ్లకోసమే కదా! అవి ఎలాగైనా మన తదనంతరం వాళ్లకి చెందవల్సిందే కదా" సుందరయ్య అన్నాడు.

"ఆc మీ ఆలోచనలు అలాగే ఉంటాయి. వచ్చిన డబ్బులన్నీ వాళ్లకే ఇచ్చేస్తే మనం ఏం తింటాం. మీ పింఛను డబ్బులు నెల ఖర్చులకు సరిపోతాయి గానీ, రోగమో, రొచ్చో వస్తే మనకెవడిస్తాడు. ఓ కార్యక్రమం వచ్చినా, ఇంకో ఖర్చు వచ్చినా వాళ్లని అడుక్కోవాలి. మనతర్వాత వాళ్లకి వెళ్లొచ్చుగానీ, ఆ డబ్బంతా ఇప్పుడే ఇచ్చేస్తే మనరోజులు గడ వటం కష్టం అన్నదే నా అభిప్రాయం" అంటూ వసంతమ్మ కుండబద్దలు కొట్టినట్టు చెప్పేసింది.

"అదిసరే మన పిల్లలు అలాంటివాళ్లా" సుంద రయ్యకి ఇంకా పిల్లలమీద నమ్మకం పోలేదు.

"నేనెప్పుడూ కీడెంచి మేలెంచమంటాను. ఇప్పటి పిల్లలు పూర్వకాలం పిల్లల్లా ఉంటే వీధికొక వృద్ధా శ్రమం ఎందుకు పుట్టుకొస్తుందీ? పిల్లలూ, కాకులూ ఒక్కలాగే ఉన్నారు. ఏమో నాకు అనిపించింది నేను చెప్పాను. తర్వాత మీ ఇష్టం" భార్య మాట లతో సుందరయ్య ఆలోచనలో పడ్డాడు.

"సరే ఏదైనా మనం ఆ పరిస్థితి ఎదురైన ప్పుడు ఆలోచించి ఓ నిర్ణయం తీసుకుందాం" అంటూ సుందరయ్య అప్పటికి ఆ సమస్యకి తెర దించేశాడు.

సుందరయ్య రిటైర్మెంటు ఇంకా రెండు రోజు ఉందనగానే పిల్లలిద్దరు వచ్చారు. ఇల్లంతా సంద డిగానే ఉంది. తల్లితండ్రులకు తెలియకుండా, వాళ్ల లోవాళ్లు ఏదేదో మాట్లాడుకుంటున్నారు. ఒక్కొక్క సారి మాటలు సీరియస్‌గానే వినబడుతున్నాయి. బహుశా ఏం అడగాలి? ఎలా అడగాలి? అన్నవిష యాల మీద తర్జనభర్జనలు పడుతున్న ట్లుంది. ఏది ఏమైనా విషయం జాగ్రత్తగా పరిష్కరిం చాలి. కర్ర విరక్కూడదు. పాము చావకూడదు. డబ్బు మూలంగా బంధాలు దెబ్బతినకూడదు.

రిటైర్మెంటురోజు ఆఫీసులో భారీగా ఏర్పాట్లు చేశారు. పెద్ద అధికారులు, యూనియన్ నాయ కులు సత్కారసభకి వచ్చి సుందరయ్య సేవలు కొనియాడారు. చివర్లో సుందరయ్య పిల్లలు మాట్లాడారు. సుందరయ్య సంతానంగా జన్మిం చటం తమ అదృష్టం అంటూ చాలా ఎమోషన ల్‌గా మాట్లాడారు. సుందరయ్య కృతజ్ఞతలు చెప్పుకుంటూ, తనకి ఇంత ఘనంగా సత్కారసభ జరగటం వ్యక్తిగతంగా ఇష్టం లేకపోయినా సరే, అందరికోసం ఒప్పుకోక తప్పలేదంటూ తన అను భవాలను ముచ్చటించాడు. కష్టపడి పనిచేసి సంస్థ అభివృద్ధికి పాటుపడాలనీ, సంస్థ బాగుం టేనే మనం బాగుంటామని హితవు పలికాడు. చివర్లో తనకి రావలసిన పి.ఎఫ్. గ్రాట్యుటీ, వగైరా అన్నింటికి సంబంధించిన చెక్కులు సుందరయ్య చేతికి అందించారు ఉన్నతాధికారులు. సభ ముగి సిన తర్వాత అక్కడే విందు ఏర్పాట్లు కూడా చేశారు. కార్యక్రమాలు పూర్తైన తర్వాత కార్లో ఇంటికి సాగనంపారు. రాత్రి ఇంటికిచేరిన తర్వాత పిల్లలు ఆఫీసులో జరిగిన సన్మానం గురించి మాట్లాడుకుంటున్నారు. కానీ సుందర య్యకి వెంటనే నిద్ర పట్టేసింది.

మర్నాడు బ్యాంకుకివెళ్లి తన అకౌంట్లన్నీ సెటిల్ చేసుకున్నాడు. మిగిలిన డబ్బు అకౌంటులో వేసుకుని, పిల్లల విషయం తేలిన తర్వాత ఏం చెయ్యాలో అప్పుడు ఆలోచించవచ్చుననుకుంటూ ఇంటికి తిరిగొచ్చేశాడు. అలాగే తానే పిల్లల్ని దగ్గ రకు పిలిచి ఉన్న విషయం వివరంగాచెప్పి ఓ నిర్ణయానికి రావటం మంచిదని భావించాడు.

సుందరయ్య కొడుకు, కూతురు కూడా తండ్రితో విషయం ఎలాచెప్పాలా అని ఆలోచిస్తున్నారు. అందరి పిల్లలాగా వాళ్లకీ తండ్రిదగ్గర భయం ఎక్కువే. ఒక్కొక్కసారి తండ్రి తీసుకునే నిర్ణయా లను మార్చడంకష్టం. కొన్ని సందర్భాలలో ఆయన గీసుకున్నగిరిని దాటివచ్చేవారు కాదు. ఆ



విషయంలో మాట్లాడడానికి కూడా అవకాశం ఇచ్చేవారు కాదు. తండ్రి సిద్ధాంతాలు చాలా ఉన్నతమైనవేకానీ ఈ రోజులలో వాటిని నిత్యజీవితంలో పాటించడం కష్టం. అందుకే పట్టువిడుపులు ఉండాలి. రోజులతోపాటు మనమూ మారాలి. అంతే కాని సమాజాన్ని మార్చటం మనవల్ల కాదు అనే విషయం తండ్రికిచెప్పి ఒప్పించేధైర్యం వాళ్లకి లేదు.

ఎవరు ఏమడుగుతారోననే టెన్షన్‌తోనే ఆ రోజు గడిచిపోయింది.

"వాళ్లు ఏమైనా నీతో అన్నారా?" అంటూ రాత్రి పడుకోబోయేముందు సుందరయ్య భార్యని అడిగాడు.

"అబ్బే... నన్నేం అడగలేదు. అడిగినా నేనేం మాట్లాడతాను? ఆ విషయం వాళ్లకీ తెలుసు." అంది వసంతమ్మ.

ఆ మర్నాడు సాయంత్రం పిల్లలు వెళ్లిపోయారు. ఈలోగా ఏదో ఒకటి తానేచెయ్యాలనుకున్నాడు. సుందరయ్యకు ఏదో ఆలోచన స్ఫురించింది. అంతలోనే నిద్ర పట్టేసింది. ఉదయమే ఇంట్లో అందరినీ పిలిచి సుందరయ్య చెప్పాడు.

"నేను, అమ్మ ప్రస్తుతానికి ఇక్కడే ఉంటాం. పుట్టి పెరిగిన ఊరు వదిలిరావటం కుదరదు. నాకు పెన్షన్ వస్తుంది. అది మాకు సరిపోతుంది. నా రిటైర్మెంటు డబ్బులతో అప్పులు తీర్చగా మిగిలినవి ఇదిగో ఇవి. మాకు ఏమైనా అవాంతరాలు వస్తే అవసరార్థం కొంచెం డబ్బులు ఉంచుకొని మిగతావి మీరిద్దరు తీసుకోండి. ఇవిగో బ్లాంక్ చెక్కులు. నేనివ్వగలిగింది ఇదే" అంటూ సుందరయ్య ఓ కాగితం మీద లెక్కలు రాసి వాళ్ల ముందు పెట్టాడు. వసంతమ్మకి భర్త ఆలోచన నచ్చింది. నిజమే, అంత్య నిష్ఠూరం కంటే ఆది నిష్ఠూరం మంచిది. అయితే ఆయన మాటలు మిగతావాళ్లకి ఆశ్చర్యం కలిగించలేదు. ఆయన ఏ విషయమైనా అంత సూటిగా చెప్పేస్తారు.

"వద్దు నాన్నా. మేం వచ్చింది మీ రిటైర్మెంటు సందర్భంగా మీతో నాలుగురోజులు సరదాగా గడపడానికి వచ్చామేగానీ ఆస్తులు పంచుకోడానికి కాదు. మాకు ఆర్థిక సమస్యలుగానీ, అవసరాలుగానీ లేవు. నిజంగా మాకు అవసరమైతే మీ దగ్గర తీసుకోడానికి మొహమాటం ఎందుకుంటుంది నాన్నాగారు! ఇలాంటి ఆలోచనలు పెట్టుకోకుండా హాయిగా ఉండండి" అంటూ అబ్బాయి చెక్కుల్ని తండ్రి చేతిలో పెట్టేశాడు. అంతే! ఒక్క నిమిషంలో వాతావరణం చల్లబడిపోయింది. అందరి ఊహలూ చివరకు ఊహలుగానే మిగిలిపోయాయి.

"అన్నట్టు నాన్నగారు మనందరం కలిసి ఓసారి మన కోనేరుగట్టుకి వెళ్లొద్దాం. మన పాత ఇల్లు, ఆ వీధి చూసి చాలా కాలమైంది" అన్న కొడుకు మాటలు వినేసరికి సుందరయ్యకి ఆనందం వేసింది.

"నిజమేరా! మేంకూడా ఆ గట్టుకివెళ్లి చాలా కాలమైంది" అంటూ అందరూ బయలుదేరారు.

"అబ్బా! మన వీధి చాలా మారిపోయింది".

"అవున్రా. వీధిలో అందరూ ఇళ్లు అపార్టుమెంట్టుకి ఇచ్చేశారు. ఒక్క మనం అద్దెకున్న ఇల్లే అలా ఉంది. అది కూడా ఆ ఇంటివాళ్లు అమ్మేస్తే ఎవరో కొనుక్కుని రీమోడల్ చేయించారట. మొక్కలు, చెట్లు పాడవకుండా అలాగే ఉన్నాయి. ఎవరో మంచివాళ్లే. ఇల్లు పాడుచేయకుండా, బాగు చేశారు. బావుంది" అని కబుర్లు చెప్పుకుంటూ కోనేరు నాలుగు గట్లూ తిరిగి, ఇంటికొచ్చేశారు. సాయంత్రం పిల్లలతో పాటు రైల్వేస్టేషన్‌కివచ్చి వాళ్లకి వీడ్కోలుచెప్పి ఇంటికి వచ్చేశారు సుందరయ్య, వసంతమ్మ. ఇంటికి వస్తూనే టేబులు మీద కవరుచూసి సుందరయ్య ఆశ్చర్యపోయాడు. నాన్నగారికి అన్న అక్షరాలు చూసి ఆత్రుతగా కవరు చింపి చదవసాగారు ఇద్దరూ.

నాన్నగారికి,

మీ దగ్గర మాట్లాడే ధైర్యంలేక ఈ ఉత్తరం రాస్తున్నాను. మరోలా భావించకండి. మీరు పడ్డ కష్టాలు మేం పడకూడదని, మమ్మల్ని చాలా అపురూపంగా పెంచారు. దానికి తోడు మారిన రోజులతో పాటు మేంకూడా మారిపోయాం. యాంత్రికయుగంలో ఎన్నో సదుపాయాలు ఏర్పాటు చేసుకుని జీవితం సుఖమయం చేసుకున్నాం. కాలంతోపాటు పరుగులు తీస్తున్నాం. కాని మేం చాలా కోల్పోయాం నాన్నగారు. బాల్యం మాకు తెలియదు. యవ్వనంలో మాకు మంచి అనుభవాలులేవు. అనుబంధాలు, ఆత్మీయతలు అంటే మాకర్థం తెలియదు. మేం పరిగెత్తుకుంటూ పాలు తాగుతున్నాం. కానీ నీళ్లరుచి తెలియదు. మీ తరంవాళ్ళు గుర్రం స్వారీ చేసేవారు. మేం పులి స్వారీ చేస్తున్నాం. మీరు జీవితాన్ని కాచివడపోశారు. మేం జీవితాన్ని నిర్లక్ష్యం చేస్తున్నాం. మీరు పెద్దల మాటలు వినేవారు. మేం కంప్యూటర్ చెప్పినట్లు నడుచుకుంటున్నాం. అమ్మ అంటుందే.. అలా మేం గోరీలు కట్టుకుని జీవిస్తున్నాం. మీ పెంపకంలో లోపంలేదు. మేం పెరిగిన వాతావరణంలో లోపం ఉంది. మా దగ్గర సముద్రమంత మేధస్సు ఉంది. కాని గుక్కెడునీళ్లు కూడా తాగలేం. మీది కోనేరు మేధస్సు అయితేనేం. అదంతా మంచినీరు. ఇవన్నీ ఎందుకు చెప్తున్నానంటే, మిమ్మల్ని ఈ రొంపిలోకి లాగదలుచుకోలేదు. మీరు ఎప్పుడూ స్వప్నాలలో జీవించలేదు. మీకు మనుషులతోనే కాదు, మీ పుట్టిపెరిగిన నేలతో కూడా బంధాలున్నాయి. చెట్లు, పశువులు, పక్షులు అన్నిటితో మీకు అనుబంధాలున్నాయి. వీటితోపాటు చివరికి మనం పాతికేళ్లు అద్దెకున్న ఇంటిమీద కూడా మీకు మమకారం ఉంది. అందుకే మిమ్మల్ని మీ వాస్తవ జీవితాల్నుంచి దూరం చేయటం ఇష్టంలేక, మీకు తెలియకుండా ఓ పని చేశాం. అక్క, నేను కలిసి కోనేరుగట్టులో మనం గతంలో ఉన్న ఇంటిని మీకోసమే కొన్నాం. ఈ ఉత్తరంతో పాటున్న తాళం ఆ ఇంటిదే. మీరు ఆ ఇంటిలోకి మారిపోయి స్వేచ్ఛగా ఉండాలనేదే మా కోరిక. అన్నట్టు ఇంకో అభ్యర్థన. త్వరలో మాకు పుట్టే పిల్లల్ని మా తరం వాళ్లలా కాకుండా, మీ తరం వాళ్లలా పెంచి పెద్దచేసే బాధ్యత మీకే అప్పగిస్తాం. మన గట్టుమీద పెంచండి. అంటే మాకు తీరికలేక, పెంచలేక అని కానే కాదు. మా స్వార్థం అంతకంటే కాదు. మీలాంటివాళ్ల చేతుల్లో పెరగడం భవిష్యత్తులో మనిషి మనుగడకు చాలా అవసరం నాన్నా. కాదనరుగా.

ఇట్లు

మీ అమ్మాయి, అబ్బాయి

ఉత్తరం చదివిన సుందరయ్యకి కళ్లలో కోనేరు కనపడింది. ఆ కళ్లతోనే వసంతమ్మ కళ్లల్లో వసంతాన్ని చూశాడు. వంటింట్లో కాకులు, పెరట్లో కోయిలలు హడావిడిగా కనిపించాయి.

నవ్య

## పెళ్లి కాకుండానే కాపురం




*బాలీవుడ్‌లో ఇప్పుడు ఇదొక ఇదో అలవాటయిపోయింది. డేటింగ్ పేరు ఆడామగా కలిసి ఒకే ఇంట్లో కాపురం చేయడం ఎక్కువైపోతోంది. గతంలో కత్రినా పెళ్లికాకుండా రణబీర్‌తో ఒకే ఫ్లాట్‌లో కాపురం చేస్తే ఇప్పుడు అదే బాటలో శ్రద్ధాకపూర్ పయనిస్తోంది. ఇటీవల ఫరాన్ అక్తర్ ముంబాయిలో ఓ ఫ్లాట్ కొన్నాడు. ఆ ఫ్లాట్‌లోనే ఫరాన్‌తో శ్రద్ధా ఉంటోంది. ఇంట్లో చెప్పకుండా ఏ పనీ చేయను అంటూ దీర్ఘాలు తీసే శ్రద్ధా ఈ కాపురం సంగతి ఇంట్లో చెప్పే చేస్తోందా? ఇంట్లో వాళ్ళు ఆమెకు ఎలా పర్మిషన్ ఇచ్చారు? అంటూ బాలీవుడ్ జనాలు ఆశ్చర్యం వ్యక్తం చేస్తున్నారు. ఎవరేమనుకున్నా నాకేంటి? అన్న రీతిలో శ్రద్ధా కొత్త కాపురం ప్రారంభించేసిందట!*




- రాజశుక



# ఈ తీర్పు అమలు జరుగుతుందా?

**కులమతాల పేరుతో ఓట్లు అభ్యర్థించడం చట్టవిరుద్ధమంటూ సుప్రీం కోర్టు ఇచ్చిన తీర్పు మన దేశంలో ఎంత వరకూ అమలు జరుగుతుందనేది ఆలోచించాల్సిన విషయమే. కులాలు, మతాల పేరుతో ఓట్లు అడగడం చట్ట విరుద్ధమంటూ సుప్రీం కోర్టు గత వారం తీర్పునిచ్చింది. దేశ చరిత్రలో ఇది నిజంగా సంచలనాత్మక, చరిత్రాత్మక తీర్పు. వాస్తవానికి ఇది కొత్త తీర్పేమీ కాదు. దాదాపు 66 ఏళ్ల నుంచీ అమలులో ఉన్న ప్రజా ప్రాతినిధ్య చట్టం (1951)లోని సెక్షన్ 123 (3)లో కొన్ని మాటల్లో ఉన్న సాంకేతికపరమైన అస్పష్టతను ఇది తొలగించింది అంతే.**

ఈ ప్రజా ప్రాతినిధ్య చట్టం ఎన్నికల్లో కుల, మత, వర్ణ, వర్గాలను నిషేధించింది. ఎన్నికల్లో అభ్యర్థులు, పార్టీలు అనుసరించే అవినీతి మార్గాలలో ఈ కుల, మతాలు కూడా భాగమే. "ఎన్నికల్లో అభ్యర్థి గానీ, అతని ఏజెంటుగానీ లేదా అతని తరపు వ్యక్తులుగానీ, అభ్యర్థి అనుమతితో మరెవరైనా వ్యక్తులుగానీ, మతం, ప్రాంత, కులం, భాషా పరంగా ఓటు వేయడానికి లేదా ఓటు వేయకుండా నిరోధించడానికి ఎవరిని ప్రోత్సహించినా, ప్రేరేపించినా అది చట్టవిరుద్ధమే అవుతుంది" అని ఈ ప్రజా ప్రాతినిధ్య చట్టం తేల్చి చెబుతోంది.

ఈ చట్టానికి పలువురు పలు రకాలుగా కల్పిస్తున్న భాష్యాలు, వ్యాఖ్యానాలు, అర్థాలను తాజాగా సుప్రీం కోర్టు తోసి పుచ్చింది. అభ్యర్థి మాత్రమే కాక, అతని లేదా ఆమె తరఫున ఎవరైనప్పటికీ ఈ విచ్ఛిన్నకర శబ్దాలను ఉపయోగించకూడదని అది తేల్చి చెప్పింది. మొత్తం ఏడుగురు న్యాయమూర్తులలో నలుగురు న్యాయమూర్తులు ఈ తీర్పునకు అనుకూలం. కాగా ముగ్గురు వ్యతిరేకించారు. ఎన్నికల ప్రచారం సందర్భంగా ఏ అభ్యర్థీ, అతని లేదా ఆమె తరపు వ్యక్తులూ ఎన్నికల ప్రచారంలో కుల మతాలను ఏ రకంగానూ ఉపయోగించకూడదనేది ఈ తీర్పు సారాంశం. చట్టంలో ప్రత్యేకంగా అతని అనే తప్ప ఆమెను అనే మాట ఎక్కడా ఉపయోగించనప్పటికీ, ఇది అభ్యర్థులందరికీ వర్తిస్తుందనే అంతా భావిస్తున్నారు. ప్రజా ప్రాతినిధ్య చట్టం (1951) సెక్షన్ 123 (1) ప్రకారం అభ్యర్థులు గానీ, అతని తరఫువారు గానీ ఓటర్లకు లంచాలు, కానుకలు, మరేవైనా ప్రలోభాలు ఇవ్వజూపడం నేరంగా పరిగణించడం జరుగుతుంది. దేశంలో ఇది ఎంత వరకూ అమలు జరుగుతోందన్నది వేరే విషయం.

కఠినంగా అమలు జరిగినా జరగకపోయినా భారతదేశంలో మాత్రం చట్టాల సంఖ్య ఎక్కువే. భారతదేశంలో ఉన్నన్ని చట్టాలు దాదాపు మరే దేశంలోనూ లేవనే చెబుతుంటారు. అంతేకాక, మన దేశంలో ఉన్న సుప్రీం కోర్టును మించిన కోర్టు కూడా ప్రపంచంలో మరే దేశంలోనూ లేదు.

సుప్రీం కోర్టు ఇచ్చే తీర్పులు సాధారణంగా పత్రికల్లో పతాక శీర్షికల్లో దర్శనమిస్తుంటాయి. ఆ తీర్పులకు ఉన్నంత ప్రాధాన్యం ప్రభుత్వపరంగా మరి దేనికీ ఉండదు. అయితే, దేశంలో ఎక్కువ చట్టాలు కాగితాల మీదే ఉన్నాయి తప్ప సక్రమంగా అమలు జరగవనేది అందరికీ తెలిసిన విషయమే. చట్టాల అమలు కన్నా ఉల్లంఘనలే ఎక్కువ. ప్రజా ప్రాతినిధ్య చట్టంలోని సెక్షన్ 29ఏ ప్రకారం, దేశంలోని ప్రతి రాజకీయపార్టీ తమకు రాజ్యాంగం పట్ల నమ్మకం ఉందని, రాజ్యాంగానికి తాము కట్టుబడి ఉంటామని ప్రతిజ్ఞ చేస్తుంది. రాజ్యాంగ సూత్రాలైన సోషలిజం, సెక్యులరిజం, ప్రజాస్వామ్యాల పట్ల విశ్వాసం ఉందని కూడా ప్రకటిస్తాయి. వీటిని ఉల్లంఘించిన పార్టీలకు రాజ్యాంగం ప్రకారం గుర్తింపు రద్దు అవుతుంది. దేశంలో అనేక రాజకీయ పార్టీలు వీటిని ఉల్లంఘిస్తున్నా ఒక్క పార్టీ గుర్తింపు కూడా ఇంతవరకూ రద్దు కాలేదు. ఆయా పార్టీలు ఎన్నికల మేనిఫెస్టోలను పరిశీలించి చర్య తీసుకోవడం చాలా తక్కువ. పార్టీలన్నీ లౌకికవాదానికి కట్టుబడి ఉండాలన్న రాజ్యాంగ సూత్రాన్ని ఉల్లంఘించిన సందర్భాలు చాలా ఎక్కువ.

## ఉల్లంఘనలే అధికం

గత వారం సుప్రీం కోర్టు ఇచ్చిన సంచలనాత్మక తీర్పు ఎంత వరకూ సక్రమంగా అమలు జరుగుతుందనేది వేచి చూడాల్సిన అంశమే. ఈ ఏడాది ఉత్తరప్రదేశ్ సహా అయిదు రాష్ట్రాల్లో జరగబోయే శాసనసభల ఎన్నికలతో ఈ తీర్పు ప్రభావం ఏ స్థాయిలో ఉంటుందో అర్థమైపోతుంది. ఉత్తరప్రదేశ్ వంటి రాష్ట్రంలో ఎన్నికలు కుల మతాలనే ఆలంబన చేసుకుని జరుగుతుంటాయనేది జగద్విదితం. ఈ తీర్పు అమలుమీద అనేక సందేహాలు, ప్రశ్నలు తలెత్తుతాయి. అసలు ఇటువంటి తీర్పును లేదా చట్టాన్ని ఎలా అమలు జరుపుతారన్నది ఓ పెద్ద సవాలు లాంటిది. దేశంలో ప్రజలు ముఖ్యంగా రాజకీయపార్టీలు, రాజకీయ నాయకులు చట్టాలను



అనుసరించడం మీద కంటే ఉల్లంఘించడం మీదే మనుగడ సాగిస్తున్నారు. ఏ కొద్ది మంది అభ్యర్థు లనో మినహాయిస్తే ఎక్కువ మంది అభ్యర్థులు కుల, మత, ప్రాంత, భాషల ఆధారంగా బహిరం గంగా ఓట్లు అడగడం తక్కువే. శివసేన, బహుజ న్‌సమాజ్ పార్టీ, మజ్లిస్‌వంటి పార్టీల నాయకులు, అభ్యర్థులు కూడా ఏనాడూ మతం పేరిట, కులాల పేరిట బహిరంగంగా ఓట్లు అభ్యర్థించడం జరగ లేదు. ఒకవేళ ఆ పార్టీల నాయకులు ఆ ప్రాతిపది కన ఓట్లు అడిగితే వెంటనే పోలీసులు, ఎన్నికల అధికారులు రంగప్రవేశం చేసి, చట్టవిరుద్ధమైన కార్యకలాపాలు నిర్వహిస్తున్నారనే ఆరోపణతో చర్యలు తీసుకుంటారు. అందువల్ల దేశంలో అనేక పార్టీలు పరోక్షంగా, నిగూఢంగా కొన్ని పద్ధతులు అనుసరిస్తుంటాయి.

ఉదాహరణకు, రాజకీయ పార్టీలేవీ మత, కుల, ప్రాంత, భాషాపరంగా ఓట్లు అడగవన్నది నిజమే. ఆ పార్టీలు అభ్యర్థులను ఎంపిక చేయడమే వీటి ఆధారంగా జరుగుతున్నప్పుడు ఇక ప్రత్యేకంగా వాటి పేరుచెప్పి ఓట్లు అడగాల్సిన అవసరం ఏముంటుంది? ఇటువంటి పరిస్థితి నెలకొని ఉన్న పుడు ఇక ఏ కోర్టయినా ఏం చేయగలుగుతుంది? ఇటువంటి ధోరణులను నిషేధించడం, నివారిం చడం అసాధ్యాల్లో కెల్లా అసాధ్యం. మతం పేరుతో, మత విశ్వాసాల ఆధారంగా ఓట్లను ఏకీకరించడం దేశంలో మొదటి నుంచీ జరుగుతున్నదే. ఒక్కోసారి ఇందుకు వామపక్షాలు కూడా మినహాయింపు కాదని కొన్ని సందర్భాలలో రుజువైంది. ఎన్నికలకు ముందు ఆ పార్టీ ఈ పార్టీ అని మినహాయింపు లేకుండా వివిధ పార్టీల నాయకులు మత నాయ కులు, మత గురువుల ముందు నిస్సిగ్గుగా మోకరిల్లు తుంటారు. సాష్టాంగ దండ ప్రమాణాలతో మత గురువుల ఆశీస్సులు కోరుతుంటారు. పరోక్షంగా, నిగూఢంగా స్వామీజీలు, బిషప్పులు, ముల్లాలు వంటి మత గురువుల ద్వారా సందేశాలు పంపి స్తుంటారు. ఎవరికి ఓట్లు వేయాలో కూడా వారి ద్వారా నిర్దేశిస్తుంటారు.

మత, కుల ప్రాతిపదిక మీదే ఓట్లు అడగాల్సిన అవసరం లేదని రాజకీయ నాయకులు, అభ్యర్థులం దరకీ తెలుసు. నేరుగా లేదా బహిరంగంగా మతం, కులం పేరుచెప్పి ఓట్లు అడగాల్సిన అవసరం లేకుండా తమ ప్రసంగాలను అభ్యర్థులు తయారు చేసుకోగలరు. అభ్యర్థులు నర్మగర్భంగా ఓట్లు అడిగే తీరు ఏ కోర్టు పరిధిలోకీ, ఏ చట్టం పరిధిలోకీ రాదు. సమాజంలో వివిధ వర్గాలు ఎదుర్కొంటున్న సమస్యలను అభ్యర్థులు లేదా రాజకీయ నాయ కులు ఏకరువు పెడతారు. ఆ విధంగా రహస్యంగా వారు వివిధ వర్గాల లేదా తాము కోరుకున్న వర్గాల వారి ఓట్లకు గాలం వేస్తారు. ఇటువంటి ప్రసంగా లకు చట్టాలను వర్తింపజేయడం అసాధ్యం. వాటికి చట్టాలను వర్తింపజేస్తే అటు న్యాయస్థానాలు, ఇటు ప్రభుత్వాలు అనేక సమస్యలు ఎదుర్కోవల సిన పరిస్థితి కూడా తలెత్తుతుంది.

### పార్టీల వ్యూహాలు

నిజంగా సుప్రీంకోర్టు తీర్పును కఠినంగా అమలు చేయాల్సి వస్తే దళితుల సమస్యలను ప్రస్తావించడం బహుజన సమాజ్ పార్టీ వంటి ఏ పార్టీకైనా కష్టమే అవుతుంది. ఇతర వెనుకబడిన వర్గాల కష్టనష్టాల గురించి సమాజ్‌వాది పార్టీ లేదా జనతాదళ్ (యు) వంటి ఏ పార్టీ కూడా ప్రస్తావించలేదు. 'అణగారిపోయి ఉన్న' మతాల గురించి మజ్లిస్ తదితర ఏ పార్టీ కూడా పైకి చెప్ప లేదు. అయితే, హిందుత్వ లేదా హిందూయిజం గురించి 1995లో సుప్రీంకోర్టు ఒక తీర్పు వెలువ రిస్తూ, హిందుత్వ లేదా హిందూయిజం అనేది ఓ జీవన సరళి అనీ, ఓ మానసిక స్థాయి అనీ రూలింగ్ ఇచ్చింది. అందువల్ల బీజేపీ మాత్రం హిందుత్వ గురించి మాట్లాడడానికి అవకాశం ఉంది. అంటే ఒక రకంగా కోర్టు రూలింగ్ బీజేపీకి అనుకూలంగా ఉందని అనుకోవాలి.

మాయావతి, ములాయం, లాలూ ప్రసాద్ వంటి వారు బడుగువర్గాల గురించి మాట్లాడకుండా కూడా ఈ తీర్పు అడ్డుపడుతుంది. అంటే, బడుగు వర్గాల తరఫున నిజంగా, చిత్తశుద్ధిగా పోరాడే రాజ కీయ పార్టీలు కూడా నోరెత్తలేని పరిస్థితి తలెత్తు తుంది. న్యాయమూర్తి డి.వై. చంద్రచూడ్ చెప్పిన ఓ ముఖ్యమైన విషయాన్ని ఇక్కడ గుర్తు చేసుకో వాలి. ఎన్నికల సమయంలోనూ, ఎన్నికలు లేన పుడూ కుల, మత, వర్గాల మీద చర్చించుకోవడా నికి రాజ్యాంగపరంగా రక్షణ ఉంది. ఇది వాక్ స్వాతంత్ర్యంలో భాగం. వీటి ద్వారా కూడా సమా జంలోని వివిధ అణగారిన వర్గాల గురించి ఆలో చించవచ్చు" అని ఆయన అన్నారు. ఈ తీర్పును వ్యతిరేకించిన ముగ్గురు న్యాయమూర్తులలో చంద్రచూడ్ కూడా ఒకరు.



**కుల మతాల పేరిట ఓట్లు అభ్యర్థించడం చట్టవిరుద్ధమంటూ సుప్రీంకోర్టు గతవారం ఇచ్చిన తీర్పు నిజంగా సంచలనాత్మక, చరిత్రాత్మక తీర్పు. అయితే ఇది ఎంతవరకు సక్రమంగా అమలు జరుగుతుందనే విషయంపైనే అంతా దృష్టి సారిస్తున్నారు. దీన్ని యథాతథంగా అమలు జరపాల్సివస్తే దేశంలో అనేక గందరగోళాలు తలెత్తుతాయనడంలో సందేహం లేదంటున్నారు రాజశుక. ఇంతకీ ఏమిటా గందరగోళాలు?**

విచిత్రమేమిటంటే, 'ద్రవిడ' అన్న పదం ఒక జాతికి, ఒక భాషకు సంబంధించిన శబ్దం. అందు వల్ల అన్నాడిఎంకె, డీఎంకే వంటి పార్టీలను కూడా నిషేధించాల్సి వస్తుంది. ఆ మాటకొస్తే తెలుగు దేశం పార్టీలో ఉపయోగించిన తెలుగు అనే పదం కూడా ఓ భాషకు సంబంధించిందే. ఇండియన్ ముస్లిం లీగ్, ఆల్ ఇండియా మజ్లిస్-ఎ-ఇత్తెహా దుల్ ముస్లిమీన్ వంటి పార్టీలు కూడా నిషేధానికి గురవుతాయి. ఇవన్నీ కోర్టు రూలింగ్‌కు విరుద్ధంగా ఉన్నాయి. తీర్పును యథాతథంగా అమలు జర పాల్సి వస్తే దేశంలో అనేక గందరగోళాలు తలెత్తు తాయనడంలో సందేహం లేదు.

ఇది ఇలా ఉండగా, మతమనేది వ్యక్తిగతమని, దేవుడికి సంబంధించిన కార్యకలాపాల గురించి ప్రస్తావించడం నిషేధమని కూడా కోర్టు నిర్ధారిం చింది. దీని మీద సుప్రీం కోర్టు తన అభిప్రాయాన్ని వెలువరించడం నిజంగా అత్యుత్తమ పరిణామం. అయితే, ఇక్కడో సమస్య ఉత్పన్నమవుతోంది. దేవు డికి, మనిషికి మధ్య ఉన్న సంబంధం వ్యక్తిగతమే అయితే దేవుడి సంబంధమైన కార్యకలాపాల్లో ప్రభుత్వ జోక్యం ఎందుకుండాలి? ప్రభుత్వం దేవా లయాల మీదే అజమాయిషీ ఎందుకు చేయాలి? ఇతర ప్రార్థనా మందిరాల నిర్వహణను ఆయా మతస్థులకే ఎందుకు వదిలేయాలి? అలా అయితే, దేశంలో యూనిఫామ్ సివిల్ కోడ్ ఎందుకు ఉండకూడదు? దేశంలో లౌకికవాదం విషయంలో ఉన్న అపార్థాలు, పెడర్థాల మీద కూడా కోర్టు దృష్టి కేంద్రీకరిస్తే బాగుంటుందనిపిస్తోంది. అటువంటి వేమీ జరిగే అవకాశం లేదు. సుప్రీం కోర్టు ఇచ్చిన సంచలన, చరిత్రాత్మక తీర్పు ఎంత వరకూ అమలు జరుగుతుందన్నదే ఇప్పుడు మన ఎదుట నిలిచిన పెద్ద సవాలు.




**శ్రావణి రతీదేవిలా అలంకరించుకుని 'డ్రీం సీక్వెన్స్' సీనులో నటించి కాస్ట్యూమ్స్, లొకేషన్ చేంజ్ చేయాలన్నప్పుడు 'తలనొప్పిగా ఉందని చెప్పి వచ్చేశా!' అని అంటూ నా పక్కనే కూర్చుంది. అప్పటికి శ్రావణి పూర్తిగా మేకప్ కూడా తీయలేదు.**

బుగ్గలకు పూసిన రోజ్ కలర్, దానిమీద చమ్కీలు, నుదుట పొడవాటి బొట్టు, చేతివేళ్లకు పూసిన గోరింటాకు రంగు, విరబోసుకున్న జుట్టు అలాగే ఉన్నాయి. ఆ మేకప్‌లో శ్రావణి నిజంగానే రతీదేవిలా ఉంది. అంతకుముందు చూడని అందమైన రూపం కనిపించింది. నేను తననే విభ్రాంతిగా చూస్తుండిపోయాను. కొద్దిసేపటి క్రితం వరకు ఆమె నన్ను మోసం చేసిపోయిందన్న బాధతో విలవిలలాడిన నేను మళ్లీ ఆమెనే చూస్తుండిపోయాను, ఆశగా.

"చూడడం అయిపోతే, కొంచెం ఆత్మారాముడి గోల పట్టించుకుంటారా?" అంది.

"అంటే?" అన్నాను.

"ఆకలి దంచేస్తోంది. ఛలో! బైటకు ఎక్కడికైనా వెళ్లి భోంచేద్దాం!" అంది.

నాక్కూడా ఆ ఇంట్లోనుంచి కాసేపు బయట పడాలని, ఇప్పటిదాకా ముసురుకున్న విషాద ఛాయలను వదిలించుకోవాలని ఉంది.

"ఎక్కడికెళ్దాం?" అన్నాను.

"ఎక్కడికెళ్దాం అంటే..." అని ఆలోచించి,

"ఛలో! ప్రశాంతంగా ఉండే ఓ చోటు నాకు తెల్సు. లేచి ముఖం కడుక్కో. దేవదాసులా ఉన్నావ్?" అంది.

## జరిగిన కథ

ఆస్కార్ అవార్డుల పోటీల్లో అతడి చిత్రం ఎంపికైన సందర్భంగా అమెరికా వెళుతున్నాడా తెలుగు దర్శకుడు. విమానంలో కూర్చుని గతం గుర్తుచేసుకున్నాడు. జూనియర్ ఆర్టిస్టు హత్యాయత్నం కేసులో దర్శకుడికి, డీసీపీ పుష్పాకిరణ్ ప్రమేయంతో, లిఫ్ట్ ఇస్తాడు నిర్మాత. దాంతో గొప్ప సినిమా నిర్మించేందుకు సన్నద్ధమవుతాడు దర్శకుడు. అంతలోనే నటి జలజ హత్యకు గురైంది. హత్యకు కారణమైన సయీమ్‌ని ఎన్‌కౌంటర్ చేస్తారు. తన సినిమాలో హీరోగా కిరణ్‌ని సెలెక్ట్ చేస్తాడు డైరెక్టర్. డ్రగ్స్ కేసులో ఇరుక్కుని జైలు పాలవుతాడు కిరణ్. దాంతో హీరోగా గోపీని తీసుకుని హీరోయిన్‌గా శ్రావణిని సెలెక్ట్ చేస్తాడు. షూటింగ్ మొదలవుతుంది. క్రమంగా శ్రావణి పట్ల ఆకర్షితుడవుతాడు. షెడ్యూల్ అయిపోవడంతో తిరుగుప్రయాణంలో శ్రావణే అతనికి తన ప్రేమను తెలియజేస్తుంది.

ఆ తర్వాత.....

"నిజంగా నేను దేవదాసునే ఇప్పటిదాకా! దేవ కాంతవు నువ్వు వచ్చావు కదా! నీ మేకప్ ఇదేనా? దారి పొడుగునా భక్తులు వరాలు అడుగుతా రేమో?" అని భుజాలు ఎగరేశాను.

"అవును. నేను దేవతనే! మోడ్రన్ దేవతను!" అంటూ నవ్వింది.

ఈ మధ్య 'గుడ్‌నైట్' లాంటి మస్కిటో రిప ల్లెంట్ వాళ్ల యాడ్స్‌లో 'గుడ్‌నైట్' మిషన్ ఆన్ చేయగానే, ఇంటి మూలమూలల్లో, ఎక్కడెక్కడో దాక్కున్న దోమలన్నీ కిటికీలలో నుంచి 'పోలో' మని పారిపోతుంటాయి.

అలాగే, శ్రావణి నవ్వేసరికి, నా ఇంటి మూల మూలల్లో అప్పటివరకు దాక్కున్న విషాద ఛాయలు పారిపోయాయి.

మేమిద్దరం తయారై బైటకొచ్చేసరికి, సన్నటి జల్లు పడుతుంది.

సెల్లార్‌లో కారు పార్కింగ్ దగ్గర డ్రైవర్ ఉన్నాడు. డ్రైవర్ వద్దని శ్రావణి సైగచేసింది.

డ్రైవర్‌ని పంపించేసి 'ఆడి' కారు తీశాను.

శ్రావణి అడ్రస్ చెబితే, కారును అటు పోని చ్చాను. 'ఆడి' కారులో ప్రయాణం అంత ఆనం దంగా ఉంటుందని నేనెప్పుడూ ఊహించలేదు.

ట్రాఫిక్ పద్మవ్యూహం దాటి ఖైరతాబాద్ ఫ్లైఓవర్ దాటి నెక్లెస్ రోడ్డులోకి ప్రవేశించాము. ఐమాక్స్ సర్కిల్ దగ్గర లెఫ్ట్ టర్న్ తీసుకున్నాము.

వర్షం ఎక్కువైంది. రోడ్డు మీద జనం పలుచగా ఉన్నారు. చుట్టూ ఉన్న చెట్లు తుషార స్నానంచేసి పచ్చగా మాకు స్వాగతం పలుకుతున్నట్టుగా నిలబడి ఉన్నాయి. కారు స్పీడ్ తగ్గించి 'క్రూజ్' మోడ్‌లో పెట్టాను. కారు నిశ్శబ్దంగా, పూలతేరులా సాగిపోతోంది. చల్లటి సాయంత్రం, చక్కటి చెలి, సన్నటి చిను కులు, వెచ్చటి స్వరంలో సంగీతం... జీవితం ఇలా గడిచిపోతే ఎంత బాగుణ్ణు అని అనుకున్నాను.

రోడ్డు చివరివరకు వెళ్ళి, యూ టర్న్ తీసుకుని వచ్చి 'ఒబ్రాస్'లోకి కారు పోనిచ్చాను.

హుస్సేన్‌సాగర్ చెరువులో, చుట్టూ చీకటిపొరల మధ్య, వెలుతురు ద్వీపంలా ఉంది, ఆ హోటల్.

కారు దిగి, కీస్ వాలెట్‌కు ఇచ్చి, శ్రావణి నా భుజం మీద తల వాల్చి నడుస్తుంటే, నాకు ప్రపంచమే నీరాజనం పలుకుతున్నట్టనిపించింది. దానికి తగ్గట్టు గానే, అడుగడుగునా ఆహ్వానిస్తూ హోటల్ స్టాఫ్ లోపలికి తీసుకెళ్ళారు.

బఫే డిన్నర్.

బోలెడన్ని ముచ్చట్లు చెప్పుకుంటూ భోం చేశాం. ఐస్‌క్రీం తీసుకుని వచ్చి టేబుల్ మీద కూర్చున్న తర్వాత, నా మనసులోని మాట చెబు దామని, "శ్రావణీ!" అని పిలిచాను.

నా గొంతులో మార్దవం గమనించి, నేను చెప్పబోయేదేమిటో ఊహించి,

"వద్దు!" అని గట్టిగా అని, "ఇంటికి వెళ్లాక నేను ముందు మాట్లాడతాను. తర్వాత నువ్వు చెప్పా లనుకుంది నువ్వు చెప్పు!" అన్నది, నిశ్చయంగా.

నేను విస్తుపోయి చూస్తుంటే, "చల్లటి ఈ ఐస్‌క్రీమును చేదు కానివ్వకు, ప్లీజ్!" అంది.

నేను సరేనన్నట్లుగా తలాడించాను.

కానీ, నా మనసేదో కీడు శంకించింది. నా ఐస్‌క్రీము జిహ్వకు చేదుగా తోచింది.

నా ముఖం మాడిపోయింది.

●●●

నేను స్నానం చేసి, డ్రస్ చేంజ్ చేసుకున్న తర్వాత హాల్లో కూర్చున్నాను.

శ్రావణి నైట్‌గౌన్ వేసుకుని బైటికొచ్చింది. ఎర్రటిరంగు గౌను పచ్చటి ఒంటిమీద మెరిసిపోతోంది. నాకేమో, నన్ను కబళించబోయే రాక్షసి నాలు కలా, ఎర్రగా కనిపించింది.

"రా, కూర్చో!" అన్నాను.

"ఊహూ!" అంటూ బెడ్‌రూం వైపు చూపుడు వేలితో చూపుతూ, "ఈ రాత్రిని ఇలాగే, సంతో షంగా ముగించుదాం" అంది.

నేనొప్పుకోలేదు. "ముందు మన రిలేషన్ ఏమిటో తేల్చుదాం!" అన్నాను.

"సరే!" అని శ్రావణి అంటుండగానే, ఆమె కళ్లల్లో నీళ్లు నిండాయి.

●●●

"మా ఇల్లు పొద్దున్నంతా శ్మశానంలో, చచ్చి పడినట్టున్న మనుషులు అడ్డదిడ్డంగా, ఒంటిమీద స్పృహలేకుండా పడిఉన్న కళేబరాల సమూహంలా ఉండేది. ఇల్లంతా సిగరెట్లు, చుట్టల పొగలతో, కాముడికి ధూపం వేసిన రంగమంటపంలా ఉండేది. అందరిళ్లలో మాదిరిగా మా ఇంట్లో మగవాళ్లుండేవారు కాదు. రాత్రికి వచ్చిన వాళ్ళు తెల్లారేసరికి మాయమయ్యేవారు. అప్పుడు నా వయసెంతో నాకు తెలియదు! సుమారు ఐదారేళ్ల ఉండొచ్చును. నాకు అంతా గందరగోళంగా తోచేది. అందరి పిల్లల్లాగా యూనిఫామ్ వేసుకుని స్కూలుకు నేనెందుకు వెళ్లడం లేదో నాకర్థం కాక పోయేది. ఇంట్లో ఉండే ముసలవ్వే నా బాగో గులు చూసేది. ఇంటినిండా పడి ఉన్న ఆడవాళ్ల మధ్య నేను ప్రతీరోజు ఉదయాన మా అమ్మను వెతుక్కుంటూ తిరిగేదాన్ని.

మా అమ్మ నన్ను చాలా ప్రేమగా చూసు కునేది. నాకైతే, అమ్మంటే చాలా ఇష్టం. మా అమ్మ ఎంత అందంగా ఉండేదో! తను నవ్వితే, నాకు గుళ్లో దేవతలా అన్పించేది. నాకైతే, ఎప్పుడూ అమ్మతోనే ఉండాలనిపించేది. కానీ అమ్మకు టైమే చిక్కేది కాదు. ఎప్పుడూ ఏదో ఒక ఊరికి వెళ్తుండేది. ఊర్లో ఉన్నప్పుడు అమ్మ నన్ను



సందు చివరనున్న ఐస్‌క్రీం పార్లరుకు తీసుకుని వెళ్లేది. రోడ్డు మీద మేము ఇద్దరం నడుస్తుంటే అందరూ మమ్మల్ని వింతగా చూసేవారు. అమ్మ అందంగా ఉండడం చూసి అమ్మను చూస్తున్నా రని అనుకునేదాన్ని. అంత అందమైన అమ్మ నాకుందని గర్వంతో నా మనసు ఉప్పొంగిపోయేది. నాకు ప్రతిరోజూ అమ్మతో అలా సంతోషంగా గడపాలని ఉండేది. కానీ అమ్మ నెలలు, నెలలు వేరే ఊళ్లకు వెళ్లేది. నేను మా ఊళ్లో అదే ఇంట్లో ఉండేదాన్ని. అమ్మ ఉన్నప్పుడు నన్ను బాగానే చూసుకున్నా, అమ్మ లేనప్పుడు ముసలవ్వ నన్ను చాలా హింసించేది. రోజంతా తన పక్కనే కూర్చుని, కాళ్లు పట్టమనేది. రాత్రిపూట మగాళ్ళంతా వచ్చి నప్పుడు వాళ్ళకోసం సిగరెట్లు, కిళ్లీలు, సోడాలు తెమ్మని పంపించేది. వాళ్ల ముందు నన్ను డాన్స్ చేయమనేది. ఒకళ్లిద్దరు అంకుల్స్‌కి నేనంటే బాగా ఇష్టం. వాళ్ళు నాకు పెద్దపెద్ద చాక్లెట్లు తెచ్చి ఇచ్చే వారు. కానీ, వాళ్ళు నన్ను తమ ఒళ్లో కూర్చోబెట్టడం, పెదాలమీద ముద్దు పెట్టుకోవడం, నా భుజా లను, తొడలను తడమడం నాకు నచ్చేది కాదు. వాళ్ల నోటి నుండి కంపు వాసనొచ్చేది. నాకు వాంతి వచ్చినట్టయ్యేది. నేను వెళ్ళిపోతానని ఏడ్చేదాన్ని కానీ, ముసలిది నన్ను ఉరిమురిమి చూసేది. తర్జనితో బెదిరించేది. నేను ఒప్పుకోకపోతే అంకుల్స్ వెళ్లాక బాగా కొట్టేది. అమ్మకు చెబ్తే, మా ఇంటికి వచ్చే పోలీసు అంకుల్‌కి చెప్పి అమ్మనూ, నన్నూ చంపేస్తాననేది. అందుకే, అమ్మకు నేను ఈ విష యాలేవీ చెప్పేదాన్ని కాదు. కానీ, నన్ను కూడా తనతో తీసుకెళ్లమని ఏడ్చేదాన్ని. నేనంటే ఎంతో ప్రేమ ఉన్నా, అమ్మ నన్ను ఆ రాక్షసి దగ్గరే ఎందుకు వదిలేస్తుందో నాకు అర్థమయ్యేది కాదు.

ఒకసారి, నన్నుకూడా ఊరికి తీసుకెళ్ళమని నేను బాగా ఏడ్చాను. అమ్మ ముసలిదాన్ని అడిగింది. ముసల్ది కోపంతో అమ్మను కొట్టింది. దాంతో, అమ్మ ఏడుస్తూనే వెళ్లిపోయింది. అమ్మ వెళ్లిన తర్వాత ముసల్ది నన్నుకూడా బాగా కొట్టింది. 'ఇంకోసారి అమ్మతో వెళ్తానని మారాం చేయొద్దని' అట్లకాడ కాల్చి చేతిమీద వాత పెట్టింది. అప్పటి నుంచి దాన్ని చూస్తేనే నాకు వణుకు పుట్టేది.

ఓ రోజు రాత్రి, చాలారోజుల తర్వాత ఊరి నుంచి అమ్మ వచ్చింది. అప్పుడు నేను చిన్న నిక్కరేసుకుని అంకుల్స్ ముందు డాన్స్ చేస్తు న్నాను. అమ్మ అది చూసి కోపంతో ఊగిపోయింది. నన్ను రెండు చెంపలూ వాయించి తనతో లాక్కె ళ్లింది. అడ్డొచ్చిన ముసలిదాన్ని కూడా రెండు వాయించింది. 'నా పాప జోలికొస్తే ప్రాణం తీస్తా నని' బెదిరించింది. ఆ రాత్రి అమ్మ ఒళ్లో నిద్ర పోతున్నప్పుడు, నేను ముసలిదాని గురించి మొత్తం చెప్పాను. ఆ రోజు నుంచి అమ్మ నన్ను విడిచి వేరే ఊరికి వెళ్లలేదు. నాతోనే ఉండేది. ఓ రోజు నేను పడుకున్నప్పుడు, నన్ను లేపి నిశ్శబ్దంగా తనతో రమ్మని చెప్పింది. మేమిద్దరం కలిసి బైట కొచ్చి సందు చివరనున్న ఐస్‌క్రీం షాప్ దగ్గరకు రాగానే ఒక కారొచ్చింది. కారులో ఉన్న అంకు ల్‌తో కలిసి హైదరాబాద్‌కు వచ్చేశాం.

హైదరాబాదు నగరం నాకు చాలా వింతగా అన్పించింది. మా ఊళ్లో నేను సందు చివరనున్న రెండతస్తుల ఐస్‌క్రీం షాప్ దగ్గరకు మాత్రమే అమ్మతో కలిసి వెళ్ళేదాన్ని. ఆ షాప్ దాటిన తర్వాత పెద్ద రోడ్డు ఉండేది. దాని మీద లారీలు, బస్సులు, రిక్షాలు తిరుగుతుండేవి. వాటినే నేను ఆశ్చర్యంగా చూసేదాన్ని. అట్లాంటిది, హైదరాబాదులో కార్లు, బస్సులు, విమానాలు, ఆటోలు, పెద్దపెద్ద బిల్డింగులు చూసి నేనే కాదు, మా అమ్మ కూడా నోరు వెళ్లబెట్టింది.

హైదరాబాదు చేరగానే, మేము 'ద్వారకా' అనే హోటల్లో దిగాము. ఊళ్ళో ఉన్న మా ఇంటితో పోలిస్తే, ఆ హోటల్ రాజభవనంలా ఉంది. బెల్లు కొట్టగానే ఓ అంకుల్ వచ్చి మాకు తినడానికి ఏం కావాలంటే అది తెచ్చేపెట్టేవాడు. తర్వాత రెండు రోజులు ఆటోల్లో, కారుల్లో ఊరంతా తిరి గాము. నాకు ఇష్టమైనప్పుడల్లా, అంకుల్ ఐస్‌క్రీం కొనిచ్చాడు. నాకు రోడ్ పక్కనే దొరికే చెరుకు రసం కూడా బాగా నచ్చింది. పెద్దపెద్ద పార్కుల్లో ఆడుకున్నాము. ఒకరోజు రాత్రి సినిమాకు వెళ్లాం. అక్కడ మెట్లు గమ్మత్తుగా ఉన్నాయి. మనం మెట్లు ఎక్కాల్సిన పనేలేదు. ఒక మెట్టుమీద మనం నిలబడితే, అదే పైకి వెళ్లిపోతుంది. దాన్ని ఎస్కులేటర్ అంటారని అంకుల్ చెప్పాడు. మొదటి సారి, కొత్త అంకుల్ నా చేయి పట్టుకుని జాగ్ర త్తగా మెట్లు ఎక్కించాడు. నాకు ఎస్కులేటర్ బాగా నచ్చింది. నేను ఐదారుసార్లు దిగాను. ఆ వింతలన్నీ చూస్తూ అమ్మ నా చేయి వదిలేసినా, అంకుల్ మాత్రం నా చేయి వదలకుండా పట్టు కుని జాగ్రత్తగా చూసుకున్నాడు. ఇంటర్వెల్లో పెద్దపొట్లం నిండా పాప్‌కార్న్ కొనిచ్చాడు. భోజనం

**శ్రావణీ! పిలిచాడతడు. అతడేం చెప్పబోతున్నాడో ముందే కనిపెట్టినట్లుగా 'ఇప్పుడేం చెప్పొద్దు' అందామె. ఇద్దరూ ఫ్లాట్‌కొచ్చారు. ఈ రాత్రంతా హాయిగా, సంతోషంగా గడుపుదాం అంటున్న శ్రావణితో, ముందు మన రిలేషన్ ఏమిటో చెప్పాలన్నాడతడు. ఖిన్నురాలైంది శ్రావణి. చెప్పక తప్పదనుకుంది. తన గురించి చెప్పటం మొదలుపెట్టింది. శ్రావణి గతమేమిటి? ఆమె ఎక్కడినుంచి వచ్చింది?**

చేసి హోటల్‌కి వచ్చిన తర్వాత అమ్మా, అంకుల్ మాట్లాడుకుంటుంటే విన్నాను.

'రాజ్యం! సినిమాల్లో నీ వేషం గురించి నాకు తెలిసిన ప్రొడక్షన్ మేనేజర్‌తో మాట్లాడాను. సరే నన్నాడు. కానీ, నీకు తెలుసు కదా. వాళ్ళ దగ్గరకు వందల మంది వస్తుంటారు. వాళ్ళు అందరికీ అదే మాట చెబుతుంటారు. మన విషయంలో అలా జరగకూడదంటే, వాళ్ళకు మనం ఇంకేదో ఆశ చూపించాలి. నీకు తెలియందేమీ కాదు. ఇక్కడ ఆశకు రూపం శరీరం. నువ్వు మనూళ్ళో ఒక్క రాత్రికి వందకు, వారానికి ఐదొందల లెక్కన గడిపినదానివే. సారీ! పచ్చిగా మాట్లాడుతున్నందుకు. అదేపని మనం ఇక్కడ కూడా చేయాలి. కానీ, డబ్బులకు కాదు. నీకు ఇప్పుడున్న సినిమాతారలను మించిన అందముంది. ఫోటోజెనిక్ ఫేస్ ఉంది. సినిమా ఛాన్సుల కోసం నువ్వు నీ శరీరాన్ని ఫణంగా పెట్టాలి. అదీ రోజూ కాదు. నేను పకడ్బందీగా ప్లాన్ చేస్తాను. ఇక్కడ పక్కోడి పెళ్ళామంటే మోజె క్కువ. అందుకే మనిద్దరం భార్యాభర్తలమని చెబ్దాం. పాప మనిద్దరి కూతురని చెబ్దాం. నువ్వు తెచ్చిన నగలు, డబ్బులు, నా దగ్గరున్న డబ్బులు పెట్టి మంచి లొకాలిటీలో మంచి ఇల్లు అద్దెకు తీసుకుందాం. ట్రావెల్ కంపెనీ నుండి ఓ కారు రెంటుకు తీసుకుందాం. మనది జమిందారీ వంశం అని చెబ్దాం. నువ్వంటే ఇక్కడి పెద్దపెద్ద నటులు, ప్రొడ్యూసర్లు, ఫైనాన్షియర్లు పడి చచ్చేట్టు చేద్దాం. ఒక్కసారి మన పాచిక పారిందంటే, డబ్బులే డబ్బులు, సినిమాఛాన్సులు నీ కాళ్లదగ్గరికే వస్తాయి. మహారాణిలా టాలీవుడ్‌ను ఏలు. నీ దగ్గర నన్ను ఉండనివ్వు. బయట ప్రపంచానికి నేను నీ మొగుణ్ణి. నీ వ్యవహారాలన్నీ నేను చూసుకుంటాను. మేనేజర్‌గా పడి ఉంటాను' అంటూ ఇంకా ఏదేదో చెబ్తుండగానే నాకు నిద్ర ముంచుకొచ్చింది. నాకు అస్సలు అర్థం కాలేదు.

అవన్నీ ఇప్పుడు, కొన్ని ఊహించుకుని, కొన్ని అనుభవించి, కొన్ని అమ్మ చెబితే గుర్తుచుకుని చెప్తున్నాను.

వారం రోజుల్లోనే మేము పెద్ద ఇంట్లోకి మారిపోయాము.

నాకు చిన్నప్పటి నుంచీ రంగురంగుల యూనిఫాంలు వేసుకుని స్కూలుకు వెళ్లాలన్న కోరిక, కొత్త ఇంట్లోకి మారగానే తీరింది. కొత్త ఇంట్లోకి మారాక అమ్మ నాకు అంకుల్‌ని చూపించి 'ఇప్పటినుంచి అంకుల్ నీకు నాన్న. నాన్న అని



పిలవాలి. అంకుల్ అని పిలవద్దు' అని చెప్పింది. నాకు చాలా సంతోషమయింది. అప్పటివరకు నాకు నాన్న లేడు.

స్కూల్లో చేరగానే, అంకుల్ నాకు మంచి బట్టలు, స్కూల్‌బాగ్, షూస్, పెన్నులు, బాక్సులు, పర్స్ కొనిచ్చాడు. అప్పుడే నాకు ఇట్లాంటి నాన్న ఉంటే బాగుండుననిపించింది. ఇప్పుడు అమ్మ కూడా అంకుల్‌ను 'నాన్నా' అని పిలవమని చెప్ప డంతో నేను మురిసిపోయాను.

కొత్త ఇంటికి మారాక అమ్మ మంచి చీరలు కట్టుకునేది. కళ్లకు పెద్ద గాగుల్స్ పెట్టుకునేది. హైహీల్స్ వేసుకునేది. మంచి మంచి సెంట్లు పూసుకునేది. బైటకు వెళ్లాల్సినప్పుడల్లా మేకప్ మాన్ ఇంటికే వచ్చేవాడు. అమ్మ సినిమాస్టారులా, దేవతలా తయారయి బయటకు వెళ్ళేది.

అంత పెద్ద ఇంట్లో నేనూ, నాన్నే ఉండే వాళ్ళం.

నాన్న పొద్దున్నే లేచి జాగింగ్‌కి వెళ్తూ పార్కుకు నన్నూ తీసుకెళ్లేవాడు. మేమిద్దరమూ జాగింగ్ చేసొచ్చి యోగాసనాలు వేసేవాళ్ళం. నాన్న నా కోసం హార్లిక్స్ కలుపుకొచ్చి తాగించే వాడు. స్నానం చేసి, నాన్నా నేనూ పూజ చేసే వాళ్లం. తర్వాత బయటికి వెళ్ళి టిఫిన్ చేశాక నాన్న నన్ను స్కూటర్ మీద స్కూల్లో దించేవాడు. స్కూటర్ దిగి గేట్లోంచి స్కూల్లోకి వెళ్లేంతవరకు నిలబడి నాన్న 'టాటా' చెప్పేవాడు. నాకు చాలా సంతోషంగా ఉండేది. స్కూలునుంచి వచ్చిన తర్వాత నాన్న నన్ను పార్కుకు తీసుకెళ్ళేవాడు. నన్ను వీపు మీద ఎక్కించుకుని, రోజూ ఉప్పు బస్తా ఆట ఆడదా

## సినీవాలి
## కూపన్ నెం.12 విజేత

**ఆర్. విమల**
**వడ్డేపల్లి, హన్మకొండ**

మనేవాడు. ఇంటికొచ్చాక నాకు డాన్స్ ప్రాక్టీస్ ఉండేది.

'పదేళ్ల వయసులోనే పాప బ్రహ్మాండంగా డాన్స్ చేస్తుంది సార్!' అని నాన్నతో మాట్లా డుతూ, మెచ్చుకునేవాడు డాన్స్ మాస్టర్.

'అమ్మాయిగారి వయసు పదేళ్లంటే ఎవ్వరూ నమ్మరు సార్!' అనేవాడు.

'తొందరలోనే అమ్మాయిగారితో అరంగేట్రం చేయిద్దాం అయ్యగారూ!' అనేవాడు.

అట్లాంటి మాటలు వినడం నాన్నకు చాలా ఇష్టం. డాన్స్ మాస్టారు ఆ విషయం గ్రహించి, ఎప్పుడూ నా గురించే మాట్లాడేవాడు. నా శరీరం ఏపుగా పెరుగుతుందని రోజుకోసారైనా ప్రస్తా వించేవాడు. పెద్దమ్మగారి కన్నా అందంగా తయా రవుతుందని పొగిడి నాన్న దగ్గరి నుంచి తృణమో పణమో పొందేవాడు. ఆ మాటలు విని నాన్న సంతోషంగా, నన్ను గట్టిగా కౌగలించుకునేవాడు. నాకు ఊపిరి ఆడనట్లయ్యేది. వదలమని గింజు కున్నా వినిపించుకునేవాడు కాదు.

అమ్మ పేరు మార్చుకుంది. ఇప్పుడు అమ్మ పేరు 'భామ'. అమ్మకు సినిమా ఛాన్సులు రావడం మొదలైంది. ఎక్కువగా కామెడీ రోల్స్, అక్క, వదిన, భార్యల పాత్రలు వేసేది. స్కూల్లో అందరూ నన్ను 'భామ' కూతురని స్పెషల్‌గా ట్రీట్ చేసే వారు.

అనుకున్నట్టుగానే, ఒకటి రెండు సంవత్సరా లలో అమ్మకు రెగ్యులర్‌గా సినిమా ఛాన్సులు రావడం మొదలైంది. డబ్బులు కూడా బాగానే కూడబెట్టింది. అయితే, అమ్మ పూర్తిగా మారి పోయింది. నాన్నను తిడుతుంది. ఊళ్లో ఉన్న ప్పుడు, అమ్మ నన్ను వదిలి వేరే ఊరికి వెళ్ళి, తిరిగి రాగానే వారం పదిరోజుల పాటు నన్నే ఎత్తుకుని తిరిగేది. నేనంటే ప్రాణం పెట్టేది. ఇప్పుడు నేను బాగా పొడుగు పెరిగాను. నా శరీరంలో చాలా మార్పులు వస్తున్నాయి. నన్ను ఎత్తుకోకపోయినా ఫర్వాలేదు కానీ, అమ్మ ఇప్పుడు నన్నసలు పట్టించు కోవడమే లేదు. నా ఒంట్లో జరిగే మార్పుల గురించి అమ్మకు చెబ్దామంటే, అమ్మకు టైమే చిక్కడం లేదు. పొద్దున్న నేను లేచేసరికి షూటింగులకని వెళ్లిపోయేది. రాత్రిళ్లు కూడా తను ఇంట్లో ఉండేది కాదు. ఏరోజైనా ఉన్నా ఇద్దరో ముగ్గురో అంకుల్స్ వెంట ఉండేవారు. అందరూ కలిసి విస్కీ తాగుతూ కూర్చునేవాళ్లు. నేనెప్పుడైనా తన దగ్గరకు వెళ్తే, 'వెళ్ళు... వెళ్ళు.. వెళ్ళి నాన్నతో ఆడుకో, ఫో' అని విసుక్కునేది. ఎవరికైనా నన్ను కూతురని చెప్పి పరిచయం చేయడానికి ఇబ్బంది పడేది.

ఒకరోజు, నేను స్కూల్ నుండి వచ్చేసరికి అమ్మ ఒక అంకుల్‌తో, హాల్లో కూర్చుని మాట్లాడుతోంది.

**ఈవారం సినీవాలి చదివారు కదా!**
**మా ప్రశ్నకు మీ జవాబు క్రింది కూపన్‌లో స్పష్టంగా రాసి**
**కూపన్‌ని కత్తిరించి మాకు పంపండి. లక్కీడిప్‌లో ఫ్యాన్సీ చీర గెలుచుకోండి!**

## సినీవాలి -14 (18-1-2017)

మా ప్రశ్న: సినీఫీల్డులోకి వచ్చాక శ్రావణి తల్లి తన పేరుని ఏమని మార్చుకుంది?

మీ జవాబు-----------------------------------------------------------

చిరునామా-----------------------------------------------------------

--------------------------------------------------------------------

---------------------------పిన్-----------------------ఫోన్‌నెం-------------------

**ఈ కూపన్‌ను 17 జనవరి 2017 తేదీలోగా మా కార్యాలయానికి పంపగలరు.**

మా చిరునామా:నవ్య వీక్లీ, ఆంధ్రజ్యోతి బిల్డింగ్స్, ప్లాట్ నెం. 76, రోడ్ నెం 70, అశ్వనీ లే అవుట్, హుడా హైట్స్, జూబ్లీ హిల్స్, హైదరాబాద్-33



* నిబంధనలు వర్తిస్తాయి

నేను పరిగెత్తుకుంటూ వెళ్లి అమ్మను కౌగలించుకున్నాను. అప్పుడు, అమ్మతో వచ్చిన అంకుల్ నన్ను చూసి,

'పిల్ల పెద్దదయింది! ఏం పేరు పాపా!' అంటూ నన్ను దగ్గరకు తీసుకున్నాడు. నన్ను బలవంతంగా తన తొడమీద కూర్చోబెట్టుకుని నా బుగ్గలు పులిమాడు. నా ఒళ్లంతా తడుముతూ నా పెదాల పైన ముద్దు పెట్టుకున్నాడు.

అమ్మ ఒక్క ఉదుటున లేచి, నన్ను అతని దగ్గర నుంచి లాక్కొచ్చి రూములో పడేసింది. నాన్నను పిలిచి, 'బుద్ధుందా నీకు? మనిషివేనా? మెహతా ఫైనాన్షియర్ వచ్చాడు. వాడి సంగతి తెలుసు కదా! పసిపాపలను కూడా వదలడు. వాడొచ్చినప్పుడు పాపను లోపల కూర్చోబెట్టుకో వచ్చు కదా!' వాడి కంటపడకుండా చూసుకో వచ్చు కదా! అయ్యో... ఇప్పుడెలా, నా శ్రావణిని కాపాడ్డం ఎలా! నీయమ్మ, నీకు అస్సలు బుద్ధి లేదు' అంటూ తలకొట్టుకుంటూ ఏడ్చింది.

నేను భయంతో వణికిపోతూ చూస్తుండిపోయాను.

రెండు చేతులతో నెత్తి కొట్టుకుంటూ నాన్నను చూస్తూ ఏడ్చింది.

బైట నుంచి మళ్లీ మెహతా అమ్మను పిలిచాడు.

'వస్తున్నా, వస్తున్నా!' అంటూ అమ్మ ముఖం తుడుచుకుని, ముఖానికి నవ్వు పులుముకుంటూ వెళ్లింది.

అమ్మ అంత భయపడుతుంది కదా, ఏం జరుగుతుందోనని నాన్నా, నేనూ తలుపుచాటు నుంచి చూశాము.

మెహతా అంకుల్ 'ఆ పిల్ల ఎవరూ?' అని అడిగాడు.

"సాబ్! చిన్నపిల్ల సాబ్. వదిలేయండి. నేనున్నాను కదా!' అంది అమ్మ అతని బుగ్గలు పుణుకుతూ.

అమ్మను నెట్టేస్తూ, 'నువ్వెందుకే, ముసలిదానివి. బాగా పాతపడిపోయావ్! నీది బిడ్డ బాగుంది. పువ్వు పూయకముందే కోసేయాలి! నా టేస్ట్ నీకు తెలుసుకదా? దాన్ని పంపు. నాతోనే ఓపెనింగ్! నువ్వెంత అంటే అంత పంపిస్తా! మన నెక్స్ట్ సినిమాలో నీకే పెద్ద రోల్ ఇప్పిస్తా, ప్రొడ్యూసర్‌తో చెప్తా!' అన్నాడు.

'వద్దుసాబ్! దానికి పదేళ్లు కూడా లేవు సాబ్. పసికందు. దానికి ఆరోగ్యం కూడా బాగుండదు. ప్లీజ్‌సాబ్!' అన్నది అమ్మ ఏడుస్తూ.

మెహతా అంకుల్ ఒక్క నిమిషం ఏం మాట్లాడకుండా కూర్చుండి పోయాడు. తర్వాత లేచి, వంకరగా నవ్వుతూ, అమ్మను చూసి 'సరే మరి. వస్తా!' అన్నాడు.

'వద్దుసాబ్. మీరెళ్లొద్దు. నా కోసం వచ్చారు కదా! నేను కూర్చుంటా మీతో!'

'తేరీ...! మెహతానే కాదంటున్నావ్. చూస్కోవే. నీ బతుకేమవుతుందో. నువ్వు జమిందారీ వంశం నుంచి వచ్చావా? నీ మెరకవీధి భాగోతమంతా నాకీ తెల్సు! ఛినాల్!' అంటూ తూలుతూ వెళ్లిపోయాడు.

అమ్మ అతని కారు దగ్గరికి వెళ్లి బ్రతిమాలినా లాభం లేకపోయింది. అమ్మను నెట్టేసి తలుపులు వేసుకున్నాక కారు కదిలింది.

వాళ్లు నా గురించి ఏం మాట్లాడుకుంటున్నారో నాకు అర్థం కాలేదు. మెహతా అంకులేమో నన్ను కూర్చోమంటున్నాడు. అమ్మేమో నేనొద్దు తనే కూర్చుంటాననంటున్నది. అందుకే మెహతా అంకులికి కోపం వచ్చి వెళ్లిపోయాడు.

ఏడుస్తున్న అమ్మ దగ్గరికి వెళ్లి, 'అమ్మా! నేను మెహతా అంకుల్ దగ్గర కూర్చుంటానే, ఏడవకు!' అన్నాను.

అమ్మ నన్ను కౌగలించుకుని వెక్కివెక్కి ఏడ్చింది. ఏడ్చిఏడ్చి తరువాత కోపంతో నన్ను కొట్టి,

'ఇదంతా ఆ వెధవ మూలంగానే! వాడు కావాలనే నిన్ను మెహతా గాడి ముందుకు పంపాడు' అన్నది.

'ఎవరే నాన్నేనా?' అన్నాను అమాయకంగా, మెహతా అంకుల్ రాగానే, నాన్నే నన్ను అమ్మ దగ్గరకు పంపించిన విషయం గుర్తొచ్చింది.

'వాడు నాన్నేంటే దరిద్రపుదానా! వాడు నన్ను తార్చి ఆ డబ్బుతో తాగి తందనాలాడుతున్నాడు. ఇప్పుడు నిన్ను కూడా ఆ రొంపిలోకి దించాలని చూస్తున్నాడు. అయ్యో, చిన్నపిల్లవు కదే తల్లీ! నిన్ను ఆ భల్లూకంగాడు చూసేశాడే, నిన్ను మింగేస్తాడే!' అంటూ పిచ్చిపట్టినట్టుగా ఏడ్చింది.

'ఇంతదూరం వచ్చింది...ఈ ఊళ్లో నిన్ను వీడికి బలి ఇవ్వడానికేనా!' అంటూ పోర్టికోలోనే కిందపడి దొర్లుతూ పొగిలిపొగిలి దుఃఖించింది.

నాన్న భయం భయంగా దూరంగానే నిలబడ్డాడు.

కాసేపటికి, నాన్న గ్లాసులో విస్కీ తీసుకొచ్చి అమ్మకు ఇచ్చాడు. అమ్మ అది ఒక్క గుక్కలో తాగి లేచి నిలబడింది.

'దరిద్రుడా! నన్ను ముంచింది నువ్వేరా! నిన్ను నాన్న అని పిలుస్తోంది కదరా, బిడ్డలాంటి దాన్ని వాడికి తార్చడం పాపం కదరా! అయిపోయింది, మళ్లీ పాత బతుకే! పాతికకు, వందకు కొంగు పరవాల్సిందే. ఆ మెహతాగాడు నా మీద పగ పడతాడు. నన్ను నాశనం చేస్తాడు. ఫర్వాలేదు. కానీ, నా తల్లిని కాపాడుకుంటా..' అంటూ ఏదేదో అంటుంటే, అమ్మ వెనుక నుంచి వచ్చి నాన్న ఒక ఇంజెక్షన్ ఇచ్చాడు.

'పాపా! పారి పో, పాపా పారిపో! ఒరేయ్, దాన్నేమైనా చేశావో చంపేస్తా!' అని అంటూనే మత్తు ప్రభావంతో స్పృహ కోల్పోయింది.

భయపడుతున్న నన్ను నాన్న దగ్గరికి తీసుకున్నాడు. నన్ను ముద్దులతో ముంచెత్తాడు.

'పాపా! భయపడకు. నీకు నేనున్నా. అమ్మ పడుకుంది కదా! మనం స్కూటర్ మీద బైటకు పోయి ఐస్‌క్రీం తిందామా? తర్వాత ఎస్కులేటర్ ఎక్కుదాం' అన్నాడు నవ్వుతూ.

నేను 'సరే'నన్నాను.

మేము ఐస్‌క్రీం తిని ఇంటికొచ్చేసరికి, మేము వెళ్తున్నప్పుడు ఎలా పడివుందో, అమ్మ అలాగే పడివుంది. నాన్న కంగారుపడ్డాడు. వెంటనే వీధి చివరనున్న డాక్టరును తీసుకొచ్చి చూపించాడు. ఆయన అప్పటికప్పుడు రెండు ఇంజెక్షన్లు ఇచ్చి అమ్మకు తెలివి రప్పించాడు.

"మళ్లీ డ్రగ్స్ తీసుకుంటే మాత్రం ప్రాణానికే ప్రమాదం. ఇంట్లోనే ఉంచి ట్రీట్‌మెంట్ ఇప్పిస్తే, డ్రగ్స్ తీసుకోకుండా మీరు ఆమెను కంట్రోల్ చేయలేరు. ఏదైనా రీహాబిలిటేషన్ సెంటర్లో చేర్పించి డీ-అడిక్షన్ ట్రీట్‌మెంట్ ఇప్పించాల్సి ఉంటుంది" అని హెచ్చరించి వెళ్లిపోయాడు.

నాన్న కూడా కోపంతో 'రాజ్యం, హద్దు మీరుతున్నావు. నోటికెంతొస్తే అంతమాట అనేయడమేనా? నన్ను మనిషివేనా అని అంటావా?" అని అరిచాడు.

'ఏయ్ ఛత్ నోర్మూసుకో ముందు! ఆ మెహతాగాడి బారి నుంచి నా బిడ్డను ఎలా కాపాడుకోవాలోనని నేను ఏడుస్తుంటే నీకేం రోగమొచ్చింది' అంటూ నాన్న చొక్కా పట్టుకుంది.

నాన్న చొక్కా విడిపించుకుని, అమ్మను కొట్టాడు. అమ్మ నాన్నను కొట్టింది. ఇంతలో బైటనుండి 'భామా!' అంటూ మెహతా అంకుల్ పిలిచాడు.

'అయ్యో భగవంతుడా! నా బిడ్డను కాపాడేదెలా? వాడి చూపు పడ్డదంటే నా బిడ్డ నాశనమైపోతుంది. కాదంటే నేను నాశనమై పోతాను. వాడు పగబట్టిన తాచుపాములాంటివాడు. మనకు హైదరాబాదులో నిలువనీడ లేకుండా చేస్తాడు. ఒక్క అవకాశం రాకుండా కంటిచూపుతో శాసిస్తాడు. మళ్లీ మనం మన మకాం మెరకవీధికి మార్చాల్సిందే! చెత్తవెధవా! ఇదంతా నువ్వు చేయబట్టే. దాన్నెందుకు బైటకు రానిచ్చావ్?' అంటూ అమ్మ

**(ఇంకా వుంది)**



# హోమియోకేర్ ఇంటర్‌నేషనల్‌లో 'సంతానలేమి' లోపాలకు సరైన వైద్యం



డా. శ్రీకాంత్ మోర్లావర్
CMD
హోమియోకేర్ ఇంటర్‌నేషనల్

'సంతానలేమి'– ఇది నేటితరం దంపతులలో సాధారణంగా ఎక్కువ శాతం మందిని వేధిస్తున్న సమస్య. సంతానలేమి బాధితులు మానసికంగా చాలా క్రుంగిపోతూ, ఎవరితోనూ సరిగా కలవలేక తీవ్ర ఆందోళన చెందుతుంటారు. అయితే చాలా వరకు ఈ సంతానలేమి విషయంలో ఎక్కువగా స్త్రీలనే నిందించడం జరుగుతోంది. కానీ ఆయా లోపాలు తలెత్తటానికి గల వివిధ కారణాలు – స్త్రీలలో 33%, పురుషులలో 33% వరకు ఉండే అవకాశం ఉంది. ఇంతే కాకుండా ఎలాంటి కారణం లేకపోయినా కూడా 33% వరకు సంతానలేమి ఏర్పడే అవకాశం ఉంటుంది. అంటే స్త్రీ–పురుషులలో సంతానలేమి ప్రభావం సమాన స్థాయిలో ఉంటుందన్న విషయాన్ని ఇక్కడ మనం గమనించాలి. ఎలాంటి కారణం లేకుండా తలెత్తిన 'సంతానలేమి' సమస్యను వైద్య పరిభాషలో 'ఇడియోపతిక్ ఇన్‌ఫెర్టిలిటీ' అంటారు. ఈ సమస్యనుండి బయటపడేందుకు ఎన్ని వైద్యశాలల చుట్టూ తిరిగి – ఎన్ని రకాల మందులు వాడినా ఫలితం లభించక సతమతమవుతున్న చాలామంది దంపతులను నేడు మనం గమనించవచ్చు. కానీ హోమియో చికిత్స ద్వారా సంతానలేమి లోపాలను పూర్తిగా నయం చేసుకుని సంతానప్రాప్తి పొందే అవకాశం ఉంది.



**సంతానలేమి అనగా...**

ఆరోగ్యవంతులైన దంపతులు ఎలాంటి గర్భనిరోధక చర్యలు చేపట్టకుండా ఏడాది పాటు సాధారణ శృంగార జీవితం గడిపినా పిల్లలు కలగకపోవటాన్ని 'సంతానలేమి' అంటారు.

**సంతానలేమి 2 రకాలు. (1). ప్రైమరీ ఇన్‌ఫెర్టిలిటీ:** స్త్రీలు, తమ వివాహానంతరం ఒక సంవత్సరం పాటు సాధారణ లైంగిక జీవితం గడిపినా గర్భం దాల్చకపోవటం. **(2). సెకండరీ ఇన్‌ఫెర్టిలిటీ:** ఒకసారి గర్భం దాల్చి సంతానం కలగటం లేదా గర్భస్రావం జరగటంతో 2వ సారి సంతానం కలగక పోవడం.

### పురుషులలో 'సంతానలేమి'కి గల కారణాలు:

- **అజూస్పెర్మియా:** శుక్రకణాలు పూర్తిగా లేకపోవడం.
- **అలిగోస్పెర్మియా:** శుక్రకణాలు తక్కువగా ఉత్పత్తి కావడం.
- **అస్తినోస్పెర్మియా:** శుక్రకణాలు ఉత్పత్తి అయినప్పటికీ వాటి కదలికలు సాధారణంగా లేకపోవడం.
- **టెరటోస్పెర్మియా:** శుక్రకణాలలో నిర్మాణపరమైన తేడాలు ఉండటం.
- **వెరికోసిల్:** వృషణాలలో ఉండే రక్తనాళాలు వాపునకు గురికావడం వలన శుక్రకణాల ఉత్పత్తి తగ్గిపోవడం.
- **హైడ్రోసిల్:** వృషణాలు ఉండే తిత్తిలో నీరు చేరడం.
- వృషణాలు శోథమునకు గురికావటం, వృషణాలకు అధిక వేడి తగలడం, అంగస్థంభన, శీఘ్రస్కలనం వంటి లైంగిక సమస్యలు.
- పిట్యుటరీ, థైరాయిడ్. టెస్టోస్టిరాన్ హార్మోన్‌ల అసమతుల్యత.
- అధిక బరువు, మధుమేహం, పొగత్రాగటం మరియు జన్యుపరమైన అంశాలన్నింటినీ 'సంతానలేమి' సమస్యకు గల కారణాలుగా చెప్పవచ్చు.

### స్త్రీలలో 'సంతానలేమి'కి గల కారణాలు:

- గర్భసంచి చిన్నదిగా ఉండటం లేదా గర్భసంచి లేకపోవడం.
- గర్భసంచి నిర్మాణంలో లోపాలు ఉండటం, గర్భసంచిలో కణితులు ఏర్పడటం, ఎండోమెట్రియోసిస్.
- ఫెలోపియన్ ట్యూబ్స్ లేకపోవడం, ట్యూబ్స్ మూసుకుపోవడం.
- అండాశయ లోపాలు, అండాశయంలో సరైన ఎదుగుదల లేకపోవడం.
- అండాశయంలో త్వరితగతిన అండం యొక్క విడుదల విఫలం కావడం (Premature Ovarious failure)
- యోని చిన్నదిగా ఉండటం, యోని మార్గం మూసుకుపోవడం.
- యోని మార్గంలో ఉండే మ్యూకస్ పొర శుక్రకణాలు ఈదటానికి అనువుగా లేకపోవడం.
- యోని అధిక ఆమ్లగుణం కలిగి ఉండటం వలన శుక్రకణాలు చనిపోవటం.
- **హార్మోన్ సమస్యలు:** హైపో మరియు హైపర్‌థైరాయిడిజమ్, పి.సి.ఓ.డి., F.S.H., L.H., ప్రొలాక్టిన్ హార్మోన్‌ల అసమతుల్యత వంటి అంశాలన్నీ 'సంతానలేమి'కి కారణాలు అవుతాయి.

**'సంతానలేమి' నిర్ధారణ పరీక్షలు: పురుషులలో:** కంప్లీట్ సెమెన్ ఎనాలిసిస్, యూ.ఎస్.జి. అబ్డమిన్, మరియు స్క్రోటమ్, సీరమ్ టెస్టోస్టిరాన్, థైరాయిడ్ ప్రొఫైల్, ఎఫ్.ఎస్.హెచ్., ఎల్.హెచ్., టెస్టిక్యులార్ బయాప్సీ, సి.బి.పి., ఇ.ఎస్.ఆర్., మరియు సి.యూ.ఇ. మొదలైనవి.
**స్త్రీలలో:** ఎఫ్.ఎస్.హెచ్., ఎల్.హెచ్., సీరమ్ ప్రొలాక్టిన్, థైరాయిడ్ ప్రొఫైల్, యూ.ఎస్.జి. అబ్డమిన్,. హెచ్.ఎస్.జి., లాప్రోస్కోపీ, ఫాలిక్యులార్ స్టడీ, సి.బి.పి., ఇ.ఎస్.ఆర్. మరియు సి.యూ.ఇ. మొదలగు పరీక్షలను చేయించటం ద్వారా సంతానలేమి సమస్యను నిర్ధారించవచ్చు.

**హోమియోకేర్ ఇంటర్‌నేషనల్ వైద్యం:** కేవలం 'హోమియోకేర్ ఇంటర్‌నేషనల్'లో మాత్రమే అందించబడే అధునాతనమైన జెనెటిక్ కాన్స్‌టిట్యూషనల్ వైద్యవిధానం ద్వారా, చాలావరకు – స్త్రీలు మరియు పురుషుల 'సంతానలేమి' లోపాలు సరికావటం, తద్వారా వారు సంతానప్రాప్తి పొందటం జరుగుతోంది. రోగి యొక్క మానసిక మరియు శారీరక లక్షణాలకు అనుగుణమైన మరియు రోగి తత్వానికి సరిపడిన ఔషధాలతో జరుపబడే అత్యంత సమర్థవంతమైన చికిత్స మేరకు సంతానలేమి సమస్యను అధిగమించటం సాధ్యపడుతుంది. తద్వారా సంతానప్రాప్తికి మార్గం సుగమం అవుతుంది.




**(కొత్త శీర్షిక ప్రారంభం)**

# ఆ ఊళ్లో ఓ పెళ్లి!

**"ఆ అబ్బాయి మన ఊళ్లోనే తొమ్మిదిమంది అమ్మాయిల ఫోటోలు చూశాడు. నచ్చని అమ్మాయిలేదు. అందరూ అబ్బాయిని మెచ్చారు. ఎక్కడా మంగళవాద్యాలు మోగలేదు" అంది గరిమనాభి.**

**"కారణమేమయుంటుందో" సందేహ దేహాన్ని కదిలించాడు మంగళగిరి.**

**"మీకు తెలియని వాళ్లెవరు. వెళ్లి సంగతేంటో కనుక్కురండి".**

"అదేదో మనంతట మనమే కనుక్కుందాం"

"ఏమిటి, మీరనేది?"

"అనేదేముంది. మనమ్మాయిని కూడా చూడడానికి రమ్మందాం. తనూలతికను అవతారపురుషకు యిచ్చి మేం జరుపబోవు..".

"అప్పుడే వెడ్డింగు కార్డులు వేయకండీ".

"అబ్బాయిని, ఎక్కడనుంచైనా తొంగిచూసే అవకాశం నీకు రాలేదాని".

"అదంతా ఒకళ్లకు తెలియకుండా ఒకళ్లు, జరిపిన తతంగంలెండి".

"మనం కూడా అదేకోవలో వెళదాం" అన్నాడు మంగళగిరి.

●●●

అందరూ కూడగట్టుకుని కట్టుకున్న ఇళ్లతో ఊరైన ఊరది! ఆ ఊరికి ఓ ప్రత్యేక నియమం ఉంది. ఏ ఇంటి కొలతలోనైనా, అరయించి తేడావచ్చినా ఊరువదిలి పెట్టాల్సిందే! గట్టి కట్టడి! మంగళగిరి కూతురికి పెళ్ళికొడుకు బాగానచ్చాడు. దాంతో అబ్బాయి రవంత ఎక్కువలో ఉన్నాడు. పెళ్ళిచేసినా, చేయకపోయినా, ఆ అబ్బాయి ఎక్కడికంటే అక్కడికి నేను వెళ్లిపోతా అంది తనూలతిక. అనడం పెద్దలతో అంటే ఇంకోరకంగా ఉండేది. ఆ సంగతి అబ్బాయి గుండెల మీద రాసింది!

అబ్బాయి తలవంచని వీరుడు అన్నసంగతి ముందేతెలిస్తే ముందడుగు వేసేవాడు కాడు మంగళగిరి. అత్తగారింట్లో ఎంతకాలమని ఉంటావు. ఉన్న కొద్దిసేపు తలవంచుకో నాయనా అని తెగించి చెప్పారు.

అత్తగారింట్లో అసలే వంచను అని అబ్బాయి తెగించాడు.

ఇంటికొలతలు మార్చకుండా పెళ్ళయ్యేపని అయ్యేట్లు లేదు. అదే అనివార్యమైతే ఇల్లు కూలగొట్టి మళ్లీ కట్టాల్సిందే! ఎలా? ఎలా?

'దాందేముంది ఊరు వదిలి వెళ్లిపోదాం" అంది కూతురు.

●●●

ఊళ్లో పెద్దలందరినీ సమావేశపరిచాడు. సమస్యను అందరి ముందూ ఉంచాడు. "నీ ఊహ మాకు రాలేదనుకున్నావా? మా తలలు బొప్పికట్టలేదనుకున్నావా? ఉంటావో, ఊడుతావో నీ ఇష్టం" అన్నారు పెద్దలు. పైగా విలువైన సమయాన్ని వృథా చేసినందుకు నష్టపరిహారం అయిదులక్షలన్నారు. ఎవరి పనులు ఏ విధంగా దెబ్బతిన్నాయో లెక్కగట్టి చెప్పారు. లేనిపక్షంలో ఊళ్లో ఇళ్లన్నీ, సవరించిన కొలతలతో, కూలగొట్టి మళ్లీ కట్టాల్సిందే ఆ ఖర్చు మంగళగిరి భరించాల్సిందే! "ఆ పరిస్థితే వస్తే అబ్బాయి మొదట చూసింది మా అమ్మాయిని, మా అమ్మాయినే పెళ్లి చేసుకోవాలి" అన్నాడు మొదట తండ్రి.

వారం రోజులు గడువు అడిగి ఆలోచించుకునే వెసులుబాటు కలిగిందని ఊపిరి పీల్చుకున్నాడు మంగళగిరి!

●●●

పెళ్ళిళ్ళ పేరయ్యగారు, ఒంట్లో శక్తి ఉడిగి కాలూ చేయీ కదల్చలేక గదిలోనుంచి బైటికిరాలేకపోవడంతో ఆయన కొడుకు మాఘమాసం మంత్రముగ్ధ, తండ్రి చెప్పుచేతల్లో, తండ్రి చెప్పుల్లో కాళ్లు పెట్టాడు. పెళ్ళి చేసుకునే తీరిక లేకుండా పెళ్ళిళ్ళు కుదిర్చే పనిలో పడ్డాడు.

ఈ రోజుల్లో ఎవరికైనా ఒక్క టాలెంటు ఉంటే సరిపోదు. అదనంగా రెండు మూడు కళలుండాల్సిందే అనే ఆలోచన, ఆచరణ ఉన్నవాడు కాబట్టి పెళ్లిమంత్రాలు నేర్చుకున్నాడు. పెళ్లి వంటలూ చేయగలడు, పెళ్లిపీటలే కాదు. పెళ్లి పందిర్లూ వేయగలడు అనే పేరు తెచ్చుకున్నాడు. టెంట్‌హౌస్ కూడా మంత్రముగ్ధ ఊహలో లేకపోలేదు!

"ఏవండీ! మంత్రముగ్ధ గారూ. ఇలాగైతే మా ఊళ్లో అమ్మాయిల పెళ్లిళ్లు అయ్యేదెలా?!" తన వేదన విన్నవించాడు మంగళగిరి.

"అంతమాటనకండి, వాచాదోషం! అందరు పెళ్లి కొడుకులూ ఏడడుగులు ఉంటారంటారా, ఏడడుగులు వేయనంటానంటారా! ఎక్కడనుంచి తెచ్చారండీ ఈ ఏడడుగుల అవతార పురుషుణ్ణి" అన్నాడు మంత్రముగ్ధ.

"లేదండీ ఆయనే వచ్చాడు. వెంట సమస్యను తెచ్చాడు. పెళ్ళిచూపుల్లో తలవంచినవాడు పెళ్లయితే వంచనంటున్నాడు" అన్నాడు మంగళగిరి.

"మీ వారం రోజులయిపోవస్తున్నాయి. ఏ నిర్ణయం తీసుకున్నారేం" అన్నాడు మంత్రముగ్ధ.

"ఏముంది ఊరొదిలి వెళ్లిపోవడమే!" చెప్పాడు మంగళగిరి.

"అంత మాటనకండి, వాచాదోషం" అన్నాడు మంత్రముగ్ధ.

"లేకపోతే, తలవంచని ఏడడుగుల పెళ్లి కొడుకుల్ని, ఏడు సముద్రాలూ దాటైనా వెతికి పట్టుకురావాలి".

"అంతమాటనకండి, వాచాదోషం"

"మీ వాచాదోషం చల్లగుండ! వాస్తుదోషం. అన్నా బాగుండు, సమస్యకు పరిష్కారం దొరికేది" అన్నాడు మంగళగిరి.

"దానికంటే ఇంకో పెద్ద సమస్యవచ్చి పడిందండీ" అన్నాడు మంత్రముగ్ధ పంచాంగంలో పేజీలు వెనక్కు ముందుకు తిప్పుతూ, అరచేతిలో గీతలేవో లెక్కపెడుతూ.

"కొంపదీసి జాతకాలు కలవడం లేదంటారా, ఏం!"

"అది దివ్యంగానే ఉందండీ!"

"మరేంటండీ".

"ఇంకో నెల రోజుల్లోనే అద్భుతమైన, బ్రహ్మాండమైన లగ్నం ఉంది. అది అరవయ్యేళ్లకు ఒకసారి వస్తుంది!" చెప్పాడు మంత్రముగ్ధ.

"ఎట్టిపరిస్థితుల్లో మా అమ్మాయిపెళ్ళి ఆ లగ్నానికే జరగాలి, మీరు జరిపించాలి" అన్నాడు మంగళగిరి.

"ఈ ఊళ్లో నవవధువుల తండ్రులూ అదేమాట అంటున్నారండీ" అన్నాడు మంత్రముగ్ధ గాల్లోకి చూస్తూ.

"పెళ్ళికొడుకు పొడుగు తగ్గించడానికి ఏదన్నా ఉపాయం ఉందంటారా" మధ్యలో ఏదో గొప్ప ఊహ వచ్చిందాన్లాగా వచ్చి అడిగింది గరిమనాభి!

"రెండురోజుల్లో నీవు లావుతగ్గిరా, కాబోయే అల్లుడుగారి పొడుగు సంగతి నేను ఆలోచిస్తా" అన్నాడు మంగళగిరి.

"తొమ్మిది మంది కన్యలకు సంబంధాలు కుదర్చాలి! ఒకే లగ్నంలో అందరి పెళ్ళిళ్ళు నేనొక్కణ్ణే చేయలేను కాబట్టి అంతమంది బ్రాహ్మలను వెతకాలి. అదీగాక మాఊళ్లో కొత్త ఇల్లు కడుతున్నాను.

**తనూలతికకు అవతారపురుషుడు తెగ నచ్చేశాడు. ఇక పెళ్ళి తప్పదనుకున్నారు ఆమె తల్లిదండ్రులు గరిమనాభి, మంగళగిరి. కానీ ఆ ఊళ్లో కట్టుబాటును ఉల్లంఘించే వీల్లేదెవరికీ. ఆ రీత్యా చూస్తే పెళ్ళి జరిగేట్టే లేదు! పెళ్ళి జరగాలంటే ఇల్లు కూల్చాల్సిందే! లేదా ఊరొదిలి పోవాల్సిందే!! ఇల్లుకట్టిచూడు,పెళ్ళి చేసిచూడు అంటారే! మరి ఈ పితలాటకమేంటి? ఇక వారం వారం చదువుకోండి రాంపా సరదా కథలు..!**

అది పూర్తిచేయాలి. ఆ సమస్యకు పరిష్కారం నేను ఆలోచిస్తుంటే మీరు లావులు, పొడుగుల కొలతలు గురించి మాట్లాడితే ఎలా" అన్నాడు మంత్రముగ్ధ.

"నా బుర్ర కదలబట్టేగా అంతరాయం కలిగింది" అంటూ వెళ్లింది గరిమనాభి. "వెళ్లి బూజుదులుపుకో" అన్నాడు మంగళగిరి.

"నాకేమనిపిస్తోందంటే..." అన్నాడు మంత్రముగ్ధ.

"అనిపించింది చెప్పేముందు, నా మాటవినండి, మీరు కట్టే ఇల్లు పెద్ద ద్వారాలతో కట్టిస్తే, ఈ ఇంట్లోకి మీరు, ఆ ఇంట్లోకి మేమూ మారితే సమస్య తీరినట్లేగా" అన్నాడు మంగళగిరి.

"నేను కట్టే ఇంట్లోకి నేను దూరితేనే నాకు వివాహయోగం ఉందండీ. అందుకని ఆ ఆలోచన వదిలేయండి"

"మంత్రముగ్ధగారూ, ఈ లగ్నానికే తనూలతిక, అవతార పురుష మధ్య బ్రహ్మముడి పడాల్సిందే! అల్లుడయింతరువాత కదా తలవంచడం, దించడం. ఆ సంగతి పెళ్ళయింతరువాత మా అమ్మాయి చూసుకుంటుంది" వంటింటి కిటికీలోంచి అరిచి చెప్పింది గరిమనాభి.

●●●

ఏం మాయచేశాడో, ఏం మంత్రం వేశాడో గానీ, తొమ్మిదిమంది వధువులకీ వరుళ్లని సిద్ధం చేశాడు. ఆ ఊళ్లో పెద్ద కల్యాణ మంటపంలో సామూహిక వివాహాలకు అందరినీ సమాయత్త పరిచాడు. మూడో ముడివేసి లేచి నించుని మెడ సవరించుకున్నాడు అవతారపురుష. అదిచూసి గుభేల్‌మన్నాడు మంగళగిరి. గాభరాపడకండి అని భర్త గుండె నిమిరింది గరిమనాభి.

మంగళగిరి వియ్యంకుడి చెవిలో విన్నపంగా అడిగాడు. "అల్లుడుగారు పట్టు ఎప్పటినుంచి పడతారు" అని.

"పట్టు కట్టే వేడుక ఇప్పుడుకాదులెండీ" అన్నాడు వియ్యంకుడు.

"నేననే పట్టు మీరనేట్టు ఒకటి కాదండీ" అన్నాడు మంగళగిరి.

"మీరేం ఆందోళన చెందకండీ, అదంతా వాళ్లిద్దర్నీ గదిలోకి పంపించింతరువాత, తీరిగ్గా మాట్లాడుదాం. ఆనందంగా ఉండండి" అన్నాడు వియ్యంకుడు.

●●●

పెళ్ళిళ్ళు ముచ్చటగా జరిగాయి. ఆ తర్వాత్తర్వాతలు ముద్దులుగా ముగిశాయి. నవ్వుల పువ్వులు వికసించి, విరబూసి విందు చేశాయి. అన్ని పందిళ్లలో చిన్నచిన్న మైకులుపెట్టి, పెళ్ళితంతు సక్రమంగా జరిగేట్లు చూసిన, చేసిన మంత్రముగ్ధ ఏర్పాట్లను అందరూ మెచ్చుకున్నారు.

వచ్చే సంక్రాంతికి మా ఊళ్లో సంబరాలు అంబరాలు తాకేట్లుగా చేస్తాం! అల్లుళ్లందరూ తప్పకుండా పండగ పదిరోజులూ ఉండాలి అని పెద్దలు అన్నారు. అందరూ సంతోషంగా ఒప్పుకున్నారు.

ఆ హడావిడిలో అవతారపురుష ఏమన్నాడో మంగళగిరికి వినిపించలేదు!

●●●

అమ్మాయిని అల్లుడితో పంపిస్తున్నారు. చక్కిల గింతలొకపక్క, అప్పగింతలొకపక్క అన్నట్లుగా ఉంది. తనూలతికను కన్నవాళ్ల కళ్లు తడిపేస్తున్నాయి. వియ్యంకుడి అభయాలు తడిని తుడుస్తున్నాయి. వియ్యంకుడు మంగళగిరికి ఆనందకౌగిలి ఇచ్చాడు.



"పట్టుసంగతి" అని వియ్యంకుడి చెవిలో దీనంగా శబ్దం చేశాడు మంగళగిరి.

"ఓహో! అదా! పట్టులేదు. గిట్టులేదు. తల వంచకపోవడమేంటి? వాడికేమన్నా మెడనొప్పా, నడుం నొప్పా? చూడండి. కారులోకి ఎంత అవలీలగా వంగు తున్నాడో" అన్నాడు వియ్యంకుడు.

మంగళగిరి ముఖంలో ఏదో తెలియని దీనత్వం అలాగే ఉంది.

"మామయ్యగారూ వెళ్లొస్తాం" అని అల్లుడనడంతో ముఖం వికసించింది. "నాన్నా ఏం గాభరాపడకండి" అంది కూతురు.

●●●

"ఇంకా నా మనసులో ఏదో గుబులు, గుబులుగానే ఉందోయ్" అన్నాడు మంగళగిరి. అప్పుడు చెప్పింది గరిమనాభి.

"అల్లుడు గారికి నిజంగా నచ్చింది మనమ్మాయేట" అని.

'ఆ తొమ్మిది మందికీ నచ్చారనే చెప్పాడన్నావుగా".

"నచ్చలేదనిచెప్పి, సున్నితమైన మనసుల్ని ఇబ్బంది పెట్టలేక పట్టు బైటపెట్టాట్ట".

"మరైతే మన మీద కూడా పట్టెందుకు పెట్టాట్ట".

"పట్టువిడుపు సంగతి అమ్మాయికీ, నాకూ ముందే తెలుసు".

'ఆc! పద నిన్ను మంగళగిరి తీసికెళ్తా"

"దేనికండీ.."

"పానకం నోట్లో పోయడానికి!"




# సేఫ్ జర్నీకి కేరాఫ్ అడ్రస్ ఉమెన్ క్యాబ్ డ్రైవర్స్

**అనిత ఆఫీసు నుంచి బైటపడేసరికి రాత్రి పది అయింది. ఆ రోజే ఆలస్యమైంది. ఏ ఆటో అయినా, క్యాబ్ అయినా ఎక్కి త్వరగా ఇంటికి వెళ్లాలని మనసులో ఉన్నా, అర్ధరాత్రి మహిళల మీద జరిగిన, జరుగుతున్న అత్యాచారాలు గుర్తుకొచ్చి వణికి పోయింది. అయినా తప్పదు. ఈ టైములో క్యాబ్ తప్ప మరో గత్యంతరం లేదు అనుకుంటూ ఎదురుగా వస్తున్న ఓ క్యాబ్‌ను ధైర్యం చేసి ఆపింది. దగ్గరకి వచ్చాక స్టీరింగ్ సీట్లో కూచున్న వ్యక్తిని చూసేసరికి అనితకి ఎక్కడలేని ధైర్యమూ వచ్చేసింది. అనితకి అంత ధైర్యం ఇచ్చిన ఆ వ్యక్తి లేడీ డ్రైవర్. అవును. మహిళల కోసం క్యాబ్ నడిపే మహిళా డ్రైవర్ ఆమె. ఇలా రాత్రి ఎంత సమయం గడిచినా క్యాబ్ డ్రైవ్ చేసే మహిళలు ఎందరో. ఈ మహిళల జీవితాల్లోనూ రహదారిలానే ఎన్నో ఎత్తుపల్లాలు. వాటన్నింటినీ అధిగమిస్తూ మొక్కవోని ధైర్యంతో అర్ధరాత్రి సమయంలో క్యాబ్ సర్వీసులను అందిస్తున్న కొంతమంది మహిళా క్యాబ్ డ్రైవర్ల గురించి....**

### జీవితంలో తీసుకున్న గొప్ప నిర్ణయం
### -షబానా షేక్ అమిన్

పేరు వినగానే ముస్లిం అమ్మాయని వెంటనే తెలిసిపోతుంది. ముస్లిం మహిళలకు ఎన్నో కట్టుబాట్లు, ఎన్నో ఆంక్షలు. వీటి మధ్య షబానా క్యాబ్ డ్రైవర్‌గా మారిన వైనం వింటే కళ్లు చెమర్చక మానవు. చదువుకునే వయస్సులోనే ఇంటి బాధ్యతలు మోయవలసి వచ్చింది. దానికి తోడు తల్లి అనారోగ్యం. కనీస అవసరాలకు కూడా డబ్బులు ఉండేవి కావు. ఆ సమయంలో ఎవరిని అడిగినా లేవని చెప్పేవారే తప్ప సహాయం చేసేవారు లేరు. పైపెచ్చు అయినవాళ్లు, బంధువులు అందరూ ఆ కుటుంబాన్ని చూసి తప్పించుకు తిరిగేవారు. అలాంటి పరిస్థితుల్లో చదువుకు స్వస్తి పలికి చిన్న ఉద్యోగంలో చేరింది షబానా. అలా చిన్నాచితకా ఉద్యోగాలు చాలా చేసినా కనీస అవసరాలు కూడా తీరేవి కావు. తెలిసిన వారి సలహా మేరకు డ్రైవింగ్ స్కూల్లో చేరింది. మూడు నెలల శిక్షణ, దానితో పాటు ఆత్మరక్షణ విద్యలు కూడా నేర్చుకుంది. శిక్షణ పూర్తయ్యేసరికి క్యాబ్‌డ్రైవర్‌గా ఆఫర్ లెటర్ చేతికి వచ్చేసింది. మంచి జీతం... వదులుకోవాలని అనిపించలేదు. దాంతో ధైర్యం చేసి ఇంట్లో చెప్పింది. షరా మామూలే! ఆడ పిల్లవు క్యాబ్ డ్రైవర్‌గా ఎలా పని చేస్తావు? అంటూ ఆంక్షలు పెట్టబోయారు. వారం దరికి నచ్చచెప్పి చివరికి ఉద్యోగంలో చేరింది. ఈ ఉద్యోగం షబానాకు బాగా కలిసి వచ్చింది. ఆర్థిక సమస్యలు నెమ్మదిగా తగ్గసాగాయి. సొంతంగా ఓ కారు కొనుక్కునే స్థాయికి చేరింది షబానా. అప్పుడు షబానాను విమర్శించినవారే ఇప్పుడు

ఆమెను మెచ్చుకుంటున్నారు. ఈ ఉద్యోగం తనకు ఆర్థిక స్వావలంబనతో పాటు గౌరవాన్ని కూడా ఇచ్చింది అంటోంది షబానా. రాత్రి సమయాలలో ఎయిర్‌పోర్టులో ప్రయాణికులను ఎక్కించుకుని గమ్యస్థానాలకు జాగ్రత్తగా చేరుస్తుంది. ఈ ఉద్యోగంలో చేరిన కొత్తలో ప్రయాణికులు కూడా కొంత అమర్యాదగా మాట్లాడినా, ఇప్పుడు అందరూ తనను ఎంతో గౌరవిస్తున్నారని చెబుతోంది షబానా.

### జీవితాన్ని మార్చిన స్టీరింగ్ - పింకీ రాణి

హర్యానాకి చెందిన పింకీ రాణిది మరొక సమస్య. చిన్నతనంలోనే పెళ్లి అయింది. భర్త ఓ షాపుకు యజమాని. షాపులోకి కావలసిన వస్తువులన్నీ తీసుకురావడం పింకీ మీద పడింది. సామాన్ల కోసం ఓ వాహనం ఉంటే బాగుంటుందన్న ఉద్దేశంతో భర్తను అతి కష్టంమీద ఒప్పించి కారు కొనిపించింది. కారు లైసెన్సు తీసుకుని తనే కారులో వెళ్లి కావలసిన వస్తువులన్నీ తీసుకొచ్చేది. అంతా సవ్యంగా సాగిపోతోందని సంతోషపడుతున్న సమయంలో భర్తకు తీవ్ర అనారోగ్యం. లక్షల్లో డబ్బు ఖర్చు అయ్యేది. అయినా వెనకాడకుండా భర్తకు వైద్యం చేయించేది. ఆ సమయంలో భర్త ఉన్నట్టుండి ఇంట్లోంచి మాయమైపోయాడు. భర్త ఏమయ్యాడో తెలియకపోగా, అప్పటివరకూ వైద్యానికి డబ్బులు ఇచ్చినవారు ఒత్తిడి తెచ్చారు. అత్తమామలు తమకు సంబంధం లేనట్టే ఉండిపోయారు. దాంతో కారు అమ్మేసి కొన్ని అప్పులు మాత్రం తీర్చింది. మిగతా అప్పులు, ముగ్గురు పిల్లల్ని ఎలా నెట్టుకు రావాలి? అన్న ఆలోచనలో ఉండగా క్యాబ్ డ్రైవర్ల ఖాళీల గురించి తెలుసుకుని వెళ్లి ఆ ఉద్యోగంలో చేరింది. పగలు రాత్రి అన్న తేడా లేకుండా డ్యూటీ చేస్తూనే ఉంటుంది. ఇప్పుడు అప్పులన్నీ తీర్చేసి ఆర్థికంగా నిలదొక్కుకుంది పింకీ రాణి.

### ఈ గుర్తింపు సంతోషంగా ఉంది - గంగ

ఆంధ్రప్రదేశ్ నుంచి బెంగళూరు వచ్చింది గంగ. బీకామ్ వరకూ చదివిన గంగ ప్రారంభంలో టీచరుగా పనిచేసింది. భర్తకు మంచి ఉద్యోగం. కానీ తాగుడు కారణంగా ఇంటికి నయాపైసా వచ్చేది కాదు. టీచరుగా వచ్చే జీతం సరిపోయేది కాదు. ఆ సమయంలో క్యాబ్ డ్రైవర్ల ప్రకటన గంగను ఆకర్షించింది. ఆమె భర్తకు ఆ ఉద్యోగం ఇష్టం లేదు. భర్త ఇష్టాయిష్టాలు పట్టించుకోకుండా గంగ డ్రైవరుగా మారింది. ప్రారంభంలో డబ్బులు తక్కువే వచ్చినా ఇప్పుడు సంపాదన బాగా ఉందని సంతోషపడుతోంది గంగ. అంతే కాకుండా మొదట్లో డ్రైవింగ్ సీట్లో గంగను చూసి ప్రయాణికులే వెనుకంజ వేసేవారట! కానీ నా డ్రైవింగ్ రేటింగ్ చూసి ఇప్పుడు అందరూ నా క్యాబ్‌నే ఎక్కువగా కోరుకుంటున్నారు. ఈ గుర్తింపు చాలా సంతోషాన్ని ఇస్తోంది అని చెబుతోంది గంగ.

### భర్త సపోర్ట్‌తో... మధు వర్మ

డ్రైవింగ్‌ను వృత్తిగా తీసుకుంటానంటే ముందు అభ్యంతరం పెట్టేది భర్త, అత్తమామలే! కానీ మధువర్మ విషయంలో మాత్రం రివర్స్ అయింది. ఆమె పుట్టింటివారు తీవ్రంగా వ్యతిరేకించగా భర్త మాత్రం పూర్తి సహకారం అందించడం విశేషం. తన భర్త సహకారంతోనే రాత్రి సమయంలో కూడా డ్యూటీ చేయగలుగుతున్నానని చెబుతోంది మధువర్మ. తను డ్యూటీలో ఉండగా ఇంటి బాధ్యత తన భర్తే చూసుకుంటారనీ అంటోంది. ఢిల్లీలో ట్రాఫిక్‌కి మొదట కంగారుపడినా ఇప్పుడు బాగా అలవాటు పడ్డానని చెబుతోంది. రాత్రి షిఫ్టుల్లో పనిచేసే మహిళా ఉద్యోగినులను, ఎయిర్‌పోర్టు నుంచి ప్రయాణికులను ఎక్కువగా వారి గమ్యస్థానాలకు చేరుస్తానని వివరిస్తోంది. ప్రారంభంలో కొద్దిగా తక్కువ వచ్చినా ఇప్పుడు ఆదాయం బాగా ఉందని సంతృప్తిని వ్యక్తం చేస్తోంది.

### మనసు పెడితే ఏదైనా సాధ్యమే - భారతి

ఆంధ్రప్రదేశ్‌లోని ఒంగోలు నుంచి ఉద్యోగం కోసం బెంగళూరు వెళ్ళిన విరాత్ భారతి క్యాబ్ డ్రైవర్‌ని అవుతానని ఎప్పుడూ అనుకోలేదట! బెంగళూరుకు వచ్చిన కొత్తలో టైలరింగ్ పని చేసినా, ఆదాయం అస్సలు సరిపోయేది కాదు. దాంతో భారతి ఎక్కువ ఆదాయమార్గాలవైపు దృష్టి సారించింది. తన చదువుకు తగిన ఉద్యోగం, మంచి ఆదాయం కావాలంటే క్యాబ్ డ్రైవర్ బెస్ట్ జాబ్ అని డిసైడ్ అయింది. ఆలస్యం చేయకుండా డ్రైవింగ్ లైసెన్స్ సంపాదించింది. ఉబర్‌లో చేరడానికి ముందు చిన్న చిన్న కంపెనీలలో చేసింది. భారతి డ్రైవర్‌గా చేస్తోందని తెలిసి చాలామంది తెలిసినవాళ్లు ఆమెను వెనక్కు లాగడానికి ప్రయత్నించారు. మగవారికి మాత్రమే పరిమితమైన రంగమనీ, మగవారితో సమానంగా ట్రాఫిక్‌లో కారు డ్రైవ్ చేయడం అంత ఈజీ కాదనీ అనేక విధాలుగా ఆమెను భయపెట్టడానికి ప్రయత్నించారు. మనసు పెడితే ఏదీ అసాధ్యంకాదు అన్నది భారతి అభిప్రాయం. ఆమె నమ్మకమే నిజమైంది. ఇప్పుడు మగవారికన్నా బెటర్‌గా డ్రైవ్ చేస్తుందనే పేరును సంపాదించుకుంది.

### ఎప్పుడూ ఊహించలేదు - షన్ను బేగం

క్యాబ్ డ్రైవర్‌గా మారతానని ఢిల్లీకి చెందిన షన్ను బేగం కల్లో కూడా అనుకోలేదు. ఒంటిచేత్తో కుటుంబాన్ని నడపడానికి షన్ను చేయని పనంటూ లేదు. అయితే అవేవీ ఆమె కుటుంబానికి సరిపడా ఆదాయాన్ని ఇచ్చేవికావు. అధిక ఆదాయ మార్గాల కోసం అన్వేషిస్తున్న సమయంలో క్యాబ్ డ్రైవర్ ఉద్యోగం ఆమెను ఆకర్షించింది. ఢిల్లీలో మహిళలకు ఉచితంగా కారు నేర్పించే సంస్థలో చేరి ఆరు నెలల్లోనే లైసెన్సు సంపాదించింది. ఆ తరువాత చిన్న చిన్న కంపెనీలలో పనిచేసినా, ఢిల్లీలో ఏర్పాటైన 'సఖ'లో క్యాబ్ డ్రైవర్‌గా ఉద్యోగం సంపాదించింది. వంట చేయడం, ఇంటిని సర్దుకోవడం మాత్రమే తెలుసు. గతంలో ఎవరూ నన్ను పెద్దగా గౌరవించేవారు కాదు. కారణం పెద్దగా చదువుకోకపోవడమే. కానీ క్యాబ్ డ్రైవర్‌గా చేరిన తరువాత అందరూ నన్ను ఎంతో గౌరవిస్తున్నారు. ఆర్థికంగా ఎవరిమీదా ఆధారపడాల్సిన పరిస్థితి ఇప్పుడు లేదు. నాలాంటి వారు ఎందరో ఇప్పుడు డ్రైవింగ్ నేర్చుకుని క్యాబ్ డ్రైవర్‌గా స్థిరపడ్డారు, పడుతున్నారు కూడా! అందరికీ ఒకటే సమస్య కుటుంబ పోషణ, పిల్లల చదువు, సంఘంలో గుర్తింపు, గౌరవం. చాలామంది క్యాబ్ డ్రైవర్లు మమ్మల్ని గౌరవిస్తారు. కొందరు మాత్రం 'మీకెందుకు ఈ ఉద్యోగాలు' అంటూ హేళన చేస్తారు. వాటిని ఏవీ పట్టించుకోం. రోడ్డులో ఎన్ని మలుపులు ఉంటాయో, మా జీవితాలలో కూడా అన్ని మలుపులు ఉంటాయి.

-భారతి



## ఆత్మరక్షణతో పాటు ప్రయాణికుల రక్షణ...

*క్యాబ్ డ్రైవర్ ఉద్యోగం అంటే సాఫీగా సాగిపోయే ఉద్యోగం కాదు అన్నది కొందరు మహిళా క్యాబ్ డ్రైవర్ల అభిప్రాయం. కొన్ని సందర్భాలలో స్వీయ రక్షణతో పాటు ప్రయాణికుల రక్షణ బాధ్యత కూడా తమపైనే ఉంటుందని వారు చెబుతున్నారు.*

*ఇందుకోసం ట్రైనింగ్ సమయంలోనే తమకు కరాటే వంటి విద్యలలో శిక్షణ ఇస్తారని వారు అంటున్నారు. ఎన్ని విద్యలు నేర్చుకున్నా కొన్ని సందర్భాలలో ఇబ్బందులు ఎదుర్కోక తప్పడం లేదని వారు ఆవేదన వ్యక్తం చేస్తున్నారు.*



# నిరీక్షణ

**-జియో లక్ష్మణ్**

**బెలగాం రైల్వేగేటు అంటే నాకు చాలా ఇష్టం. ఆ గేటుకి ఇవతల మా ఇల్లు. మా ఇంటి వెనుక కలెక్టరు బంగళా, ఇంటికి రెండిళ్ల అవతల పెద్ద మైదానం. మైదానం వెనుక పోలీసు స్టేషను. మావీధిని మైదానం వీధి అంటారు.**

**చలం మైదానం నవల చదివినప్పుడు మా మైదానం వీధి చటుక్కున గుర్తుకు వచ్చేది. మైదానం అన్నపేరు మా వీధికి ఉండడం నాకు గొప్పగా అనిపించేది.**

మా ఇంటి డాబామీద నుంచి చూస్తే పెద్ద చెరువు, చెరువు పక్కన రైలు పట్టాలు. రైలు పట్టాలకు ఒకవైపు వరిపొలాలు, మరోవైపు తాటి పెండెలు (తోపులు). ట్రైను వెళ్తున్నప్పుడు డాబా మీద నుంచి చూస్తే చక్కగా కనిపించేది. ఇంట్లో వాళ్లు ఎవరైనా ఊరు వెళితే డాబా మీదకు ఎక్కి చెయ్యి ఊపి కిందకి దిగేవాళ్లం. రైల్వేస్టేషనుకూడా మా ఇంటికి అర ఫర్లాంగు దూరంలో ఉండేది, రైలు కూతలు చెవులకు హాయిగా వీనులవిందుగా ఉండేవి. కొత్తవాళ్లు మా ఇంటికి వస్తే వాళ్లు నిద్ర పోయేటప్పుడు ఆ శబ్దాలకు ఇబ్బంది పడేవారేమో గానీ మాకు మాత్రం హాయిగా ఉండేది. ఎవరైనా మా ఇంటి చిరునామా అడిగితే బెలగాం రైల్వేగేటు ముందు అని చెప్పేవాళ్లం. రేల్వేగేటు అవతల కొత్త బెలగాం, ఇవతల పాత బెలగాం అనేవారు.

మా మామయ్య గుమ్మలక్ష్మీపురం అడవినుంచి తెచ్చిన ఓ నల్లటి కుక్క మా ఇంట్లో ఉండేది, దాని పేరు రాము. అమ్మే ఆ పేరు పెట్టింది. స్కూలుకు వెళ్లివచ్చినప్పటి నుంచి ఆ కుక్కని వేసుకుని హీరో లాగా తిరిగేవాణ్ణి. కుక్కనిచూసి నా స్నేహితులు భయపడేవారు. నేను నవ్వుకునేవాణ్ణి. కుక్క మహా చురుకు. చాలా జోరైనది. ఒకటే పరుగులు. ఎవరినీ ఇంట్లోకి రానిచ్చేదికాదు, అసలు ఎవరినీ మా ఇంటివైపు చూడనిచ్చేది కాదు. ఒకరోజు రాత్రి దొంగోడు వచ్చాడు. పెద్ద బండరాయి పట్టుకొచ్చాడు. ఆరు బైట పడుకున్న అమ్మమ్మ అరిచింది. రాము మీద రాయి విసిరేద్దామనుకున్నాడు. భయపడకుండా వాడి వెంట పడింది. దెబ్బకు వాడు పారిపోయాడు. ఆ షాక్‌కి అమ్మమ్మ గడ్డకట్టుకు పోయింది. ఆ తర్వాత మామూలైపోయింది. మేమందరం నవ్వుకున్నాం. తరువాత ఆ సంఘటన గుర్తొచ్చినప్పుడల్లా నాకు నవ్వాగేదికాదు. అమ్మమ్మ మాత్రం చిలవలు పలవలుగా ఆవిషయం చెప్పేది.

నేను మొట్టమొదటిసారి నాకుక్క రాముని తీసుకుని రైల్వేగేటు దగ్గరికి వెళ్లాను. గేట్లు వేసి ఉన్నాయి. గేటు అవతలకి నేను దాటిపోయాను. రాము ఇవతల ఉండిపోయింది, ట్రైను వచ్చేస్తోంది. ఏం చెయ్యాలి? నాకు ఒకటే భయం. రైలుపెట్టెలు టక టక టకటక అంటూ యమస్పీడుగా వెళ్లిపోతున్నాయి రాము అవతల నుంచి చూస్తోంది. పెట్టెల కిందనుంచి వచ్చేస్తుందేమోనని బెంగ. వచ్చిందా నుగ్గునుగ్గు అయిపోతుంది. ఇంట్లో అందరూ నన్ను పట్టుకుని తంతారు. రాము చచ్చిపోతుంది. అలా జరక్కూడదు దేవుడా అని ఆంజనేయస్వామికి మొక్కుకున్నాను, ఊపిరి బిగపట్టి చూస్తున్నాను. ట్రైను వెళ్లిపోయింది. అలా జరగలేదు. రాము పరుగెత్తి నాదగ్గరకు వచ్చేసింది. గట్టిగా పట్టుకుని ముద్దులు పెట్టేశాను. ఆ తర్వాత కసిరాను. ఇంకోసారి ఈ రైల్వేపట్టాల దగ్గరకి రాకు అని చెప్పాను. అయితే అది వింటేనా? వినలేదు. మళ్లీ మళ్లీ వస్తూ ఉండేది. అమ్మ నాకు చివాట్లు పెడుతూ ఉండేది.

నాకుక్కని చూసి ముచ్చటపడి నాతో స్నేహం

## ఫ్రీ పబ్లిసిటీ మిస్సయింది

**ప**బ్లిసిటీ కోసం హీరోయిన్లు రకరకాల స్టంట్లు చేస్తుంటే క్యాథరిన్ మాత్రం ఫ్రీగా వచ్చే పబ్లిసిటీని చేజేతులా వదులుకుంది అంటున్నారు సినీజనాలు. ఇంతకీ అసలు విషయం ఏమిటంటే 'ఖైదీ నంబర్ 150'లో ఐటెంసాంగ్ కోసం ముందు క్యాథరిన్ అనుకున్నారు. సెట్లో జరిగిన గొడవలతో క్యాథరిన్ ఆ పాట నుంచి తప్పుకుంది. దాంతో ఆ ఛాన్స్ లక్ష్మీ రాయ్‌కి దక్కింది. ఇదంతా పాత కథే! ఇప్పుడు కొత్త కథ ఏమిటంటే ఈ సినిమా పబ్లిసిటీలో ఈ పాటను, అందులో లక్ష్మీరాయ్ డ్యాన్స్‌ను బాగా ప్రమోట్ చేస్తున్నారట! దీంతో లక్ష్మీరాయ్‌కి ఎక్కడలేని పబ్లిసిటీ వచ్చేస్తోంది. లక్ష్మీరాయ్‌కి వస్తున్న పబ్లిసిటీ చూసి క్యాథరిన్ కూడా బాధపడుతోందట! కొద్దిగా సర్దుకుని పోయుంటే ఆ పబ్లిసిటీ అంతా తనకే దక్కి ఉండేది కదా అని మధనపడిపోతోందట! అంతే మరి చేతులు కాలాక ఆకులు పట్టుకోవడం అంటే ఇదే మరి అంటున్నారు సినీ జనాలు.

చేయడానికి వచ్చాడు వాసు. వాడు నాస్కూలు కాదు. మా వీధికాదు. రైల్వేగేటు అవతల క్వార్టర్స్‌లో ఉంటాడు. వాళ్ల నాన్న క్యాబిన్ మ్యాన్. క్యాబిన్ మా ఇంటికి దగ్గరే. క్యాబిన్ గేటుకి ఇవతలవైపు ఒక మూలకి ఉంటుంది. క్యాబిన్ పక్కనుంచి ఒకరోడ్డు రైల్వేస్టేషనుకి వెళుతుంది. రోడ్డుపక్కన పెద్దనుయ్యి ఉండేది. దాన్ని అందరూ కళింబిల్లోళ్ల నుయ్యి అనేవారు. ఆ నూతిగట్టు దగ్గర వాసు, నేను మాకుక్క రాము కలుసుకునేవాళ్లం.

ఒకసారి క్యాబిన్‌మీద నుంచి 'ఒరేయ్ వాసూ?' అని వాళ్ల నాన్న వెంకట్రావు పిలిచాడు. పరుగున వెళ్లి మెట్లు టకటక ఎక్కి వాళ్ల నాన్నని కలుసుకుని మళ్లీ నాదగ్గరకు వచ్చాడు.

'ఎందుకురా మీనాన్న పిలిచాడు?' అన్నాన్నేను.

'కోడిగుడ్డు తినడం కోసం' అన్నాడు.

'ఎక్కడిది?' అన్నాను ఆశ్చర్యంగా.

'అమ్మ పెట్టింది క్యారేజిలో. నాన్న తినలేదు. నన్ను పిలిచాడు తినడానికి'

'అలాగా!'

'ఒరేయ్, నాకు నీ కుక్కని ఒకసారి ఇస్తావా? ఇంటికి తీసుకెళ్తాను' అడిగాడు.

'ఇదేమైనా బొమ్మా? అసలిది రాదు. వచ్చినా

**బెలగాం రైల్వే గేటు పరిసరాల్లో ఒక నల్ల కుక్కను వెంటేసుకుని గర్వంగా తిరిగేవాడు ఆ పిల్లాడు. వాసు అతనితో స్నేహం చేశాడు. అతడో రైల్వేక్యాబిన్ మ్యాన్ కొడుకు. ఆ క్యాబిన్ ఎంతో ఆకర్షించింది పిల్లాణ్ణి. తండ్రీకొడుకులిద్దరితోనూ స్నేహం చేశాడా పిల్లాడు. కాలం గడిచింది. వాళ్ల జీవితాల్లో ఎన్నో మార్పులు, ఎన్నో జ్ఞాపకాలు. క్యాబిన్ మారలేదు, క్యాబిన్ మ్యాన్‌మాత్రం మారాడు. ఇంతకూ అక్కడ జరిగిందేమిటి?**

నేను దాని పక్కనుండాలి' అన్నాను గొప్పగా.

'అయితే నువ్వే ఒకసారి మా ఇంటికి రా'

'వస్తానులేరా' అని, ఒకసారి వాడింటికి వెళ్లాను. వాళ్ల అమ్మ చాలా మంచిది. నాకు జంతికలు, సున్నుండలు ఇచ్చింది. తిన్నాను. రాముకికూడా పెట్టింది. తిన్నాడు. అందుకే అంతగా అరవలేదు. వాసు వాళ్లింటిలో కలిసిపోయింది రాము. రామునిచూసి వాళ్ల చెల్లి, అమ్మ ఎంతో సంతోషపడ్డారు. నేను వచ్చినప్పుడల్లా కుక్కని తీసుకురమ్మన్నారు. 'అలాగే' అని చెప్పి వచ్చేశాను.

ఒకసారి మధ్యాహ్నం భోజనం చేసేసి రైల్వేగేటు దగ్గరికి వెళ్లాను. ఎండగా ఉంది. ట్రైన్లు ఏమీ వెళ్లడం లేదు. రావడంలేదు. నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ క్యాబిన్ మెట్లు ఎక్కాను వాసు వాళ్ల నాన్న వెంకట్రావు నిద్రపోతున్నాడు కూర్చునే. గురక వినిపిస్తోంది. ఈలోపల ఫోను వచ్చింది. వెంటనే లేచి ఫోనుకు ఒక జెడ్ ఆకారంలో ఉన్న లివర్‌ని గిర్రునతిప్పి 'హలో బెల గాం!' అన్నాడు. తర్వాత ఏదో నంబరు చెప్పాడు. ఫోను పెట్టేశాడు. పుస్తకంలో రాసుకున్నాడు. వరసగా బ్రేకుల్లాగా రంగురంగుల లివర్లు ఉన్నాయి. ఒక దాన్ని పట్టుకుని గట్టిగా లాగాడు. అది ముందుకు వచ్చిన తర్వాత దాని కింద బాక్సులో తాళంతీసి ఎర్రటి లివరులోపెట్టి ఆ చక్రం తిప్పాడు. అప్పుడు పైనఉన్న రైలుగేట్లు నెమ్మదిగా కిందికి వచ్చాయి. రైలు పట్టాలు దాటడానికి వీల్లేకుండా అవి కిందపడ్డాయి. ఓహో రైలు గేటు ఇలా వేస్తారన్నమాట అని తెలుసు కున్నాను. అదంతా నేను చూశానని తెలుసుకున్న వెంకట్రావు 'ఏరా ఇలా వచ్చావు?' అనడిగాడు

'వాసుగాడొచ్చాడేమోనని' అన్నాను.

'వాడిప్పుడు ఇక్కడికిరాడు. రా లోపలికి రా అని ద్వారం దగ్గర నిలుచున్న నన్ను లోపలికి పిలిచాడు. క్యాబిన్ ఎత్తుగా అద్దాలతో ఆకుపచ్చని పెయింటింగ్‌తో ఒకరకంగా ఉంది. ఎప్పుడూ బైటనుంచి చూడటమేగానీ నేనెప్పుడూ లోపలికివెళ్లి చూడలేదు. నాకు వింతగా విచిత్రంగా ఉంది. అలా రెండు మూడు సార్లు అక్కడికి వెళ్లాను. అలా అలా నాకు క్యాబిన్ మ్యాన్ వెంకట్రావు బాగా పరిచయమైపోయాడు. ఆ పరిచయంతో రైల్వేగేట్లు ఎలా వెయ్యాలో ఎలా ఎత్తాలో తెలుసుకున్నాను. చాలా సార్లు నేనే రైలు గేట్లు వెయ్యడానికి లివరు లాగేవాణ్ణి. సుమారుగా మధ్యాహ్న సమయాల్లో నాకు టైము కలిసొచ్చినప్పుడల్లా క్యాబిన్‌మీదకు వెళ్లేవాణ్ణి. వాసుకంటే వాళ్ల నాన్నే నాకు బాగా స్నేహితుడయ్యాడు. నేనంటే క్యాబిన్ వెంకట్రావుకి బాగా ఇష్టం. నన్ను చూసి చాలా సంతోషపడేవాడు. క్యాబిన్ మీదకు రాముని ఎప్పుడూ తీసుకెళ్లలేదు. ఒకసారి తీసుకొస్తే అది కిందనే ఉండిపోయి పైకి భౌభౌ అని అరిచింది.

'కుక్కని పైకి తేవద్దు' అని వెంకట్రావు చెప్పేవాడు. అందుకే తీసుకెళ్లలేదు. ఎంతసేపూ స్కూలు, మా ఇల్లు, కుక్క, క్యాబిన్.. ఇదే నా ఆనందం.

వానాకాలం వచ్చింది. రైలు పట్టాలపక్కన ఉన్న ఇంటిఎదురుగా ఉన్న చెరువు వర్షం నీటితో నిండిపోయింది. చెరువంతా నాచుతో ఒకరకమైన పచ్చదనం సంతరించుకుంది. చెరువు చాలా చూడముచ్చటగా నీటితో నిండి ఉంది. రైలుపట్టాలవరకు నీరు వచ్చేసింది. చెరువుమీద వర్షం పడుతుంటే ఆ దృశ్యం నాకు చాలా ఇష్టం. మా ఇంట్లోంచి చెరువును చూడొచ్చు. చెరువు పక్కనుంచి పట్టాల మీదనుంచి రైలు వెళుతుంటే అలా కళ్లప్పగించి చూస్తూ ఉండిపోయేవాణ్ణి. ఆ వర్షంలో క్యాబిన్ దగ్గరకు పరిగెత్తేవాణ్ణి. నీళ్లలో తడవడం, గెంతడం నాకిష్టం. క్యాబిన్‌లో వెంకట్రావు లేడు. మరో క్యాబిన్ మ్యాన్ ఉన్నాడు. అతనికి కోపం ఎక్కువ. ఆ చుట్టుపక్కలకు మమ్మల్ని రానిచ్చేవాడు కాదు. వెంటనే గోడకు కొట్టిన బంతిలాగ ఇంటికి వచ్చేశాను. వర్షం తగ్గలేదు. తుఫాను పట్టిందట. చిన్న తుంపర్లలాగా పడుతున్నా రోజంతా పడింది.

మా ఇంటికి పక్కన బోడబొల్లోలు, ఆ పక్కన మాధవ, ఆయన పక్కన అగ్నిహోత్రుడు మాస్టారు, ఆ పక్కన సిద్ధారాజమ్మ., చివరగా రెండు గుడిసెలు ఉండేవి. అందులో ఒకదాంట్లో రిక్షా అప్పన్న కుటుంబంతో ఉండేవాడు. వాడిపెళ్లాం నర్సమ్మ నాలుగిళ్లలో పనిమనిషిగా చేసేది. వాళ్లు బాతులు పెంచేవారు. వర్షం బాగా పడడంవల్ల బాతులు చెల్లాచెదురై పోయాయి. ఆ బాతులకోసం రిక్షాఅప్పన్న తుప్పలు, డొంకల్లో, చెరువుగట్టులదగ్గర వెదికేవాడు. నేను, వాసు కూడా వెదికేవాళ్లం. ఎలాగోలా బాతులన్నీ ఇంటికి చేరుకున్నాయి. ఒక్కటి మాత్రం కనపడలేదు. రిక్షా అప్పన్న గుడిసె క్యాబిన్ పక్కనే ఉండేది. నేను క్యాబిన్ మీదకు ఎక్కిచూస్తే చెరువులో నీటిమీద తేలుతూ తెల్లబాతు కనిపిస్తోంది.

'అదిగో బాతు' అన్నాను క్యాబిన్ వెంకట్రావు కూడా చూశాడు.

'అవును అప్పన్నవాళ్ల బాతే' అన్నాన్నేను.

'వెళ్లి చెప్పి రా' అన్నాడు వెంకట్రావు. ఒకటే పరుగు తీశా.

రిక్షా అప్పన్న పెళ్లాం నర్సమ్మకి సంగతి చెప్పాను. అప్పుడే రిక్షా తొక్కుకుంటూ అప్పన్న అక్కడకు వచ్చాడు. నేను చెప్పిన మాటలువిని చెరువువైపు చూశాడు. బాతు కనిపించింది. తలకి చుట్టిన తుండు విసిరేసి. నిక్కరుతో చెరువువైపు పరుగు తీశాడు. రిక్షా అప్పన్న లావుగా ఉంటాడు. 'ఎక్కడికెళ్తున్నావు' అని అరిచింది అప్పన్న పెళ్లాం నర్సమ్మ




'బాతును తెస్తా' అని చెరువులోకి ఒక ఉరుకు ఉరికాడు.

'చెరువు నిండిపోయి ఉంది జాగ్రత్త' అని రైల్వేగేటువైపు వెళ్తున్న వాళ్లూ చెప్పారు, అప్పన్న పట్టించుకోలేదు. ఈతకొట్టుకుంటూ ముందుకు పోయాడు.

'చెరువులో పెద్దపెద్ద నుయ్యిలు. ఈడు అటెల్లిపోతున్నాడు' అన్నాడు క్యాబిన్ మ్యాన్ వెంకట్రావు. నేను, వాసు అలా చూస్తూ ఉండిపోయాం. రిక్షా అప్పన్న ముందుకు వెళ్తున్నకొద్దీ బాతు ఇంకా ఇంకా ముందుకు పోయింది. బాతు దొరకలేదు. రిక్షా అప్పన్న మాత్రం మునిగిపోయాడు. ఆ తరువాత నీటిమీద శవమై తేలాడు. ఆ వార్త ఊరంతా గుప్పుమంది. ముఖ్యంగా మా మైదానం వీధిలో అందరినోటా ఆ మాటే. నర్సమ్మ ఒకటే ఏడుపు. పెడబొబ్బలు. మేం భయపడిపోయాం. రెండ్రోజులు ఇల్లువదిలి బైటకు పోలేదు. క్యాబిన్ పక్కకు వెళ్లాలంటే భయం. చెరువువైపు చూడాలంటే భయం. భయంకరమైన కలలు. అమ్మ పక్కనే పడుకునే వాణ్ణి. ఆంజనేయస్వామి శ్లోకం చెప్పుకునేవాణ్ణి. ఆ తరువాత వాసుగాడు నన్ను కలవడం మానేశాడు. నేను కూడా వాడి గురించి పట్టించుకోలేదు.

సంవత్సరం గడిచిపోయింది. ఒకరోజు ఒక వార్త విన్నాను. పరుగున క్యాబిన్ దగ్గరకు వెళ్లాను. వెంకట్రావు ఉన్నాడు. గెడ్డాలు పెంచుకుని ఉన్నాడు. దీనంగా ఉన్నాడు. నన్ను చూడగానే నా చేయి పట్టుకుని బోరున ఏడ్చాడు.

'వాసుగాడు ఇల్లొదిలి వెళ్లిపోయాడా?' అన్నాను.

'అవును నాయనా' అని శోకం పెట్టాడు.

'ఎందుకెళ్లి పోయాడు?' అనడిగాను.

'మూడు నెలలు దాటిందిరా, ఎందుకెళ్లాడో ఎటెళ్లాడో ఏమో తెలియదు. ప్రతీ బండికి ఎదురు చూస్తున్నాను వాడొస్తాడేమోనని.' అంటూ ఏడుస్తున్నాడు. నాకూ ఏడుపొస్తోంది. ఏడ్చాను.

'మరి పోలీసులకు చెప్పలేదా' అడిగాను

'చెప్పానురా. వాళ్లూ వెదుకుతున్నారు. కానీ దొరకలేదురా. బెంగతో నా పెళ్లాం మంచం ఎక్కిపోయిందిరా నాయినా' అన్నాడు ఏడుస్తూ. నన్ను చూస్తే క్యాబిన్ మ్యాన్ వెంకట్రావుకు వాసు గుర్తుకి వచ్చి ఒకటే దుఃఖం పొంగుకొచ్చింది. కొద్దిసేపు తర్వాత ఏం మాట్లాడాలో తెలియక,

'వస్తా వెంకట్రావు' అని అడుగులో అడుగు వేసుకుంటూ భారంగా క్యాబిన్ దిగాను.

'అప్పుడప్పుడు వస్తూ ఉండు' అన్నాడు వెంకట్రావు. కానీ నేను వెళ్లలేకపోయాను. వాసు వచ్చాడా? లేదా? అనే వార్త గురించి ఎవరో ఒకరి ద్వారా తెలుసుకుంటూ ఉండేవాణ్ణి. వాసు రాలేదు. స్కూలుకి వెళ్లడం, రావడం దిగులుగా ఉండటం, రాముతో ఏవేవో లోతైన విషయాలు మాట్లాడేవాణ్ణి. అది అర్థం చేసుకున్నట్లు చెవులు ఆడించేది. మా కుక్క రాము నేను తప్ప ఇంకెక్కడికీ వెళ్లేవాణ్ణి కాదు. 'ఎందుకురా అలా ఎక్కడో ఒక దగ్గర కూర్చుని ఉంటావు. ఎటైనా వెళ్లరాదు' అనేది అమ్మ. నేను సమాధానం చెప్పకుండా ఉన్నచోటు నుంచి లేచి మరోచోట కూర్చునేవాణ్ణి. నాతోబాటే రాము కూడా వచ్చి నాదగ్గరే కూర్చునేది. ఒకటే దిగులు. మా ఇంట్లో అంట్లు తోమడానికి శకుంతల అని ఒక ఆవిడ పనిచేసేది. ఇంటినిండా ఎలుకలు. ఎక్కడ నుంచి వస్తున్నాయో తెలియదు. వాటిని చాలా లాఘవంగా రాము సఫా చేసేది. అయినా ఎక్కువగా ఉండేవి. వాటిని సంహరించడానికి ఎలుకలమందు తెమ్మని శకుంతలకు చెప్పింది అమ్మ. శకుంతల తెచ్చింది. రాత్రుళ్లు ఎలకల మందు పెట్టేవాళ్లం. ఎలుకలు చచ్చేవి. ఒకరోజు ఎలుకల మందు పకోడిలో కలిపి పెట్టింది శకుంతల. ఆ పకోడిని ఆకలిగా ఉందేమో రాత్రి రాము తినేసింది. పొద్దున్నకల్లా చచ్చిపోయింది. ఇంట్లో అందరం ఒకటే ఏడుపు. రామునిచూసి నేను వెక్కి వెక్కి ఏడ్చాను. దాని దగ్గరే కూర్చుండిపోయాను. నాన్న దానిని ఒక బుట్టలో పెట్టి క్యాబిన్ వెనక ఉన్న తూటు బడ్లు దగ్గర ఉప్పు వేసి పాతేశారు. రాముని తలుచుకుని ప్రతిరోజు ఏడ్చేవాణ్ణి. ఏదో ఒక సందర్భంలో అది నాకు గుర్తొచ్చేది. ఆ జ్ఞాపకాలు తలచుకుని కళ్లనీళ్లు పెట్టుకునేవాణ్ణి. మళ్లీ రేల్వేగేటు దగ్గరకువెళ్లి క్యాబిన్ మీదకు ఎక్కి రాముని ఎక్కడ పాతిపెట్టారో అటువైపు దీనంగా చూసేవాణ్ణి. క్యాబిన్‌మ్యాన్ వెంకట్రావుకూడా పనిచేస్తూ మరోపక్క తన కొడుకు వాసు ఎప్పటికైనా రాక పోతాడా అనే ఆశతో ప్రతిబండికీ ఎదురు చూస్తూ ఉండేవాడు. మా నిరీక్షణకు అంతేలేదు. రాము రాదు. రాని లోకాలకు వెళ్లిపోయింది. వాసు రాలేదు. ఎక్కడున్నాడో తెలియదు. వాళ్ల అమ్మ పూచిక పుల్లలాగా అయిపోయింది. జబ్బుపడి తీసుకుని తీసుకుని కొన్నాళ్లకు చనిపోయింది. వెంకట్రావు, వెంకట్రావు కూతురు మిగిలారు. వెంకట్రావు గడ్డాలు, మీసాలతో సాధువులా తయారయ్యాడు.

అమ్మమ్మ ఊరునుంచి వచ్చింది. నేను మాట్లాడుతుంటే అమ్మమ్మ శ్రద్ధగా వినేది. నాకు చాలా విషయాలు చెప్పేది. రామాయణం గురించి ఎక్కువగా చెప్పేది. వాసు ఎందుకు ఇల్లొదిలి వెళ్లిపోయాడని చాలాసార్లు అమ్మమ్మని అడిగాను.

'రాత ఏం రాసిపెట్టి ఉంటే అది జరుగుతుంది' అని చెప్పేది. రాత్రి పదిగంటల పాసింజరు టైమ్ వరకు అమ్మమ్మ దగ్గరే కూర్చుని నేను చదువుకునేవాణ్ణి. అమ్మమ్మ ఊరు వెళ్లనని చెప్పింది. నా దగ్గరే ఉంటానని చెప్పింది. అక్కడనుంచి నా మనసులో రాము గురించి, వాసు గురించి ఉన్న దిగులు నెమ్మది నెమ్మదిగా పోయింది. క్యాబిన్‌వైపు వెళ్లడం మానేశాను. క్యాబిన్ వెంకట్రావు ఉద్యోగం మానేశాడు. అంటే ముందుగానే రిటైర్మెంట్ తీసుకున్నాడు. నేను వాళ్లింటికి వెళ్లలేదు. కూతురికి పెళ్లి చేసేశాడు. రాష్ట్రం దాటి ఒరిస్సాలో పేపర్‌మిల్లులో పనిచేస్తున్న వరుడితో వెళ్లిపోయింది. నేను డిగ్రీ కోసం వైజాగ్ వచ్చేశాను. ఆంధ్రా యూనివర్సిటీలో ఇంజనీరింగ్‌లో జాయినయ్యాను. ఐదేళ్ల చదువు పూర్తిచేసి మంచి ఉద్యోగం సంపాదించాను సికింద్రాబాద్ రైల్వేశాఖలో.

సంక్రాంతి పండగ వచ్చింది. మా ఊరు బెలగాం వెళ్లాను. తమ్ముడు రమణ వైజాగ్ నుంచి వచ్చాడు. చెల్లెళ్లు, బావమరుదులు వచ్చారు. కోలాహలంగా ఉంది. ఇల్లంతా ఒకటే పండగ సందడి. మూడు రోజుల పండగకు ముప్ఫైరోజుల ముందు నుంచి హడావిడి. పాత మిత్రులు కలిశారు. ఎవరో కొత్త కొత్తవాళ్లు ఊళ్లో కనిపించారు. చిన్నప్పటి హుషారు ఇప్పుడులేదు. అయినా బావుంది. సొంత ఊరు అలా ఉంటుంది.

రాత్రి భోజనాలయ్యాక బెలగాం రైల్వేగేటువైపు

వెళ్లాను. ట్రైన్లు వస్తున్నాయి పోతున్నాయి. క్యాబిన్ అలాగే నిలబడి ఉంది. రంగుల్లేవు. వెలిసిపోయినట్లుగా ఉంది. ఎవరో క్యాబిన్‌మ్యాన్? ఎదురుగుండా చెరువు ఎండిపోయింది. చెరువుగట్టుమీద కూడా ఇళ్లు వచ్చేశాయి. చెరువు సరిగ్గా కనిపించడం లేదు. సింగిల్ లైన్ రైలు పట్టాల్ని ఇప్పుడు డబుల్ లైన్ చేశారు. చెరువు సగాన్ని లైన్ల కోసం కప్పేశారు. పాత రైలు గేట్లు తీసేసి కొత్తవి ఆటోమేటిక్‌వి వేశారు. రైలుగేట్లు పడినప్పుడు బడబడ శబ్దాలు లేవు. క్యాబిన్ పక్కన నుయ్యి మాత్రం ఉంది. అది పాతబడి పోయింది. స్టేషనులో కూడా చాలామార్పులు వచ్చాయి. రెండు ఫ్లాట్‌ఫారాలు వచ్చాయి. అడవిలాగా ఉండే స్టేషనుదారిని చక్కటి రోడ్డుగా మార్చేశారు. ఇంతకు ముందులాగ రైల్వే గేటు దాటివెళ్లే ట్రాఫిక్ తక్కువగా లేదు. బాగా పెరిగిపోయింది. స్కూలు వేన్లు, బస్సులు, ఆటోలు, రిక్షాలు, లారీలు, స్కూటర్లు, ధూళి, దుమ్ము విపరీతంగా రేగుతోంది. ప్రశాంతంగా నిల్చుని కొండల వైపు వెళ్లే రైలు పట్టాల్ని చూసే అవకాశం ఇప్పుడు లేదు. అయినా నేనే చాలాసేపు టైము మరిచిపోయి ఉండిపోయాను తేరుకుని ఇంటికివచ్చాక అమ్మని అడిగాను.

'ఊరు చాలా మారిపోయింది కదమ్మా' అని.

'అవును మీ నాన్నకూడా రిటైరైపోయారు కదా' అంది నవ్వుతూ.

'రైల్వేగేటు దగ్గరకి వెళ్లాను. పాత జ్ఞాపకాలు నన్ను కదిలించాయి' అన్నాను.

'నీ చిన్నతనం నాటికీ ఇప్పటికీ చాలా మార్పులొచ్చాయి, మార్పు సహజం కదా' అంది అమ్మ.

పండగ అయిపోయింది. బయల్దేరిపోయాను. నన్ను స్టేషన్‌లో దిగబెట్టడానికి అమ్మా నాన్న ఇద్దరూ బయల్దేరారు.

'మీరెందుకు, నేను వెళ్లొస్తాను' అంది అమ్మ.

'సరే నీ ఇష్టం అని ఉండిపోయారు నాన్న.

రైల్వే స్టేషను దారి వెంబడి ఎన్ని కబుర్లో చెప్పింది అమ్మ. తొందరగా పెళ్లి చేసుకోమని ఒకటే ఒత్తిడి చేస్తోంది. ఆ విషయం గురించే అటుతిప్పి ఇటు తిప్పి చెబుతోంది.

'వచ్చే సంవత్సరం తప్పకుండా చేసుకుంటా సరేనా' అని అమ్మకు హామీ ఇచ్చాను. చల్లబడింది.

స్టేషను లోపలికి ప్రవేశిస్తుంటే టికెట్లుఇచ్చే హాలువెనుక ఒక బూరుగుచెట్టు ఉంది. దాని కింద ఒక వ్యక్తి కూర్చున్నాడు. చూసిన ముఖమే. బాగా వృద్ధుడైపోయాడు. కాళ్లులేవు. పక్కన కర్రకాళ్లు ఉన్నాయి. వెయిటింగ్ హాల్లో కూర్చుంటున్నప్పుడు అమ్మను అడిగాను.

'ఆ చెట్టుకింద ఉన్న కాళ్లు లేని వ్యక్తిని ఎక్కడో చూశానమ్మా' అని.

'ఎక్కడో ఏమిటి? క్యాబిన్‌మ్యాన్ వెంకట్రావు'

'వెంకట్రావా?' నాకు షాకు కొట్టినట్లైంది.

'అవును'

'కాళ్లు ఎలా పోయాయి?' నాకు బాధ కలిగింది. అప్పటి వెంకట్రావు గుర్తొచ్చాడు.

'చూపు మందగించింది. చెవులు వినబడవు. రైలు పట్టాలు దాటుతుండగా గూడ్సు ఇంజను గుద్దింది. కాళ్లు పోయాయి. మనిషి బతికాడు. రైల్వే స్టేషను వదలడు. చిన్నప్పుడు వెళ్లిపోయిన కొడుకు వస్తాడేమోనని ప్రతిబండికి కర్రకాళ్లతో వెళ్లి ఎదురు చూస్తాడు' అంది అమ్మ ఎంతో బాధగా.

'అవును, వాసూ వెళ్లిపోయాడు కదా. చిన్ననాటి స్నేహితుడు. నేను మర్చిపోయాను. కానీ తండ్రి మర్చిపోగలడా? నిరీక్షిస్తున్నాడు. ఎప్పటికైనా వస్తాడేమోనని' మనసులో అనుకున్నాను.

'ఒక్కొక్కరి జీవితాలు అంతే' అమ్మ వేదాంత ధోరణిలో చెప్పింది. అవును అంతే. వాసురాడు, హిమాలయాలవైపు వెళ్లిపోయాడని ఎవరో చెప్పగా చూచాయగా విన్నాడు. ఆ విషయం ఈస్థితిలో కొడిగట్టిన దీపంలా ఉన్న వెంకట్రావుకు చెప్పగలడా? చెప్పి ప్రయోజనం ఏమిటి? చివరివరకు అతడి నిరీక్షణే అతణ్ణి బ్రతికించాలి. అంతకుమించి ఎవరైనా ఏం చెయ్యగలం? వెయిటింగ్ హాలు కిటికీలోంచి చెట్టు కింద క్యాబిన్‌మ్యాన్ వెంకట్రావుకోసం చూశాను. లేడు! ట్రైను వస్తోంది, ఆశగా అటువైపు వెళుతున్నాడు. నా కళ్లు కన్నీళ్లతో నిండిపోయాయి.

**సెల్: 93964 30043**

## మనమీదేసర్రోయ్!

సరసి








# తుపాకీ

**ఒక పేరున్న ప్రైవేట్ కంపెనీలో అనిరుధ్ సి.ఇ.ఓ. కంపెనీని వృద్ధిచేసి చక్కటి పేరు సంపాదించుకున్నాడు. కానీ కంపెనీ అధికారులు ఖర్చులు తగ్గించాలనుకుని పెద్దజీతగాళ్లను తొలగించారు. అనిరుధ్ మీద కూడా వేటు పడింది. ఆ స్థానంలో అనిరుధ్ మాజీ భార్య భవాని బాధ్యతలు చేపట్టింది. పదేళ్ల క్రితమే అనిరుధ్ నుంచి విడాకులు తీసుకుంది భవాని.**

బహిరంగ దూషణలు, ఆరోపణలతో ఆ తంతు ముగిసింది. అతన్ని బిచ్చమెత్తుకునేట్టు చేస్తానని ఆనాడే ప్రతిజ్ఞ చేసింది భవాని. తన జాబ్‌లో భవానీ చేరడం అనిరుధ్‌కి నచ్చలేదు. ఉద్యోగం వదిలేదిలేదని కంపెనీతో గొడవపెట్టుకున్నాడు. ఇంతలో ఓ రోజు భవానీ, అనిరుధ్ ఇద్దరూ ఆఫీసుకు రాలేదు. ఆరోజే అనిరుధ్ ఇంటి బెడ్రూములో భవానీ శవం లభించింది. అంతలోనే మరోవార్త. ఆమెను కాల్చిచంపి, విమానంలో హైదరాబాద్‌వెళ్లి హోటల్‌గదిలో అదే తుపాకీతో కాల్చుకుని చచ్చిపోయాడు అనిరుధ్.

భవానీని అనిరుధ్ చంపాడనే ఆధారాలు సేకరించారు పోలీసులు. ఆమెనిచంపి, క్యాబ్‌లో ఎయిర్‌పోర్ట్‌కెళ్లి చెకిన్ అయ్యే సమయం, హోటల్లో గది తీసుకున్న సమయం అన్నీ సరిగ్గా మ్యాచ్ అయ్యాయి. ఇన్‌స్పెక్టర్ విజయ్ ఇచ్చిన ఆ నివేదిక మొత్తం చదివాడు డిటెక్టివ్ శరత్.

'నాకు ఎందుకో సంతృప్తి కలగలేదు. క్రాస్ చెక్ చేసేందుకే నిన్ను పిలిచాను' అన్నాడు విజయ్.

"అనిరుధ్ విమానంలో ప్రయాణం చేయకుండా ఉండివుంటే, అతడిది ఆత్మహత్య కాదనటానికి ఆధారాలు ఉండేవి కావు' అన్నాడు శరత్.

'అంటే అది ఆత్మహత్య కాదంటావా?' అడిగాడు విజయ్.

'అనిరుధ్ స్వంత తుపాకీతో కాల్చుకున్నాడంటున్నారు?'

'అవును, భవానీని చంపిందీ, తను కాల్చుకుని చనిపోయిందీ ఒకటే తుపాకీ.

'విమానం ఎక్కే ముందు చెకింగ్ ఉంటుంది కదా? తుపాకీని హైదరాబాద్ ఎలా తీసుకెళ్లాడు?' అడిగాడు శరత్.

అలా చూస్తూ ఉండిపోయాడు విజయ్.

అసిస్టెంట్ రాముకు ఫోన్ చేశాడు శరత్.

'రామూ, భవాని, అనిరుధ్‌ల ఫోను నంబర్లు కాల్‌డేటా, వాళ్ల కదలికల వివరాలు సేకరించు' చెప్పాడు.

'అనిరుధ్ ఆత్మహత్య చేసుకుంటే సెక్యూరిటీ కన్నుగప్పి తుపాకీని అతడు ఎలా తెచ్చాడో తెలుసుకోవాలి' గంభీరంగా అన్నాడు శరత్.

•••

'విడాకులు తీసుకున్న తరువాత ఇద్దరూ ఒకే ఆఫీసులో పని చేయటం ఇబ్బందిగా ఉంటుందని అతడిని విజయవాడకి, భవానీని చెన్నై పంపించాం. అనిరుధ్‌ని తొలగించాక అతడి స్థానంలో బాధ్యతలు చేపట్టేందుకు చెన్నై నుంచి విజయవాడకు వచ్చింది భవాని. వచ్చాక ఇలా జరిగింది' విషాదంగా చెప్పాడు కంపెనీ అధికారి.

'ఆమెనే ఆ సీట్లోకి ఎందుకు బదిలీచేశారు?' ప్రశ్నించాడు శరత్.

'అన్ని అర్హతలూ ఉన్న సీనియర్. తక్కువ జీతానికి ఎక్కువ బాధ్యతలు నిర్వహించేందుకు స్వచ్ఛందంగా ముందుకు వచ్చింది'.

'తర్వాత అనిరుధ్ ఎలా స్పందించాడు?'

'ఆమెని చంపుతానన్నాడు. కంపెనీని నాశనం చేస్తానన్నాడు'.

'మీరేమన్నారు?'

'అతని నెల గడువును వారానికి తగ్గించాను ఆఫీసు కంప్యూటర్ పాస్‌వర్డ్‌లు మార్చేసి, ఆఫీసుకి రావద్దని చెప్పాం'

ఇదంతా ఎన్నిరోజుల క్రితం జరిగింది?'

'ఇది జరిగిన రాత్రే హత్య, తర్వాత ఆత్మహత్య జరిగాయి' చెప్పాడు కంపెనీ అధికారి.

•••

'బాస్... నువ్వు చెప్పిన వివరాలు సేకరించాను. భవానీమీద ఎలాంటి రిమార్కూలేదు. కానీ అనిరుధ్ మంచివాడని ఎవరూ చెప్పలేదు. మేనేజ్‌మెంట్ పక్షపాతి. ఉద్యోగులను వేధించేవాడట' చెప్పాడు రాము.

'భవాని వ్యక్తిగత జీవితం....'

'విడాకులు తీసుకుని పిల్లల్ని పెంచి పెద్ద చేసింది. పిల్లలిద్దరూ విదేశాలలో ఉన్నారు. అందరూ ఆమెని 'నిప్పు' అంటారు. సో.. నువ్వు ఆలోచిస్తున్నట్టుగా ఏమీలేదు బాస్'.

'వాళ్ల ఫోన్ల వివరాలు ఏవి?'

'ఇదిగో బాస్' అందించాడు రాము.

ముందుగా ఫోను లొకేషన్ వివరాలను పరిశీలించాడు శరత్. కొంతసేపటికి అయోమయంగా, కాల్‌డేటాతో ఆ వివరాలు పోల్చసాగాడు.

'ఏమైంది బాస్?' అడిగాడు రాము.

'ఈ వివరాలు సరైనవైతే ఆ రోజు భవాని, అనిరుధ్ కలిసే వీల్లేదు. అసలు కలుసుకోనప్పుడు హత్య, ఆత్మహత్యలకు అవకాశం, అవసరం లేదు'.

'అదేంటి బాస్?'

'భవాని సెల్ లొకేషన్‌కీ, టైమింగ్‌కీ, అనిరుధ్ సెల్ లొకేషన్‌కీ, టైమింగ్‌కీ మ్యాచ్ కావడం లేదు. ఆరోజు భవాని సెల్ చాలాసేపు ఆఫీసులో ఉంది. ఆ సమయంలో అనిరుధ్ ఇంట్లోంచి ఫోన్లు చేస్తున్నాడు. అలా క్యాబ్‌కి కూడా ఫోన్ చేశాడు చూడు. ఇంకో గంట తరువాత హైదరాబాద్‌లో ఫ్రెండ్‌కి ఎయిర్‌పోర్టు నుంచి ఫోన్ చేశాడు. ఈ నంబరు ఎవరిదో తెలుసుకో. లొకేషన్ల వివరాల ప్రకారం హైదరాబాదులో ఫ్రెండ్‌కి అనిరుధ్ ఫోనుచేస్తున్న సమయంలో భవాని ఫోను అనిరుధ్ ఇంట్లో ఉంది'.

శరత్ వైపు ప్రశ్నార్థకంగా చూశాడు రాము. 'కానీ పోలీసు రికార్డులు చూస్తే, హోటల్‌లో అనిరుధ్ రూములో దొరికిన వస్తువులలో భవాని సెల్ ఫోను ఉంది. ఆమెని హత్యచేసి సెల్‌ఫోను తెచ్చి ఉంటాడని పోలీసులు భావించారు' చెప్పాడు రాము.

'తుపాకీ వచ్చినట్టే సెల్‌ఫోను కూడా అతడి రూములోకి వచ్చి ఉంటుంది' అంటూ, అనిరుధ్ ప్రయాణమార్గం వివరాలు, టైమింగ్స్ అన్నీ మళ్లీ పరిశీలించడం ప్రారంభించాడు శరత్.

కాస్సేపటికి నిట్టూర్చి అన్నాడు.

'అనిరుధ్ ఇంటినుంచి బయల్దేరి తిన్నగా విమానాశ్రయానికి వెళ్లాడు. మామూలుగా అరగంట ప్రయాణం, ఆ రోజు గంట పట్టింది. చెక్ ఇన్ అయ్యాక విమానం బయలుదేరటానికి గంటన్నర పట్టింది. విమానం ప్రయాణం గంట. రాజీవ్ గాంధీ విమానాశ్రయం నుంచి క్యాబ్‌లో ప్రయాణం రెండు గంటలు. అంటే అయిదున్నర గంటలు..' శరత్ లెక్కలు కట్టాడు.

**మాజీ భార్యను చంపి, విమానమెక్కి వెళ్లిపోయాడతను. విమానం దిగి హోటల్‌రూమ్ తీసుకుని ఆత్మహత్య చేసుకున్నాడు. పోలీసులు సేకరించిన సమాచారంలో అతని జర్నీ టైమింగ్స్, వివరాలన్నీ మ్యాచ్ అయ్యాయి. కానీ ఇన్‌స్పెక్టర్ విజయ్‌కి ఎక్కడో ఏదో అనుమానం కలుగుతోంది. క్రాస్ చెక్ చేసేందుకు డిటెక్టివ్ శరత్‌ను పిలిపించాడు. అతడు వచ్చి ఏం చేశాడు? ఈ కేసు మరో మలుపు తిరిగిందా?**



'బాస్.. ఆ ఫోను దమ్మాయిగూడలోది'... తలెత్తాడు శరత్. 'విమానాశ్రయం నుంచి దమ్మాయిగూడ వెళ్లాడు. అక్కడ రెండు గంటలు గడిపి, హోటల్‌కు వచ్చాడు. మొత్తం ఎనిమిది గంటలు.. అంటే, విజయవాడ వదలి, హైదరాబాద్‌లో హోటల్ చేరేసరికి ఎనిమిది గంటలు.. పోలీసు రిపోర్టుప్రకారం తెల్లవారి 4-5 గంటల మధ్య ఆత్మహత్య చేసుకుని ఉంటాడు. అంటే, విజయవాడ నుంచి బయల్దేరిన పద్నాలుగు గంటల తరువాత ఆత్మహత్య జరిగి ఉంటుంది. కారులో విజయవాడ నుంచి అయిదారుగంటల్లో హైదరాబాద్ రావచ్చు. అక్కడ భవానీని తుపాకీతో చంపి అదే తుపాకీతో కారులో హైదరాబాద్ వచ్చి రాత్రి అంతా నిద్రించే సమయంలో హోటల్ లోకి వచ్చి అనిరుధ్‌ని కూడా చంపి తుపాకీ, సెల్‌ఫోను అక్కడే వదిలివెళ్లే అవకాశముంది!' అంచనా వేశాడు శరత్.

'కానీ ఎవరు చంపి ఉంటారు?' అడిగాడు రాము.

'పద హైదరాబాద్‌లో దమ్మాయిగూడకి పోదాం' అంటూ లేచాడు శరత్.

●●●

'మా ఇద్దరికీ పూర్వ పరిచయం ఉంది. మా కంపెనీలో ఉద్యోగం ఇస్తున్నట్టు అతనికి ఈమెయిల్ వచ్చింది. అదిపట్టుకుని నా దగ్గరకు వచ్చాడు. కానీ, ఆ ఈమెయిల్ నేను ఇవ్వలేదు. అదీ సమస్య. అతడు ఆత్మహత్య చేసుకుంటాడని గ్రహిస్తే నిజంగానే ఉద్యోగం ఇచ్చేవాణ్ణి' విషాదంగా అన్నాడు కంపెనీ యజమాని.

ఏదో ఆధారం దొరుకుతున్నట్టనిపించింది శరత్‌కి. 'ఓసారి మీ కంప్యూటర్ చూడొచ్చా?' అడిగి కత్తి ఉమేశ్‌కుమార్‌కి ఫోను కలిపాడు.

●●●

'కంప్యూటర్ హ్యాక్ అయిందా?' అడిగాడు శరత్.

'బాస్... హత్య జరిగిన రోజే దమ్మాయిగూడ కంపెనీ ఓనర్‌కి ఈమెయిల్ వచ్చింది. మెయిల్‌పై క్లిక్‌చేయగానే కంప్యూటర్ హ్యాకర్ స్వంతమైంది. ఇతడి ఈ మెయిల్ నుండే అనిరుధ్‌కి మెసేజ్ ఇచ్చాడు'.

'నా మెయిల్ ఎందుకు ఎంచుకున్నాడు?' అయోమయంగా అడిగాడు కంపెనీ ఓనర్.

'హంతకుడు పట్టుబడితే తెలుస్తుంది' అన్నాడు శరత్.

'బాస్...ఐపి అడ్రస్ దొరికింది. ఇంటర్నెట్ సర్వీస్ ప్రొవైడర్‌ను కనుక్కోవటానికి ప్రయత్నిస్తున్నా' చెప్పాడు ఉమేశ్. కాస్సేపటికి ఉమేశ్ విజిల్ వేశాడు. 'బాస్... ఇటు చూడు' అని చూపించాడు.

●●●

'కంపెనీ నాదే. మీరుచెప్తున్న సర్వీస్ ప్రొవైడర్ నాదే. డొమైన్‌నేమ్ నాదే. కానీ హ్యాక్ చేసేంత కంప్యూటర్ పరిజ్ఞానం నాకులేదు. నేను అనిరుధ్‌ని ఉద్యోగం నుంచి తొలగించానంతే' చెప్పాడు కంపెనీ అధికారి.

'మీ కంప్యూటర్ ఇన్‌చార్జి ఎవరు?' అడిగాడు శరత్.

'మధుసూదన్‌ని పిలు' ఇంటర్‌కమ్‌లో చెప్పాడు కంపెనీ ఓనర్.

ఓ నడివయసు వ్యక్తి వచ్చి శరత్‌వైపు ప్రశ్నార్థకంగా చూశాడు. అంతలో రాము బైట కెళ్లాడు.

'భవానీని, అనిరుధ్‌ని ఎందుకు హత్య చేశావు?' సూటిగా అడిగాడు శరత్.

ఆశ్చర్యపోయాడు మధుసూదన్. ఏదో అనబోయి, అలాగే నిలబడిపోయాడు.

'హత్య ఎందుకు చేశావు?' రెట్టించాడు విజయ్.

'మీరేమంటున్నారో నాకు తెలియడంలేదు' అన్నాడతను.

'నీ కంప్యూటర్ నుంచి కంపెనీ ఇంటర్నెట్ సర్వీసులో మెసేజ్ వెళ్లింది. దాన్నుంచి నువ్వు మరో కంపెనీ కంప్యూటర్ హ్యాక్‌చేసి, అనిరుధ్‌కి ఉద్యోగం వచ్చినట్టు మెయిల్ పంపావు. అది చూసి అనిరుధ్ హైదరాబాద్ వెళ్లగానే భవానీని అనిరుధ్ తుపాకీతో చంపి, హైదరాబాద్ వెళ్లి అనిరుధ్‌ని చంపావు. హత్యానేరం అనిరుధ్‌పై నెట్టాలని చూశావు. ఎందుకిదంతా?' అడిగాడు శరత్.

'నాకేం తెలియదు' అన్నాడు అతడు.

ఇంతలో రాము వచ్చాడు. 'బాస్ కంప్యూటర్ కీబోర్డులో రాలే వేళ్ల చర్మంపొట్టు సేకరించాను. దాన్ని ఇతని డీఎన్ఏతో పోలిస్తే నిజం తెలుస్తుంది' అన్నాడు రాము.

మధుసూదన్ పరుగెత్తబోయాడు. విజయ్ అతడిపైకి లంఘించాడు.

●●●

'మధుసూదన్‌కి మొదటినుంచి భవానిపైన ఆశ. అనిరుధ్, భవానీ మధ్య గొడవలు కూడా అతడి వల్లే. విడాకుల తరువాత కూడా భవానీ మధుసూదన్‌కి దక్కలేదు. విజయవాడలో తిరిగి ఉద్యోగంలో చేరాక కూడా అతన్ని తిరస్కరించింది. కోపంతో భవానీని కొట్టాడు మధుసూదన్. ఆమె స్పృహ తప్పిపడిపోయింది. అప్పుడే పథకంవేసి, అర్జంటుగా రమ్మని' ప్రత్యర్థి కంపెనీ కంప్యూటర్‌నుంచి అనిరుధ్‌కి దొంగ ఈమెయిల్ ఇచ్చాడు. అనిరుధ్ వెళ్ళగానే భవానీని అనిరుధ్ ఇంటికి తీసుకెళ్లి ఆమెను కాల్చి చంపాడు. వెంటనే కారులో హైదరాబాద్ వెళ్లి అనిరుధ్‌ని చంపాడు. రాత్రిపూట తలుపు తట్టిన మధుసూదన్‌ని చూసి అనిరుధ్ ఆశ్చర్యపోయాడు. కానీ అనిరుధ్ తేరుకునేలోపు అతన్ని చంపి తిరిగి విజయవాడ వచ్చేశాడు. ఆఫీసుకి ఆలస్యంగా వచ్చాడు. తన నేరం ఎవ్వరూ పసికట్టరనుకున్నాడు. అనిరుధ్ ల్యాప్‌టాప్‌ను హ్యాక్‌చేసి అతడి ప్రయాణం, హోటల్ బుకింగ్ వివరాలన్నీ తెలుసుకున్నాడు' కేసును వివరించాడు శరత్.

**-కస్తూరి మురళీకృష్ణ,**

**సెల్: 98496 17392**

# సాఫ్ట్‌వేర్‌లో సరిగమలు

6

-కంఠంనేని స్వప్న



**నైరాకి డ్యూయల్ సిటిజన్‌షిప్ ఉండటం, ఉన్న ఒకే ఒక్క బ్లడ్ రిలేటివ్ అక్షయ్ కావటం, అతడినే ఆమె తల్లిదండ్రులు గార్డియన్‌గా లిస్ట్ చేయటం లాంటి అంశాలను పరిగణనలోకి తీసుకుని ఇండియా పంపటానికి పర్మిషన్ ఇచ్చింది అక్కడి గవర్నమెంట్.**

**ఆ రోజే ఆమె ఇండియా వస్తోంది.**

**ఇండియన్ అసోసియేషన్ వాళ్లు నైరాని ఇండియా వస్తున్న స్టూడెంట్ వెంట పంపే ఏర్పాట్లు చేశారు.**

అక్షయ్, హర్ష, సీమ ఆమెని పికప్ చేసుకోవటానికి ఎయిర్‌పోర్ట్‌కి వెళ్లారు.

ఇంటర్నేషనల్ అరైవల్స్ వద్ద నిలబడి వెయిట్ చేస్తున్నారు.

అక్షయ్ చాలా ఉద్విగ్నంగా ఎదురు చూస్తున్నాడు. తన కుటుంబం నుంచి తనకంటూ మిగిలిన ఒకే ఒక్క మనిషి నైరా.

బైటికి వస్తున్న ప్రయాణికులు చాలామంది లెక్కలేనన్ని, పెద్దపెద్ద సూట్‌కేస్‌లు తోసుకుంటూ వస్తున్నారు. వీళ్లైతే అమెరికా మొత్తాన్ని ట్రాలీలో వేసి తీసుకొచ్చేయాలనే తాపత్రయం కనబడుతోంది వాళ్ల మొహాల్లో.

## జరిగిన కథ

అదో మల్టీనేషనల్ కంపెనీ! రెండేళ్ళుగా ఆ కంపెనీలోనే పనిచేస్తున్నాడు అక్షయ్. కావ్య కూడా అదే ఆఫీసులో ఫ్రెషర్‌గా జాయినైంది. అదే ఆఫీసులో కొత్తగా చేరిన సీమ, అక్షయ్ స్నేహితురాలని తెలిసి ఉడికిపోయింది కావ్య. రాజేష్ ప్రపోజల్‌కి కావ్య అంగీకరించకపోవడంతో ఆమెపై పనిభారం పెంచాడు. ఫైనాన్స్ టీమ్‌లో పనిచేసే మానస బిల్డింగ్‌పైనుంచి దూకి చనిపోయిందనే వార్త సంచలనం అయింది. అక్షయ్ వాళ్ళ అక్కాబావ యుఎస్ నుంచి వస్తున్నారని తెలిసి ఎంతో సంతోషిస్తాడు. ఇంతలో అక్కా, బావ యాక్సిడెంట్‌లో చనిపోయారనే వార్త అతణ్ణి అతలాకుతలం చేస్తుంది. స్నేహితులంతా వచ్చి పరామర్శిస్తుంటారు. ఫార్మాలిటీస్ పూర్తిచేసి డెడ్‌బాడీస్‌ని ఎయిర్‌పోర్టులో కలెక్ట్ చేసుకుంటాడు అక్షయ్.

ఆ తర్వాత...

వాళ్లమధ్యలో నుంచి దూరంగా వస్తూ కనబడుతోంది నైరా.

గుండ్రటి, తెల్లటిమొహం. భుజాల వరకూ ఉన్న సిల్కీహెయిర్. యెల్లో టీ షర్ట్, పైన బ్లూజీన్స్‌తో ఓవరాల్స్ వేసుకుని ఉంది. ఆమె చేతిలో డోరా బొమ్మ.

వెంటవస్తున్న అమ్మాయి మొహం చిటపటలాడుతోంది. ఎందుకొచ్చిన తద్దినంరా బాబూ అన్నట్లుంది ఆమె మొహం.

'నైరా' పిలుస్తూ దగ్గరకెళ్ళాడు అక్షయ్.

తల పైకెత్తి చూసిందామె. కళ్లు దిగులుగా ఉన్నాయి. అక్షయ్ ఆమెని దగ్గరకు తీసుకుని ఎత్తుకున్నాడు. ఎన్నోసార్లు వీడియోకాల్ చేసుండటంతోనో, తల్లి ఫొటోలు చూపించటం వల్లనో, అతనిలో తల్లి పోలికలు కనిపించబట్టో అతన్ని కరుచుకుపోయింది నైరా.

అప్పటివరకూ మొహం మాడ్చుకుని వెంట తీసుకొచ్చిన అమ్మాయి మొహం అక్షయ్‌ని చూడగానే వెలిగిపోయింది.

"థాంక్యూ. పాపని జాగ్రత్తగా తీసుకొచ్చారు" చెప్పాడు అక్షయ్.

"మై ప్లెజర్. నా పేరు లక్ష్మి. లక్కీ అని పిలవచ్చు మీరు. నా ఫోన్ నంబర్ ఇదిగోండి. వెరీ క్యూట్ బేబీ. పాపని చూడాలనిపిస్తే రావచ్చా?" అడిగిందామె.

పాప మీద ప్రేమ కాదనీ, అక్షయ్‌ని చూడగానే బిళ్ళబీటుగా పడిపోయిందనీ ముగ్గురికీ అర్థమైంది.

అక్షయ్ ఫోన్ నంబర్ ఇచ్చాకే కదిలిందామె.

"నైరా బేబీ!" ప్రేమగా తల నిమిరాడు అక్షయ్.

హర్ష డ్రైవ్ చేస్తున్నాడు. కారు ముందుకు కదిలింది.

అక్షయ్ నైరాని మాట్లాడించటానికి ప్రయత్నించాడు. అతని పక్కనే కూర్చుని చేయి గట్టిగా పట్టుకుని నిశ్శబ్దంగా బైటికి చూస్తోంది.

"నైరాకి అన్నీ మేనమామ పోలికలే వచ్చినట్లు న్నాయి" అంది సీమ.

"నిజం అక్కీ, అచ్చం నీ పోలికలే! నీ కూతురు అనుకుని నీకెవరూ పిల్లనివ్వరేమో!" నవ్వాడు హర్ష.

"లక్కీ డార్లింగ్ ఉందిగా. అక్కీ, లక్కీ పేర్లు కూడా రైమింగ్. కావ్య చూసుంటే చచ్చిపోయుం డేది" వెక్కిరించింది సీమ.

అక్షయ్ నవ్వాడు.

అతన్ని బాధ నుంచి మరిపించటానికి స్నేహి తులుగా వాళ్ల ప్రయత్నం వాళ్లు చేస్తున్నారు.

మాటల్లోనే ఇంటికొచ్చేశారు.

"వెల్‌కమ్ నైరా!" ఫ్లవర్స్‌తో రాసి, ఇల్లంతా బెలూన్స్‌తో డెకరేట్ చేసి ఉంది అతని అపార్ట్‌మెంట్.

కావ్య, బ్రహ్మి, సుధీర్ ఇంట్లోకి ఆహ్వానించారు.

లంచ్ తర్వాత అందరూ ఇళ్లకు బయల్దేరారు.

"థాంక్యూ! మీ అందరి సపోర్ట్ లేకపోతే నేను ఇంత త్వరగా కోలుకునేవాణ్ణి కాదు. నాకంటే లీవ్ ఉంది. మీరందరూ ఇక ఆఫీస్‌కి రెగ్యులర్‌గా వెళ్లండి. ప్రాజెక్ట్స్‌లో ఏమైనా తేడాలొస్తే బ్రహ్మి నన్ను తిట్టు కుంటారు" అన్నాడు అక్షయ్.

"అదేం లేదు అక్షయ్. మేము ఎలాగోలా మేనేజ్ చేసుకుంటాం. యూ టేక్ కేర్. ఏ అవసరం ఉన్నా ఫోన్ చేయి" చెప్పాడు బ్రహ్మి.

●●●

నైరాకి రూమ్ చూపించాడు అక్షయ్.

స్టఫ్‌డ్ టాయ్ డోరాని బెడ్‌మీద పెట్టింది నైరా.

మెల్లగా మంచం ఎక్కి బోర్లా పడుకుని మోచేతులు మడిచి అరచేతుల్లో మొహం పెట్టుకుని రూమ్ అంతా చూస్తోంది.

అక్షయ్ ఆసక్తిగా చూస్తున్నాడు.

'నైస్‌రూమ్' అంటూ అప్పుడే వాల్‌కి తగిలించి ఉన్న ఫొటోని చూసింది.

అది ఆమె తల్లిదండ్రులతో కలిసి ఉన్న ఫొటో.

లేచి ఫొటో దగ్గరకి వెళ్లి చూస్తూ కాసేపు నిల బడింది.

మళ్ళీ వచ్చి మంచం మీద పడుకుంది.

తన బాధ బైట పెట్టకుండా, వేరేవాళ్ళు ఇబ్బంది పడకుండా ఉండటానికి అంత పసివయసులోనూ ఆమె ప్రదర్శిస్తున్న పరిణతి చూస్తుంటే అక్షయ్‌కి కడుపు తరుక్కుపోతోంది.

●●●

సాయంత్రం నైరాని డిన్నర్‌కి బైటికి తీసు కెళ్లాడు అక్షయ్.

రెస్టారెంట్‌లో ఒక పక్కన పిల్లలు ఆడుకునే ప్లే ఏరియా ఉంది. ఆడుకోమంటే పెద్దగా ఆసక్తి చూపించలేదు. అక్షయ్ కూడా పెద్దగా రెట్టించలేదు.

"అక్కీ మామా, మనం మామ్‌డాడ్‌ల ఫ్యున రల్ చేయలేదేంటి?" అడిగింది నైరా.

ఖంగుతిన్నాడు అక్షయ్.

"నా ఫ్రెండ్ ట్రేసీ వాళ్ళ ఆంట్ చనిపోయినప్పుడు ఫ్యునరల్ చేశారు. వాళ్ళు మా ఇంటి పక్కనే ఉండే వారు" చెప్పింది.



"అలా చేస్తే వాళ్ళు ఏంజెల్స్ అవుతారట".

పక్కనేవున్న గ్లాస్‌విండోలో నుంచి బైట ఆకా శాన్నీ, నక్షత్రాలనీ చూపిస్తూ చెప్పింది.

"అదుగో.. అక్కడ బ్రైట్‌గా, కొంచెం పెద్దగా

ఉన్న టూ స్టార్స్ ఉన్నాయి చూడు. అవి నా పేరెంట్స్!"

"పొద్దున్న ఆకారం ఆరెంజ్ కలర్‌లోకి మారుతుంది చూడు. అప్పుడు వాళ్ళు మనకు గుడ్‌మార్నింగ్ చెప్తున్నారన్నమాట" ఉత్సాహంగా చెప్పింది.

అక్షయ్‌కి ఏం మాట్లాడాలో అర్థం కాలేదు. పిల్లలు వాళ్లలో వాళ్ల ఎన్ని కథలు అల్లుతారో అతనికి ఆశ్చర్యం కలిగించింది.

"యూఎస్‌లో మా ఇంట్లో నా రూమ్ నిండా టాయ్స్ ఉంటాయి. మా డాడీ నేనేది అడిగితే అది కొనిచ్చేవారు. కొనకపోతే నేను చాలా గొడవ చేసేదాన్ని" నోటికి చేయి అడ్డం పెట్టుకుని ముసిముసిగా నవ్వింది.

"మనం ఫ్యునరల్ ఎందుకు చేయలేదు!" మళ్లీ అడిగింది.

"ఇండియాలో ఫ్యునరల్ వేరేగా ఉంటుంది. నువ్వొచ్చేసరికి చేసేశాం" చెప్పాడతను.

"ఓ.కే. అయితే నా పేరెంట్స్ కూడా ఏంజెల్స్ అవుతారు. అప్పుడు నాకు ఏ ప్రాబ్లమ్ వచ్చినా వాళ్ళే చూసుకుంటారు" అంది.

అక్షయ్‌కి ఇటువంటి భ్రమలు పిల్లల్లో ఉండటం మంచిదో కాదో, లేకపోతే వాళ్ళ మానసిక పరిస్థితి మీద ప్రభావం పడి కాలక్రమేణా ఏమైనా ఇబ్బందులు ఎదుర్కోవలసి వస్తుందో అర్థం కావటం లేదు.

ఇబ్బందిగా కదిలి, నైరా తలనిమిరాడు.

ఆమెకి వాళ్లగురించి ఏదో ఒకటి మాట్లాడాలని ఉందని మాత్రం అర్థమవుతోంది అతనికి.

"నీకో సంగతి తెలుసా?" గుసగుసగా అంది నైరా.

ప్రశ్నార్థకంగా చూశాడు.

"స్టీఫెన్ హాకింగ్ చెప్పాడు కదా... ఎర్త్‌లో మనమున్నట్లే, వేరే ప్లానెట్స్‌లో కూడా లైఫ్ ఉంటుందని. అవి ఏలియన్స్ కాదు. గాడ్, చనిపోయిన వాళ్ళంతా అక్కడే ఉంటారు" కళ్ళు తిప్పుతూ చెప్పింది.

"ఏలియన్స్ సిగ్నల్స్ ఇస్తే మనని రెస్పాండ్ అవ్వొద్దన్నాడు కదా స్టీఫెన్. చిన్నప్పుడు అతను రెస్పాండ్ చేసేసరికి అప్పట్నుంచీ పారలైజ్ అయ్యాడట".

"ట్రేసీ చెప్పిందా?" అడిగాడు అక్షయ్.

"అవును. నాకు ట్రేసీ చాలా సంగతులు చెప్పేది. ఇక్కడ నాకు ఫ్రెండ్స్ లేరు. పేరెంట్స్ లేరు. ఈ కంట్రీ కొత్తగా ఉంది" దిగులుగా అంది.

"ట్రేసీ ఏజ్ ఎంత?" మాట మార్చాడు అక్షయ్.

"ఫైవ్. నా కంటే వన్ ఇయర్ పెద్ద" చెప్పింది.

"అయిదేళ్లకే ఇన్ని విషయాలు తెలుసా? పెద్ద ముదురులాగా ఉందే" నవ్వాడు.

"మామ్ ట్రేసీని మంత్రాల చింతక్క అని తిట్టుకునేది".

ఇద్దరూ నవ్వుకున్నారు కాసేపు.

పెద్దగా విసిగించకుండా తినేసింది నైరా.

ఇంటికెళ్లాక చెప్పింది.

"నా పేరెంట్స్‌ని అయితే చాలా విసిగించేదాన్ని. ఇది తినను... అది కావాలి అని. కానీ వాళ్లకి యాక్సిడెంట్ అయినప్పుడు ఒకవారం వేరే వాళ్ల దగ్గర ఉన్నా కదా. అప్పుడు వాళ్ల ఏం మాట్లాడినా, చెప్పింది వినకపోయినా చాలా కోప్పడేవారు. అందుకే అస్సలు గొడవ చేయట్లేదు".

అక్షయ్ కళ్ల తడి అయ్యాయి.

"ఇది నీ ఇల్లు. ఇక్కడ నిన్ను ఎవరూ ఏమీ అనరు. నీకు నేను. నాకు నువ్వు. మనిద్దరమే. అమ్మానాన్న దగ్గర ఎట్లా ఉన్నావో ఇక్కడా అలాగే ఉండాలి నువ్వు" దగ్గరకి తీసుకుని చెప్పాడు.

హగ్ చేసుకుని, బుగ్గమీద ముద్దుపెట్టి "గుడ్ నైట్!" చెప్పి తన రూమ్‌లోకి వెళ్లింది.

'అమెరికాలో పిల్లల్ని స్వతంత్ర భావాలతో పెంచుతారు. ప్రతి విషయం మీద స్పష్టమైన అవగాహన ఉంటుంది వాళ్లకు. నమ్మినదానికి వ్యతిరేకంగా ఏమైనా కొత్త థియరీలు పుట్టుకొచ్చినా, అది నమ్మదగ్గట్లుగా ఉంటే దానికి అనుగుణంగా మారటానికి కూడా రెడీగా ఉంటారు. అందుకే ఆ దేశం అంత ప్రగతి సాధిస్తోంది" అనుకున్నాడు.

'తమ పనులు తామే చేసుకోవటం, ఒక్కరే పడుకోవటం అన్నీ చిన్నప్పటి నుంచే అలవాటు చేస్తారు" అనుకున్నాడు.

నిద్రపట్టక హాల్లో సోఫాలో జేరగిలబడి కూర్చుని పైకి చూస్తూ ఆలోచిస్తున్నాడు. కాసేపటికి నైరా గదిలో లైట్ వెలిగింది.

అక్షయ్ దగ్గరకొచ్చింది. బొమ్మల బొమ్మల స్లీప్ వేర్‌లో ఉందామె.

"అక్కీ మామా!" పిలిచింది.

దగ్గరకు తీసుకుని ఒళ్లో కూర్చోబెట్టుకున్నాడు.

"నువ్వు కూడా చచ్చిపోతావా?" అడిగింది.

"అప్పుడు నాకెవరూ ఉండరు. వేరేవాళ్లయితే నన్ను కోప్పడతారు" మెడచుట్టూ చేతులేసి ఏడవటం మొదలెట్టింది.

"నిన్ను వదిలి ఎక్కడికీ వెళ్ళను. దేవుడు కూడా నన్ను తీసుకెళ్ళలేడు" స్థిరంగా చెప్పాడతను.

•••

ట్రేసీ పుణ్యమా అని చావు గురించి కొద్దో గొప్పో అవగాహన ఏర్పడింది నైరాకి.

కాసేపు దిగులుగా ఉన్నట్లనిపించినా మరి కాసేపు ఆడుకుంటూ గడిపేస్తోంది.

**ఆ ఇద్దరిలో ఎవరిని డేట్ చేస్తున్నావ్? సీమనా, కావ్యనా? అనడిగింది నైరా. ఉలిక్కిపడిన అక్షయ్ వాళ్లు నా ఫ్రెండ్స్ అన్నాడు. నీకు ఎవరు నచ్చారు? మళ్లీ అడిగాడు. రోహిణి లావుగా ఉంటుంది, సీమ అమెరికన్‌లా ఉంటుంది, కావ్య కొంచెం అమ్మలా ఉంటుంది అంది నైరా. నవ్వి, కావ్య మార్కులు బాగానే స్కోర్ చేసింది అనుకున్నాడు అక్షయ్. ఇంతలో నైరా, కానీ కావ్యతో ఒకటే ప్రాబ్లమ్! అంది. ఏమిటా ప్రాబ్లమ్? అక్షయ్ ఎలా రియాక్టయ్యాడు?**

ఆమెలో ఆ బెంగ కూడా లేకుండా చేయాలని అక్షయ్ తాపత్రయ పడసాగాడు. ఇప్పుడంటే తను ఇంట్లో ఉంటున్నాడు. ఇరవై నాలుగు గంటలూ ఆమెతో గడపగలుగుతున్నాడు. ఆఫీస్ మొదలయ్యాక? ఇంటర్‌నెట్ అంతా వెతికాడు. ఏవయినా ఎమోషనల్‌గా సపోర్ట్ చేసి ధైర్యాన్నిచ్చే సంస్థలున్నాయేమోనని. రాజేష్ తనకి తెలిసిన చైల్డ్ సైకాలజిస్ట్ నంబర్ ఇచ్చాడు.

అక్షయ్ ఆ డాక్టర్‌కి ఫోన్ చేశాడు.

శని, ఆదివారాల్లో తల్లిదండ్రులని కోల్పోయిన పిల్లలకి చిన్న క్యాంప్‌లాంటిది అరేంజ్ చేస్తున్నానని, నైరాని తీసుకురమ్మని చెప్పాడతను.

శనివారం బ్రేక్‌ఫాస్ట్ అవగానే రెడీ అయి డాక్టర్ చెప్పిన ప్రదేశానికి నైరాని తీసుకువెళ్లాడు.

చిన్న హాల్‌లా ఉందక్కడ.

చుట్టూ కుర్చీలు వేసున్నాయి.

మూడు, నాలుగేళ్ల నుంచీ పన్నెండేళ్ళ వరకూ ఉన్న పిల్లలు ఒక్కొక్కరుగా తమ గార్డియన్స్‌తో అక్కడికి చేరుకుంటున్నారు. కొందరు తల్లిని కోల్పోతే, ఇంకొందరు తండ్రిని కోల్పోయినవారు... మరికొందరు నైరాలా ఇద్దరినీ పోగొట్టుకున్నవాళ్ళు.

కొంతమంది పిల్లలు మరీ దిగాలుగా, జబ్బు చేసినట్లుగా ఉన్నారు. వాళ్లను చూస్తుంటే నైరా చాలా బెటరనిపించింది అక్షయ్‌కి. తొందరగా కోలుకుంటోంది.

తెల్లజుట్టు, కళ్లజోడు, తెల్లకోటుతో డాక్టర్ అక్కడికి చేరుకున్నాడు.

అతను కూడా వాళ్లమధ్యలో కూర్చుని, పిల్లలని ఉద్దేశించి మాట్లాడటం మొదలెట్టాడు.

"చావు అనేది తప్పనిసరి. అయితే ఆ విషయం పెద్దవాళ్లకు అర్థం అవ్వచ్చేమో కానీ పిల్లలకి అర్థం కాదు. అన్నేళ్ల ప్రేమగా పెంచినవారు అకస్మాత్తుగా కనిపించకుండా పోయారనే వాస్తవాన్ని తట్టుకోవడం ఏ పిల్లవాడికైనా కష్టమే! కొన్నిసార్లు 'నాకే ఎందుకలా జరిగింది' అనే నైరాశ్యంలో పడిపోతుంటారు పిల్లలు. మీరొక్కరే ఈ పరిస్థితిని ఫేస్ చేయట్లేదనీ, ఇంకా చాలామంది ఉన్నారనీ తెలియజెప్పటానికి, ఒకరినిచూసి మరొకరు ధైర్యం తెచ్చుకోవాలనే ప్రయత్నమే ఈ వర్క్‌షాప్".

"అందరం మన ఎక్స్‌పీరియెన్సెస్ షేర్ చేసుకుందాము".

ముందుగా తన చిన్నప్పటి సంగతి చెప్పసాగాడు.

ఒక సాధారణ వ్యవసాయ కుటుంబం నుంచి



వచ్చాడట అతను. ఊళ్లో వైద్య సదుపాయాలు సరిగాలేక అతడి చెల్లెలు పుట్టినప్పుడు తల్లీ, అతనికి ఐదేళ్లప్పుడు తండ్రీ మరణించారట. తాత గారింట్లో పెరుగుతుంటే మేనమామ భార్యకి వాళ్లు అక్కడ ఉండటం ఇష్టంలేక అనుక్షణం హింసపెడుతుండేది. తల్లిదండ్రులు లేరనే బెంగతోనో, ఆ టార్చర్‌కి తట్టుకోలేకో అతని చెల్లెలు మూడేళ్ల వయసులోనే చనిపోయింది. అక్కడుంచితే లాభం లేదని అతని తాత సిటీకి తీసుకొచ్చి ఒక అనాథ శరణాలయంలో చేర్చాడు. అక్కడే ఉంటూ చదువుకుని డాక్టర్ అయ్యాడట.

"మీరంతా మాలా ఏ అండా లేనివాళ్లు కాదు. మిమ్మల్ని ప్రేమగా చూసుకునేవాళ్లు ఉన్నారు. మీకోసం గట్టిగా నిలబడే వాళ్లుండబట్టే మీరు బాధపడకూడదని మిమ్మల్ని ఇక్కడికి తీసుకువచ్చారు. దాన్ని సద్వినియోగపరచుకోండి" చెప్పాడు.

పిల్లలు ఒక్కొక్కరు నెమ్మదిగా, ఓపెన్‌గా తమ ఫీలింగ్స్ చెబుతున్నారు.

"స్కూల్లో అమ్మ గురించి రాయమంటారు. ఏమి రాయాలి? అందరూ పేజీలు పేజీలు రాస్తారు. నాకు అమ్మెలా ఉంటుందో తెలీదు" చెప్పాడు ఒక బాబు. అతను పుట్టినప్పుడే తల్లి పోయిందట.

డబ్బు ఇబ్బందులతో తల్లిదండ్రులు పిల్లలకు కూడా పురుగుల మందు ఇచ్చి ఆత్మహత్య చేసుకున్నారట. అందరూ పోగా ఒక పాప మాత్రం బ్రతికింది. అయితే మందువల్ల బ్రెయిన్ ఎఫెక్ట్ అయి మాట్లాడలేకపోతోంది. ఆమె అమ్మమ్మ అక్కడికి తీసుకొచ్చింది.

"డబ్బు లేకపోతే బ్రతకలేమా? అమ్మ, నాన్న ఎందుకలా చేశారు?" రాసి చూపించింది.

అందరిదీ కాస్త అటు ఇటుగా ఒకటే బాధ.

ఆ వాతావరణం పెద్దవాళ్లకు కొద్దిగా డిప్రెసింగ్‌గా ఉన్నప్పటికీ, ఇలా తమకు మాత్రమే జరగలేదనే ఫీలింగ్ పిల్లలకు ఓదార్పునిస్తోంది.

పిల్లలే పెద్దవాళ్లుగా మారి తోటివాళ్లను ఓదారుస్తున్నారు. సలహాలిస్తున్నారు.

ఇంటికి వెళ్లేప్పుడు నైరా రోజూ కంటే ఉత్సాహంగా కనపడింది.

"ఐ యామ్ లక్కీ టు హావ్ యూ!" అక్షయ్ భుజం మీద చేయివేసి చెప్పింది దారిలో.

అక్షయ్‌కి ప్రపంచాన్ని జయించినంత సంతోషం కలిగింది.

●●●

ఆఫీస్‌కి హాలిడే అట ఆ రోజు.

సీమ వచ్చి నైరాతో ఆడుకుంది కాసేపు.

గాళ్స్ హ్యాంగవుట్ ఆట.

మరి కాసేపటికి కావ్య, రోహిణి కూడా అక్కడికి చేరుకున్నారు.

నైరాని బైటికి తీసుకెళ్లటానికి తమతో పంపటానికి అతికష్టం మీద అక్షయ్‌ని ఒప్పించారు. బైటికి తీసుకెళ్ళి ఆడించి, లంచ్, షాపింగ్ చేసి మళ్లీ ఇంటి దగ్గర దింపి వెళ్లారు.

రంగురంగుల నెయిల్ పెయింట్స్, హెయిర్ క్లిప్స్, రబ్బర్ బాండ్స్, బ్రేస్‌లెట్స్ ఇటువంటి సరుకంతా ఉంది బ్యాగ్‌లో. అవన్నీ తన రూమ్‌లో సర్దుకుంటోంది నైరా.

"బేబీ, వాళ్ళతో బోర్ అయ్యావా? కొత్తవాళ్లు కదా బెంగపడతావేమో అనుకున్నాను" అన్నాడు అక్షయ్.

"నో! ఐ హాడ్ ఫన్" చెప్పింది నైరా.

"ఆడపిల్లలకి అలంకరణ సామగ్రి ఉంటే చాలేమో" అనుకున్నాడు.

"సీమ, కావ్యలో ఎవరు నీ గాళ్‌ఫ్రెండ్? ఎవరిని డేట్ చేస్తున్నావు?" అడిగింది.

అదిరిపడ్డాడు అక్షయ్.

"ఎవరినీ డేట్ చేయట్లేదు. వాళ్లు నా ఫ్రెండ్స్ అంతే" అన్నాడు.

"నీకెవరు నచ్చారు ముగ్గురిలో" మళ్లీ తనే అడిగాడు.

"రోహిణి జిమ్‌కి వెళ్ళాలి, చాలా లావుగా ఉంది. సీమ అమెరికన్‌లా ఉంది. వెరీ ప్రెట్టీ. కావ్య కొంచెం అమ్మలాగా ఉంది" అంది.

"కావ్య పాయింట్లు బాగానే స్కోర్ చేసింది" నవ్వుకున్నాడు.

"కానీ కావ్యకి సీమ అంటే జెలసీ. అమ్మకి ఎవరన్నా జెలసీ ఉండదు. అమ్మ ఏంజెల్" కళ్ళు మెరుస్తుండగా చెప్పింది.

స్క్రాప్ బుక్ ఒకటి కొని తెచ్చుకుంది నైరా.

ఆల్బమ్స్ చూపించమని తల్లిదండ్రుల ఫొటోలు తీసి అందులో అతికించుకుంది.

ఫొటోస్ పక్కనే వాళ్ళ గురించి చాలాసేపు రాసుకుంటూ కూర్చుంది.

●●●

తల్లిదండ్రుల కోసం ఏర్పాటుచేసిన బెడ్ రూంలో స్క్రాప్ బుక్ పెట్టుకుంది నైరా.

ఒక షూ బాక్స్ మొత్తం పేపర్ టవల్స్ కుక్కి చిన్న హోల్ చేసింది. దాని పేరు స్క్రీమ్ బాక్స్ అట. వాళ్లను చాలా మిస్ అవుతున్నప్పుడు ఆ బాక్స్‌కి ఉన్న హోల్‌లో నోరు పెట్టి గట్టిగా అరుస్తుందట. అలా అరిస్తే తన తల్లిదండ్రులకు వినిపిస్తుందట. ఆ బాక్స్ మీద తనకి చేతనైనట్టుగా తల్లిదండ్రుల బొమ్మలు గీసింది. బాక్స్ అంతా మెరిసే స్టిక్కర్స్ అతికించుకుంది.

ఒక షెల్ఫ్‌కి వాల్కానో రూమ్ అని పేరు పెట్టుకుంది.

అందులో పంచింగ్ బ్యాగ్, పాత పుస్తకాలు ఉన్నాయి.

వాళ్ల మీద బాగా కోపం వచ్చినప్పుడు పంచింగ్ బ్యాగ్ మీద పంచ్ చేస్తుందట. లేదా ఆ పాత బుక్స్‌లో పేజెస్ చింపేస్తుందట.

"కోపం ఎందుకమ్మా?" ఆశ్చర్యంగా అడిగాడు అక్షయ్.

"ఆ రోజు బైటికి నన్ను తీసుకెళ్లకుండా వెళ్లారు. నేను ఇంట్లో నానీతో ఉండిపోయాను. వాళ్లతో తీసుకెళ్ళనందుకు" ఉక్రోషంగా అంది.

"నువ్వు లేకపోతే నాకెవరుంటారు. నాకోసమే నిన్ను ఆ రోజు తీసుకెళ్లలేదు" చెప్పాడు అక్షయ్.

●●●

ఇద్దరూ నెమ్మదిగా రొటీన్‌కి అలవాటు పడుతున్నారు.

పొద్దునే లేచి అక్షయ్ ఎక్సర్‌సైజ్ చేస్తుంటే నైరా బ్రష్ చేసుకుంటూ కబుర్లు చెప్తుంది.

తర్వాత పాలు వేడి చేసుకుని తాగుతారు.

టోస్టర్‌లో బ్రెడ్‌పెట్టి బటర్, జామ్ వేసుకుని, బాయిల్డ్ ఎగ్స్‌తో తింటారు.

తర్వాత అతను పేపర్, కంప్యూటర్ చూస్తుంటే, ఆమె ఫోన్‌లో కాసేపు కాండీక్రష్ ఆడుకుంటుంది. డాల్స్‌కి స్నానాలు చేయించి, డ్రెస్‌లు మార్చటం



## జైతో అంజలి 'జర్నీ?'

ఇటీవలి కాలంలో అంజలి తెలుగు సినిమాల్లో కనిపించడమే మానేసింది. అవడానికి తెలుగమ్మాయే అయినా కోలీవుడ్‌లోనే ఎక్కువ సినిమాలు చేసింది. ఇప్పుడు కోలీవుడ్ హీరో జైతో ప్రేమలో పడిందనీ, పెళ్ళి కూడా చేసుకుందన్న రూమర్లు వినపడుతున్నాయి. ఈ ఇద్దరూ 'జర్నీ'లో చేశారు. అప్పటినుంచీ ఇద్దరి మధ్య ప్రేమ వ్యవహారం నడుస్తోందనీ, ఇప్పుడు పెళ్ళి కూడా అయిపోయిందని అంటున్నారు. సినిమాల్లో అదృష్టం కలిసి రావడం లేదు కనుక పెళ్ళి చేసుకుని జీవితంలో సెటిల్ అవ్వాలని అంజలి భావిస్తోందట! తెలుగింటి సీతమ్మ పేరు పడిన అంజలికి ఇక్కడ అభిమానులు చాలా మందే ఉన్నారు. వారు కూడా అంజలి పెళ్ళి వార్తలు విని షాకవుతున్నారట! కాకపోతే అంజలి నుంచి ఎలాంటి కన్ఫర్మేషన్ రావడం లేదు కనుక ఇది రూమరే అని మరికొందరు అంటున్నారు.

లాంటి పనులు చూస్తుంది.

కుక్కర్‌లో రైస్ పెట్టుకుని, యూట్యూబ్‌లో కర్రీ వండే విధానం చూస్తూ అతను వండుతాడు.

అదే టైమ్‌లో తన దగ్గరున్న వంటపాత్రల బొమ్మలతో నైరా బొమ్మల వంట పూర్తి చేస్తుంది.

ఈవెనింగ్ ఇద్దరూ వాకింగ్‌కి వెళ్తారు.

"మామ్! నువ్వే బెటర్ అమ్మ కంటే" అందొక రోజు నైరా, వాకింగ్ చేస్తుండగా.

ఆశ్చర్యంగా చూశాడు.

"అమ్మ ఇడ్లీ తినమనేది" ఫిర్యాదుగా చెప్పింది.

"నువ్వయితే హోమ్‌వర్క్ కూడా చేయమనవు" ఆనందంగా అంది.

అప్పుడు స్ట్రయిక్ అయింది అతనికి.

"ఎన్నాళ్ళిలా? స్కూల్లో చేర్పాలి నైరాని. లేకపోతే తన ఏజ్ పిల్లల కంటే వెనకబడిపోతుంది."

ఇంటికి రాగానే పిల్లలున్న కొలీగ్స్‌కి ఫోన్ చేసి ఎంక్వైరీ చేశాడు.

ఇంటికి దగ్గరగా ఉన్న కార్పొరేట్ స్కూల్‌లో



జాయిన్ చేయదల్చుకున్నాడు.

అక్కడ సీట్ దొరకటం చాలా కష్టమట. కానీ నైరా అమెరికన్ ఆక్సెంట్‌కి ముచ్చటపడి చేర్చుకున్నారు.

ఇంటికి వస్తున్నప్పుడు అడిగింది నైరా.

"ఇంగ్లీష్ అంటే నాలెడ్జ్ కాదు కదా. స్పానిష్, ఫ్రెంచ్, తెలుగులాగే అదీ ఒక భాష. ఇండియన్స్ ఎందుకంత ఎగ్జయిట్ అవుతారు ఇంగ్లీష్ గురించి?"

ఏమి చెప్పాలో తెలీక నవ్వేశాడతను.

ఆ వారం అంతా అతనికి నైరా స్కూల్ షాపింగ్‌తోనే సరిపోయింది.

బుక్స్, యూనిఫామ్, షూస్ అన్నీ ఆ స్కూల్ వాళ్లు సూచించిన షాప్స్‌లోనే తెచ్చుకోవాలి. అవి కాక బ్యాగ్, స్వెట్టర్‌లాంటి సామగ్రి.

లంచ్ స్కూల్లోనే ఇచ్చే ఆప్షన్ సెలక్ట్ చేసుకుని, దానికి కావలసిన డబ్బు స్కూల్ ఫీజ్‌తోపాటు కట్టేశాడు.

ఇంటిదగ్గరే కాబట్టి తనే డ్రాప్ చేసి, పికప్ చేసుకోవచ్చు.

కంపెనీ హెచ్‌ఆర్‌కీ, తన మేనేజర్ రాజేష్‌కీ ఫోన్‌చేసి రోజూ రెండు నుంచి నాలుగు మధ్యలో అందుబాటులో ఉండననీ, పొద్దున పది నుంచి రెండు వరకు ఆఫీస్ నుంచి, తర్వాత నాలుగు నుంచి ఇంట్లో నుంచి వర్క్ చేస్తాననీ ప్రపోజల్ పెట్టాడు. అతని సిన్సియారిటీ తెలిసినవారూ, అతని పరిస్థితి అర్థం చేసుకుని ఉండటంతో ఎటువంటి ప్రశ్నలూ వేయకుండా సరే అన్నారు.

ఇంకో రెండు రోజుల్లో మళ్లీ తను ఆఫీస్‌కి వెళ్ళటం మొదలెట్టాలి. నైరా స్కూల్‌కి.

స్కూల్లో ఎలా ఉంటుందో ఆమెకి.

కొంచెం బెంగగా ఉందతనికి.

ఆమె క్లాస్ టీచర్ నంబర్ తీసుకుని ఫోన్లో మాట్లాడాడు.

"మీరేమీ వర్రీ అవకండి. నేను హాండిల్ చేస్తాను" చెప్పిందామె. మృదువుగా ఉందామె గొంతు.

"మా అబ్బాయికి రెండేళ్ళున్నప్పుడు నా హజ్బెండ్‌కి కేన్సర్ అని తేలింది. సరిగ్గా వాడు స్కూల్లో చేరే టైమ్‌కి వాడికి తండ్రి లేకుండా పోయాడు. ఆ బాధేంటో నాకు తెలుసు. నేను జాగ్రత్తగా చూసుకుంటాను" చెప్పింది.

ప్రపంచంలో ప్రతివాళ్లకీ ఏవో ఒకటి బాధలున్నాయనిపించిందతనికి.

పసివాళ్లు ఇంతమంది పేరెంట్స్‌లో ఒకరినో, ఇద్దరినో పోగొట్టుకోవటం ఇప్పుడే వింటున్నాడు తను. లేకపోతే ఇదివరకు ఆ విషయం తనను కదిలించలేదేమో!

చాలాసార్లు మనవరకూ వస్తేకానీ కొన్ని విషయాల్లోని తీవ్రత అర్థం కాదేమో.

•••

శుక్రవారం సాయంత్రం.

అంతా అక్షయ్ ఇంట్లో చేరారు.

అతనిని, నైరాని వీలైనంత త్వరగా మనుషుల్లోకి తీసుకురావటానికి స్నేహితులుగా వాళ్ల ప్రయత్నం వాళ్లు చేస్తున్నారు.

అందరూ కూర్చుని 'ఊనో' ఆడుతున్నారు. పేకలాంటి కార్డ్స్ గేమ్ ఊనో. పిల్లలు ఆడే ఆట అది. ఎవరి దగ్గర కార్డ్స్ ముందు అయిపోతాయో వాళ్లు గెలిచినట్లు లెక్క.

సీమ, అక్షయ్ పక్కన కూర్చుంది. నైరా కావ్యకీ, హర్షకీ మధ్యలో ఉంది.

కావ్య సీమని అప్పుడప్పుడూ అనుమానంగా చూస్తోంది.

హర్ష ఫోన్‌లో అందరికీ సుపరిచితమైన మెసేజ్ టోన్.

"ఇంకా వస్తున్నాయా మెసేజెస్?" అడిగాడు అక్షయ్.

మొహమాటంగా తలూపాడు హర్ష.

"చదువు... చదువు...!" అంది సీమ.

అతని సిగ్గు చూసి రోహిణి అంది.

"పర్సనల్ ఏమో. పైకి ఎందుకులే చదవటం?"

"పర్సనలా, పాడా? పర్సనల్‌గా పంపటానికి ఈ బుద్ధూ సరిగ్గా స్పందించాలిగా ముందు, మెలికలు తిరుగుతుంటే ఇంకేముంటుంది?" తీసిపారేసింది సీమ.

కొరకొరా చూశాడు హర్ష.

తర్వాత మెసేజ్ చూపించాడు.

"నో వర్డ్స్" స్క్రిప్ట్ రాక్ బాండ్ వాళ్ల పాటలోని లిరిక్స్ అవి.

"ఒక పూటంతా న్యూస్ గురించి మాట్లాడగలను. కరెంట్ అఫైర్స్, వాటి మీద నా అభిప్రాయాలు వెలిబుచ్చగలను.

ఒక సంవత్సర కాలం నెట్‌లో ఉన్న విషయాల గురించి మాట్లాడగలను. నువ్వు చూడని సైట్స్ లింక్స్ పంపగలను.

రోజుల తరబడి రాజకీయాల గురించీ, చేతికి మట్టి అంటకుండా చేసే కుట్రల గురించీ మాట్లాడగలను.

షేక్స్పియర్ పోయెట్రీని నీకు అర్థమయ్యే భాషలో అందంగా అనువదించగలను.

కానీ నీ గురించి వర్ణించటానికి మాటలు దొరకవేమిటి?.

"వావ్... సో రొమాంటిక్" అన్నారు ఆడవాళ్లంతా.

అక్షయ్ నవ్వుకుంటున్నాడు.

హర్ష మొహం ఎర్రగా అయింది.

"సిగ్గుపడుతున్నాడు. వదిలేయండి" అన్నాడు బ్రహ్మి.

"మేడమ్ మిమ్మల్ని ఏమనరా? ఎప్పుడూ మాతోనే ఉంటారు?" అమాయకంగా అడిగింది కావ్య.

బ్రహ్మి మొహం మాడిపోయింది.

అక్షయ్ టాపిక్ మార్చబోతుండగా సరిగ్గా అప్పుడే తలుపు తోసుకుని లోపలికొచ్చింది లక్కీ.

గబగబా నైరా దగ్గరకెళ్ళింది.

"ఓ బేబీ... మ్మ్" అంది.

నైరా లక్కీని చూడగానే హర్ష వెనక నక్కింది.

"సారీ, మొన్న ఫోన్ చేశారు కదా, ఈ రోజు వస్తారని మర్చిపోయాను" అన్నాడు అక్షయ్.

"దట్స్ ఓకే అక్షయ్. ఐ మిస్డ్ హర్ సోమచ్. చూడాలనిపించి వచ్చేశాను" అంది లక్కీ.

"ఒక్కరోజు ఫ్లైట్లో వెంటబెట్టుకొచ్చినందుకే?" వెటకారం ధ్వనిస్తోంది సీమగొంతులో.

"పిల్లలంటే నాకు చాలా ఇష్టం" అక్షయ్ పక్కన కూర్చుంటూ చెప్పింది లక్కీ.

"మగపిల్లలంటేనా?" గబాల్న అనేసింది సీమ.

అర్థం కానట్లు ప్రవర్తించింది లక్కీ.

మొదటిసారి కావ్యకి సీమ ముద్దొచ్చింది.

సీమ అటూ ఇటూ కదులుతున్నప్పుడు ఆమె జుట్టు గాలికి ఎగురుతూ హర్షకి తగులుతోంది.

"కొంచెం జుట్టు టై చేసుకుంటావా ప్లీజ్!" చిరాగ్గా మొహం పెట్టాడు హర్ష.

"ఈ హర్షకి అంత రొమాంటిక్ మెసేజెస్ అవసరమా? ఆ పిల్లకి బుర్రలేదు" అంది సీమ కోపంగా.

పిజ్జా ఆర్డర్ చేసుకుని తిన్నారంతా.

లక్కీ వెళ్లిపోయిందని రూఢీ అయ్యాకే మిగతా అందరూ ఇళ్లకు కదిలారు.

**(ఇంకావుంది)**



**వేకువపాట**
కథా సంపుటి
వారణాసి నాగలక్ష్మి
**ధర:** 150 రూపాయలు
**పేజీలు:** 248
**ప్రతులకు:** అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు

ఇందులోని కథలన్నింటికీ కేంద్రం కుటుంబమే. మధ్య తరగతి కుటుంబాల్లో సడలిపోతున్న అనుబంధాల నుంచి పుట్టిన ఆవేదనకు ప్రతిరూపమే ఈ కథలు. జీవితం పట్ల అపారమైన ప్రేమ, జీవితాన్ని అసంగతంగా మారుస్తున్న వ్యామోహాలపట్ల అసహనం కనబరిచిన 19 కథల సమాహారమీ సంపుటి.

---

**కాన్పుల దిబ్బ**
కథలు
డాక్టర్ చింతకింది శ్రీనివాసరావు
**ధర:** 110 రూపాయలు
**పేజీలు:** 124
**ప్రతులకు:** ప్రముఖ పుస్తక దుకాణాలు



దాలప్పతీర్థం కథల సంపుటితో తనదైన విశిష్టముద్ర వేసిన రచయిత శ్రీనివాసరావు పది కథల తాజా సంపుటి ఇది. థింక్ గ్లోబల్లీ యాక్ట్ లోకల్లీ అన్న సామెత చందంగా కళింగాంధ్ర స్థానిక జీవితాలను, ప్రపంచాన్ని చుట్టివచ్చే కథలివన్నీ.

---



**మహాప్రస్థానం**
కథానికల సంపుటి
చెన్నూరి సుదర్శన్
**ధర:** 99 రూపాయలు
**పేజీలు:** 180
**ప్రతులకు:** అన్ని ప్రముఖ పుస్తక దుకాణాలు

రాష్ట్ర ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీత చెన్నూరి సుదర్శన్. వృద్ధుల మానసిక క్షోభను గుండె తరుక్కు-పోయేలా ఆవిష్కరించిన 18 కథానికల పుస్తకమిది. క్లుప్తత, స్పష్టతతో అంతర్జాల పత్రికాపాఠకులను అలరించిన కథలివి.

---

**సింగరాజు లింగమూర్తి కథలు**
మొదటి సంపుటం
**ధర:** 170 రూపాయలు
**పేజీలు:** 244
**ప్రతులకు:** నవచేతన, ప్రజాశక్తి, నవ తెలంగాణ బుక్‌హౌస్ బ్రాంచీలు.



నిజాయితీ నిబద్ధతగల రచయిత లింగమూర్తి (1922-74). ముప్పై ఏళ్లపాటు ప్రతి నిమిషం రచనలకే కేటాయించిన దీక్షాపరుడు. నలభయ్యేళ్ల తర్వాత వస్తున్న ఆయన రచనల్లో భాగంగా 24 కథలు, నాటికతో వెలువడిన మొదటి సంపుటమిది.

# ఫిలిమ్ జర్నలిజానికి కొత్తబాట చూపిన పుస్తకం




## దేవుడులాంటి మనిషి

**రచన:** **యు.వినాయకరావు**, **ధర:** 1200 రూపాయలు
**పేజీలు:** 562, **ప్రతులకు:** జయా పబ్లికేషన్స్, ఫ్లాట్ నెం.102, శ్రీశ్రీ శ్రీనివాస నిలయం, 7-1-303/డి/2, బాలయ్యనగర్, సంజీవరెడ్డి నగర్, హైదరాబాద్-38
సెల్: 9885179428



తెలుగు చిత్రపరిశ్రమలో 'హీరోకృష్ణ' అని పిలిపించుకునేది సూపర్‌స్టార్ కృష్ణ ఒక్కరే! ఎనభైరెండేళ్ల తెలుగు చిత్రపరిశ్రమ ప్రస్థానంలో యాభైఏళ్ల చరిత్రను నమోదుచేసుకున్న నటశేఖరుడు ఆయన. 365 చిత్రాల్లో నటించి ఎన్నో రికార్డులు సృష్టించి ప్రేక్షకులను ఉర్రూతలూగించిన వ్యక్తి.

కృష్ణ నట జీవితం రికార్డులమయం. సంచలనాలు, సాహసోపేత నిర్ణయాలే జీవితంగా ముందుకు సాగిపోయారు. అందుకే డేరింగ్ అండ్ డాషింగ్ హీరో, ఆంధ్రాజేమ్స్ బాండ్‌గా తెలుగువారి హృదయాల్లో చిరస్థానం పొందారు. మంచితనానికి తలవంచే మానవత్వం మూర్తీభవించిన వ్యక్తిగా పరిశ్రమలో పేరుపొందారు. అందుకే ఆయన్ను 'దేవుడులాంటి మనిషి' అంటారు. అంతటి గొప్ప నటుడి సినీ జీవిత చరిత్రను నభూతో నభవిష్యత్ అన్న చందంగా అక్షరబద్ధం చేశారు ప్రముఖ ఫిలిమ్ జర్నలిస్టు యు.వినాయకరావు. తెలుగు రాష్ట్రాల్లో విస్తారంగా పర్యటించి శ్రమదమాదులకోర్చి మూడు సంవత్సరాల అవిరళ కృషితో ఈ పుస్తకాన్ని రూపొందించారు వినాయకరావు. భారతదేశంలోనే మొదటిసారిగా టాబ్లాయిడ్ సైజులో 562 పేజీలతో దశాబ్దాలక్రితంనాటి అపురూపమైన వేలాది ఫొటోల సమాహారంగా సూపర్ స్టార్ కృష్ణ ఇమేజ్‌కు తగ్గట్టు ఈ పుస్తకాన్ని తీర్చిదిద్దారు.

హీరోగా రికార్డుల సృష్టికర్త, సాహస చిత్రాల నిర్మాత, దర్శకుడు, అపార జ్ఞాపకశక్తి, సినిమా నాలెడ్జ్, ఏకాగ్రతలున్న బహుముఖీనమైన కృష్ణ వ్యక్తిత్వం, సినీ జీవితాన్ని సమగ్ర సమాచారంతో జనరంజకంగా ఆవిష్కరించిన పుస్తకమిది.

ఎన్టీఆర్ స్ఫూర్తితో 19 ఏళ్ళ వయసులో చిత్రరంగ ప్రవేశం చేశారు కృష్ణ. 'పదండి ముందుకు' చిత్రంతో సినీరంగజీవితం ఆరంభించి, గూఢచారి 116, మోసగాళ్లకు మోసగాడు, అల్లూరి సీతారామ రాజు చిత్రాలతో కొత్త ట్రెండ్ సృష్టించి పరిశ్రమలో వేళ్లానుకున్నారు. ఒక్కఏడాదిలోనే 12 చిత్రాల్లో నటించి వాటిల్లో 8 హిట్లుకొట్టిన ఘనత ఆయనదే! తొలి సినిమాస్కోప్ టెక్నోవిజన్ టెక్నాలజీ, 70 ఎంఎం స్టీరియోఫోనిక్‌సౌండ్‌తోపాటు దక్షిణాదిన తొలిసారి ఆర్వో కలర్, ఈస్ట్‌మన్ కలర్ చిత్రాలను ప్రవేశపెట్టింది ఆయనే. స్వీయదర్శకత్వంలో మూడున్నరకోట్లతో ఆయన నిర్మించిన సింహాసనం చిత్రం చరిత్ర సృష్టించింది. ఒక హిందీ చిత్రానికి దర్శకత్వం వహించిన తొలి తెలుగు చిత్రకథానాయకుడు ఆయనే! సరికొత్త ఆలోచనలకు ఆయన ప్రతిరూపం.

విద్యార్థిగా ఉన్నప్పటినుంచీ ఎన్టీఆరే కృష్ణకు స్ఫూర్తి. 'స్పర్థయా వర్ధతే విద్య' అన్నచందంగా సినీదిగ్గజం ఎన్టీఆర్‌తో అన్నిటా పోటీపడి ఎదిగారు కృష్ణ. ఆయనతో కలిసి ఎన్నో చిత్రాల్లో నటించడమే కాదు, రాజీవ్‌గాంధీ ఆదేశాలతో ఎన్టీఆర్‌పై రాజకీయ వ్యంగ్యచిత్రం నిర్మించారు.

ఎంతోమంది సినీ ప్రముఖులు కృష్ణ గుణగణాలను కీర్తించారు. అవన్నీ వినాయకరావు ఇందులో నిక్షిప్తం చేశారు. నిజానికి కృష్ణ చిత్ర పరిశ్రమకు గొప్ప మార్గదర్శి. ఇంత గొప్ప వ్యక్తి జీవితాన్ని గ్రంథస్థం చేసిన వినాయకరావు బాలీవుడ్, మాలీవుడ్, కోలీవుడ్ సహా ఇతర ఫిలిమ్ జర్నలిస్టులకందరికీ మార్గదర్శిగా నిలిచారు.

అదేవిధంగా సినిమా జర్నలిస్టుల ఉనికి, వారి పరిణామక్రమానికి సంబంధించిన లోతైన వివరాలను పాఠకులకు తెలియజేసే ఎ.ఎన్ జగన్నాథశర్మగారి ముందుమాట ఈ పుస్తకానికి మరో హైలైట్.

**-లలితా త్రిపుర సుందరి**

# సౌభాగ్య చక్రం

జనవరి 11 నుంచి
జనవరి 17 వరకు

శ్రీ బిజుమళ్ళ బిందుమాధవశర్మ



**మేషం (మార్చి 21 - ఏప్రిల్ 20 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలు, పెద్దల ఆరోగ్యం, వేడుకలు, ఆర్థిక వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో బదిలీలు, మార్పులు కొంత అసౌకర్యం కలిగిస్తాయి. ఉన్నత పదవులు అందుకుంటారు. కుటుంబ వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం. 13, 14 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో సృజనాత్మకంగా వ్యవహరించి లక్ష్యాలు సాధిస్తారు. చిన్నారుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 15, 16, 17 తేదీల్లో పెద్దల ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపించాలి. ఉన్నత పదవులు అందుకుంటారు. ఉద్యోగ ప్రయత్నాలు ఫలిస్తాయి. వృత్తి, వ్యాపారాల్లో ప్రోత్సాహకరంగా ఉంటుంది.



**వృషభం (ఏప్రిల్ 21 - మే 21 మధ్య పుట్టినవారు)**

చిన్నారులు, విద్యా విషయాలు, బదిలీలు, వృత్తి వ్యాపారాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ప్రయాణాలు, చర్చల్లో నిదానం పాటించండి. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. శుభవార్త అందుకుంటారు. 13, 14 తేదీల్లో బంధుమిత్రులను కలుసుకుంటారు. కుటుంబ వ్యవహారాల్లో శుభపరిణామాలు సంభవం. బదిలీ ప్రయత్నాలు ఫలిస్తాయి. 15, 16, 17 తేదీల్లో అంచనాలు ఫలించకపోవచ్చు. ప్రియతములకు సంబంధించిన సమాచారం ఉల్లాసం కలిగిస్తుంది. విద్యార్థులకు శుభప్రదం. దూరంలో ఉన్న బంధుమిత్రుల రాక ఉల్లాసం కలిగిస్తుంది.



**మిథునం (మే 22 - జూన్ 21 మధ్య పుట్టినవారు)**

బదిలీలు, రియల్ ఎస్టేట్ వ్యవహారాలు, ఆర్థిక వ్యవహారాలు, వేడుకలపై ఈ వారం శ్రద్ధ పెడతారు. బుధ, గురువారాల్లో ఖర్చులు అంచనాలు మించే అవకాశం ఉంది. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. పెట్టుబడులు లాభిస్తాయి. 13, 14 తేదీల్లో రుణాలు, పెట్టుబడుల విషయాలు చర్చకు వస్తాయి. స్టేషనరీ, రవాణా, బోధన, పర్యాటక రంగాల వారికి ఆర్థికంగా ప్రోత్సాహకరం. 15, 16, 17 తేదీల్లో రియల్ ఎస్టేట్ రంగంలోని వారు ఆచితూచి వ్యవహరించాలి. కుటుంబ సభ్యుల ఆరోగ్యం మెరుగవుతుంది. ఇంటి కోసం విలువైన వస్తువులు సమకూర్చుకుంటారు.



**కర్కాటకం (జూన్ 22 - జులై 22 మధ్య పుట్టినవారు)**

సమావేశాలు, కుటుంబ వ్యవహారాలు, స్పెక్యులేషన్లు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. శ్రీవారు, శ్రీమతి విషయాల్లో శుభపరిణామాలు సంభవం. 13, 14 తేదీల్లో స్పెక్యులేషన్లు లాభిస్తాయి. ప్రియతముల కోసం విలువైన వస్తువులు కొనుగోలు చేస్తారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 15 16, 17 తేదీల్లో సోదరీసోదరుల విషయాల్లో శుభపరిణామాలు సంభవం. కీలక సమాచారం అందుకుంటారు. కాంట్రాక్టులు, అగ్రిమెంట్లు లాభిస్తాయి. బంధుమిత్రులతో ఉల్లాసంగా గడుపుతారు.



**సింహం (జులై 23 - ఆగస్టు 23 మధ్య పుట్టినవారు)**

ఇంటర్వ్యూలు, ప్రేమానుబంధాలు, స్పెక్యులేషన్లపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన ఒక సమాచారం ఆందోళన కలిగిస్తుంది. ఆరోగ్యం మెరుగుపడుతుంది. గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. 13,14 తేదీల్లో కొత్త పనుల ప్రారంభానికి అనుకూలం. వృత్తి, వ్యాపారాల్లో ఉత్సాహంగా ఉంటుంది. వేడుకలు, విందుల్లో పాల్గొంటారు. 15, 16, 17 తేదీల్లో విందు వినోదాల్లో ఖర్చులు అధికం. అదనపు ఆదాయం కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. వైద్యం, హోటల్ రంగాల వారికి శుభప్రదం. ఆస్పత్రులు, హోటల్, ఫార్మారంగాల వారికి ప్రోత్సాహకరం.



**కన్య (ఆగస్టు 24 - సెప్టెంబర్ 22 మధ్య పుట్టినవారు)**

చిన్నారుల విషయాలు, పొదుపు పథకాలు, విద్యా విషయాలలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఖర్చులు అధికం. పెట్టుబడులు లాభిస్తాయి. ప్రియతముల వైఖరి ఉల్లాసం కలిగిస్తుంది. 13, 14 తేదీల్లో దూరంలో ఉన్న ప్రియతముల కలయిక ఆనందం కలిగిస్తుంది. ఉన్నత విద్య కోసం చేసే ప్రయత్నాలు ఫలిస్తాయి. రాజకీయ, సినీ రంగాల వారికి శుభప్రదం. 15, 16, 17 తేదీల్లో విద్యార్థులు లక్ష్య సాధనకు అధికంగా శ్రమించాలి. పెట్టుబడులు లాభిస్తాయి. ప్రేమానుబంధాలు బలపడతాయి. సృజనాత్మక ప్రతిభకు గుర్తింపు లభిస్తుంది.



**తుల (సెప్టెంబర్ 23 - అక్టోబర్ 23 మధ్య పుట్టినవారు)**

గృహ, విద్యా విషయాలు, వేడుకలు, పొదుపు పథకాలు, ప్రేమానుబంధాలకు ఈ వారం ప్రాధాన్యం ఉంటుంది. బుధ, గురువారాల్లో సమావేశాల్లో నిదానం పాటించండి. బదిలీలకు అనుకూలం. పైఅధికారుల వైఖరి ఆనందం కలిగిస్తుంది. 13, 14 తేదీల్లో వేడుకల్లో పాల్గొంటారు. ప్రముఖులను కలుసుకుంటారు. వృత్తి, వ్యాపారాల్లో మార్పులకు అనుకూలం. పెట్టుబడులు లాభిస్తాయి. 15, 16, 17 తేదీల్లో వేడుకలకు ఏర్పాట్లలో అసౌకర్యం కలిగే అవకాశం ఉంది. వాయిదా పడుతున్న పనులు పట్టుదలతో పూర్తి చేస్తారు. బంధుమిత్రుల కలయిక ఉల్లాసం కలిగిస్తుంది.



**వృశ్చికం (అక్టోబర్ 24 - నవంబర్ 22 మధ్య పుట్టినవారు)**

చర్చలు, విద్యా విషయాలు, పెట్టుబడులు, బదిలీలు, నిర్మాణాలకు ఈ వారం ప్రాధాన్యం ఇస్తారు. బుధ, గురువారాల్లో పెట్టుబడులకు సంబంధించిన చర్చలు, సమావేశాల్లో నిదానం పాటించండి. విద్యార్థులకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. ఒక సమాచారం ఆనందం కలిగిస్తుంది. 13, 14 తేదీల్లో ఇంట్లో సందడి వాతావరణం నెలకొంటుంది. ఇంటర్వ్యూలలో విజయం సాధిస్తారు. ప్రముఖులతో సమావేశాలు ఫలిస్తాయి. 15, 16, 17 తేదీల్లో ఆర్థిక విషయాలకు సంబంధించిన ఒక సమాచారం కలవరపెడుతుంది. స్నేహానుబంధాలు బలపడతాయి. సమావేశాలు ఫలిస్తాయి.



**ధనుస్సు (నవంబర్ 23 - డిసెంబర్ 21 మధ్య పుట్టినవారు)**

విద్యా విషయాలు, పెట్టుబడులు, సోదరీసోదరుల వ్యవహారాలపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. పెట్టుబడులు లాభిస్తాయి. రుణప్రయత్నాలు సఫలం అవుతాయి. 13, 14 తేదీల్లో ఆర్థిక వ్యవహారాలకు సంబంధించి కొత్త వ్యూహాలు అమలు చేస్తారు. పెట్టుబడులకు సంబంధించిన చర్చలు ఫలిస్తాయి. రుణాలు మంజూరవుతాయి. 15, 16, 17 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. అదనపు ఆదాయం లభిస్తుంది. పెద్దల సహకారంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆర్థికపరమైన అంచనాలు తప్పే అవకాశం ఉంది.



**మకరం (డిసెంబర్ 22 - జనవరి 20 మధ్య పుట్టినవారు)**

వృత్తి, వ్యాపారాలకు సంబంధించిన వ్యూహాలు, పెట్టుబడులపై ఈ వారం దృష్టి పెడతారు. బుధ, గురువారాల్లో శ్రీవారు, శ్రీమతి విషయాల్లో కీలక నిర్ణయాలు తీసుకుంటారు. వేడుకల్లో పాల్గొంటారు. పందాలు, పోటీలకు దూరంగా ఉండాలి. 13, 14 తేదీల్లో వేడుకలు, సంస్మరణల్లో పాల్గొంటారు. వైద్యం కోసం అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి. పెట్టుబడులు లాభిస్తాయి. 15 16, 17 తేదీల్లో ఒక సమాచారం మనస్తాపం కలిగిస్తుంది. చర్చల్లో, సమావేశాల్లో కీలకపాత్ర పోషిస్తారు. సంకల్పం నెరవేరుతుంది. బంధుమిత్రుల కలయిక ఉల్లాసం కలిగిస్తుంది.



**కుంభం (జనవరి 21 - ఫిబ్రవరి 18 మధ్య పుట్టినవారు)**

పెట్టుబడులు, సమావేశాలు, దూరప్రయాణాలు, కీలక నిర్ణయాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఆరోగ్యం పట్ల దృష్టి సారించాలి. వృత్తి, వ్యాపారాల్లో లక్ష్య సాధనకు గత అనుభవం తోడ్పడుతుంది. 13, 14 తేదీల్లో బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. రాజకీయ, సినీ రంగాల వారికి శుభప్రదం. కొత్త పరిచయాలు లాభిస్తాయి. 15, 16, 17 తేదీల్లో ఆరోగ్యం పట్ల శ్రద్ధ చూపాలి. ఆర్థిక విషయాల్లో గత అనుభవంతో లక్ష్యాలు సాధిస్తారు. ఆంతరంగిక విషయాలు చర్చకు వస్తాయి. ఉన్నత విద్య, విదేశీ వ్యవహారాలకు అవసరమైన నిధులు సర్దుబాటవుతాయి.



**మీనం (ఫిబ్రవరి 19 - మార్చి 20 మధ్య పుట్టినవారు)**

ఆర్థిక వ్యవహారాలు, వృత్తి, వ్యాపారాలు, ప్రయాణాలపై ఈ వారం దృష్టి సారిస్తారు. బుధ, గురువారాల్లో ఖర్చులు అంచనాలు మించుతాయి. చిన్నారులు, ప్రియతముల విషయంలో శుభపరిణామాలు సంభవం. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. 13, 14 తేదీల్లో వృత్తి, వ్యాపారాల్లో అదనపు ఆదాయం అందుకుంటారు. బంధుమిత్రులతో వేడుకల్లో పాల్గొంటారు. విందు, వినోదాలు ఉల్లాసం కలిగిస్తాయి. 15, 16, 17 తేదీల్లో స్పెక్యులేషన్లకు దూరంగా ఉండాలి. బృంద కార్యక్రమాల్లో పాల్గొంటారు. ఆర్థిక పరిస్థితి ప్రోత్సాహకరం. పందాలు, పోటీల్లో విజయం సాధిస్తారు.




## గండం గట్టెక్కిన అజిత్

అజిత్ గట్టెక్కింది సినిమా గండం కాదు. రాజకీయ గండం! జయలలిత మరణం తరువాత వారసుడు ఎవరు? అన్న మాటకు తమిళనాట హీరో అజిత్ పేరు ఎక్కువగా వినపడింది. అజిత్‌ని జయలలిత బాగా అభిమానించేవారనీ, తన రాజకీయ వారసుడు అజిత్ అని ఒకటి రెండు సార్లు ఆమె నోటివెంట వచ్చిందనీ, ఇలా రకరకాల కథనాలు తెర పైకి వచ్చాయి. ఎవరెన్ని కహానీలు వినిపించినా అజిత్ మాత్రం నోరు మెదపలేదు.

తనకు రాజకీయాలంటే ఇష్టం లేనట్టు ప్రవర్తించాడు. అంతే కాకుండా ఇటీవల శశికళను కలిసినా, రాజకీయాలు మాట్లాడకుండా మామూలు విషయాలు మాట్లాడి వచ్చేశాడు. దాంతో అజిత్‌కి రాజకీయాలంటే నిజంగానే ఇష్టంలేదనీ, ఇక అతడి పేరు తలవడం అనవసరం అని పార్టీ వర్గాలు డిసైడ్ అయి సైలెంట్ అయ్యాయి.

అజిత్ తెలివైనవాడు కనుకనే కర్ర విరక్కుండా, పాము చావకుండా మౌనంగా సమాధానం చెప్పాడని కోలీవుడ్ తమ్ముళ్ళు ఆ హీరో మీద పొగడ్తల వర్షం కురిపిస్తున్నారు.



## తప్పు ఒప్పుకున్న సూర్య

మనుషులన్నాక కోపతాపాలుంటాయి. ఆ సమయంలో మాట జారుతూ ఉంటారు. తరువాత తప్పయింది సారీ అంటూంటారు. సూర్య కూడా ఇలాగే చేశాడు. అసలు సంగతేమిటంటే... సూర్య, గౌతమ్‌మీనన్ కాంబినేషన్‌లో ఓ సినిమా రావలసి ఉంది. వాస్తవానికి ఈ సినిమా ఎప్పుడో రావలసింది. కానీ రకరకాల కారణాల వలన గౌతమ్‌మీనన్ ఆ ప్రాజెక్టును వాయిదా వేస్తూ వచ్చాడు. దాంతో సూర్యకి కోపం వచ్చి గౌతమ్‌మీనన్ సినిమా నుంచి తప్పుకుంటున్నట్టు ఓపెన్‌గా చెప్పేశాడు. ఇదంతా గతం. ఇప్పుడు సూర్య తన తప్పు తెలుసుకున్నాడట! తను అలా మాట్లాడకుండా ఉండాల్సింది అని కూడా ఒప్పుకుంటున్నాడు. త్వరలోనే గౌతమ్‌మీనన్ సినిమా చేయబోతున్నట్టు చెబుతున్నాడు. గతంలో వీరిద్దరి కాంబినేషన్‌లో వచ్చిన సినిమాలన్నీ సూపర్ డూపర్ హిట్‌గా నిలిచాయి. తిరిగి వీరిద్దరి సినిమా వస్తోందంటే ఇద్దరి అభిమానులు పండగ చేసుకుంటున్నారట!

## నిర్మాత కానున్న దర్శకుడు

ఇదేమీ కొత్త విషయం కాదు. ఇటీవలి కాలంలో కొందరు దర్శకులు నిర్మాతలుగా మారి మంచి లాభాలు కళ్ళ జూస్తున్నారు. ఇప్పుడు వీరి బాటలోనే పయనిస్తున్నాడు 'కబాలి' దర్శకుడు పా రంజిత్. తెలుగులో ఈ సినిమా పెద్దగా ఆడకపోయినా తమిళంలో హిట్ సినిమాగా నిలిచింది. ఇదంతా పాత కథే! ఇప్పుడు రంజిత్ నీలం ప్రొడక్షన్స్ స్థాపించి రెండు సినిమాలు నిర్మిస్తున్నాడు. ఇందులో ఒకటి స్వీయ దర్శకత్వంలో రాబోతోంది. ఈ రెండు సినిమాలు ఆర్థికంగా లాభాలు ఆర్జిస్తే మరిన్ని సినిమాలు తీస్తాడట! ఇప్పటికే రంజిత్ దగ్గర కథలు రెడీగా ఉన్నాయట! ఫలితాలే ఆలస్యం అంటున్నారు కోలీవుడ్ తమ్ముళ్ళు.

## నయనను అభినందించిన మాజీ లవర్

మాజీ లవర్ అంటే ఎవరో ఈపాటికే అర్థం అయిపోయి ఉంటుంది. ప్రభుదేవా! ఇటీవల ఓ ఈవెంట్‌లో ఇద్దరూ అనుకోకుండా ఎదురెదురు పడ్డారు. ఆ సమయంలో ఇద్దరూ కోపంతో కదం తొక్కకుండా మంచి స్నేహితుల్లా మాట్లాడుకున్నారట! నయనతార, ప్రభుదేవా పెళ్ళి విషయంలో గతంలో ఎంత రచ్చ జరిగిందో తెలియని విషయం కాదు. ఆ ఇద్దరూ ఎదురు పడితే కయ్యానికి కాలు దువ్వుతారేమో అనుకున్న వారికి వారి ప్రవర్తన ఓ పజిల్ అయిందట! విషయం అంతటితో ఆగిపోలేదు. ప్రభుదేవా నయనకి బెస్ట్ విషెస్ చెప్పాడట! ఇప్పుడు ఇదే హాట్ టాపిక్ అయింది. నయన, దర్శకుడు విఘ్నేష్‌ను పెళ్ళి చేసుకుందన్న వార్తలు వచ్చాయి. వాటిని ఇద్దరూ ఖండించారు. అయితే ఈ పెళ్లి వార్త నిజమే అయ్యుంటుందనీ, అందుకే ప్రభుదేవా నయనకు విషెస్ చెప్పాడనీ కోలీవుడ్ తమ్ముళ్ళు తెగ అనుమానాలు వ్యక్తం చేస్తున్నారు.



## జీవితాన్ని మార్చిన సినిమా

ఒక ఐడియా జీవితాన్ని మారుస్తుందో లేదో తెలియదు కానీ, ఓ సినిమా మాత్రం దర్శకుడి జాతకాన్ని పూర్తిగా మార్చేసింది. ఆ దర్శకుడు సాగర్ కె. చంద్ర. సినిమా 'అప్పట్లో ఒకడుండేవాడు'. ఈ సినిమా రాక ముందు ఆ దర్శకుడు ఎవరో సినీజనాలకు పెద్దగా తెలియదు. కానీ దీని విడుదల తరువాత మాత్రం అందరూ సాగర్ గురించే మాట్లాడుతున్నారు. తమకూ ఓ సినిమా చేసి పెట్టమని ఫోన్ల మీద ఫోన్లు చేస్తున్నారట! ఇందులో కొన్ని పెద్ద నిర్మాణ కంపెనీలు కూడా ఉండడం విశేషం. అతని టేకింగ్, మేకింగ్‌గూ నచ్చిన చిన్న నిర్మాతలైతే అతని ఇంటి ముందు క్యూ కడుతున్నారట! ఎవరెన్ని అడిగినా సాగర్ తొందరపడడం లేదట! తన దగ్గరున్న మూడు నాలుగు ప్రాజెక్టులకు తుది రూపం ఇచ్చిన తరువాత ఎవరికైనా కలవాలన్నది అతని ఆలోచనట.

# ఆయనతో... నేనా? పోటీనా?

-కాజల్ అగర్వాల్



**చక్కదనాల మోము, కవ్వించే కళ్ళు, ఊరించే నడుము వెరసి కాజల్‌ని చూస్తే ఎవరికైనా 'అబ్బా ఎంత అందం?' అనిపించకమానదు. చంద్రుడికి గ్రహణం పట్టినట్లు కాజల్‌ను గత కొన్ని సంవత్సరాలుగా ఫ్లాప్ అనే గ్రహణం పట్టిపీడిస్తోంది. వాటి నుంచి తప్పించుకోవడానికి ఎన్ని ప్రయత్నాలు చేసినా బూడిదలో పోసిన పన్నీరే అవుతున్నాయి. ఇంతకాలం దక్కకుండా ఊరిస్తున్న బ్లాక్ బస్టర్‌ను అందుకునే ఆ సమయం వచ్చేసిందని అంటున్న టాలీవుడ్ చందమామ కాజల్‌తో....**

**'ఖైదీ నంబర్ 150' మీద చాలా ఆశలు పెట్టుకున్నట్టున్నారు?**

నాది ఆశ కాదు నమ్మకం. నా ఖాతాలో గతంలో ఎన్నడూ లేనంత బ్లాక్‌బస్టర్ పడడం ఖాయం. ఆ సినిమాలో అవకాశం రావడమే ఓ అదృష్టం. ఆ అదృష్టం నన్ను విడిచిపోదు. ఈ సినిమాలో ఓ పాటలో డిఫరెంట్ స్టయిల్లో కనిపిస్తాను. ఇప్పటి వరకూ ఎవరూ నన్ను అలా చూపించలేదు. ఆ కాస్ట్యూమ్స్ నాకు బాగా నచ్చాయి. ఇన్ని సంవత్సరాల కెరీర్‌లో నా ఫేవరెట్ కాస్ట్యూమ్ అదే!

**ఈ సినిమాలో చిరంజీవిగారితో సమానంగా డ్యాన్స్ చేయడం కష్టం అనిపించలేదా?**

ఎందుకు అనిపించలేదు? ఈ జన్మలో డ్యాన్సుల్లో ఆయనతో పోటీ పడలేను. కష్టమే అనిపించినా ఎలాగో మేనేజ్ చేశాను.

**తెలుగు, తమిళంలో బాగా బిజీగా ఉన్నట్టున్నారు?**

తమిళంలో రెండు, తెలుగులో రెండు సినిమాలు చేస్తున్నాను.

**క్యారెక్టర్ల ఎంపిక ఎలా ఉంటుంది?**

మొదటిసారి కథ వినగానే మంచి కథ అన్న విషయం అర్థమైపోతుంది. కచ్చితంగా సక్సెస్ అవుతుందని అనిపిస్తుంది. అలా అనిపించిన సినిమాలనే ఎంచుకుంటాను. నేను చేసిన సినిమాల్లో కొన్ని వసూళ్ళ పరంగా సక్సెస్ సాధించలేకపోవచ్చు. కానీ విమర్శకుల చేత కూడా







మెప్పు
పొందాయి అంటే ఆ
సినిమా బ్లాక్ బస్టరే! ఓ సినిమా ఒప్పుకున్నప్పుడు ఆ క్యారెక్టర్‌కు సంబంధించి హోమ్‌వర్క్ తప్పకుండా చేస్తాను. 'దో లఫ్జోన్ కి కహాని' (Do Lafzon Ki Kahaani) సినిమాలో నాది గుడ్డి అమ్మాయి క్యారెక్టర్. దీని కోసం ముంబయిలోని బ్లైండ్‌స్కూల్లో చాలాసేపు గడిపే దాన్ని. వాళ్లు ఎలా ప్రవర్తిస్తారు? రోజువారీ పనులు ఎలా చేసుకోగలుగుతారు? మనుషుల్ని ఎలా గుర్తుపడతారు? అనే విషయాలు బాగా పరిశీలించేదాన్ని. వాళ్ళని గంటల తరబడి పరిశీలించినా కొన్ని అనుమానాలు వస్తూ ఉండేవి. డైరెక్టర్‌గారిని అడిగి తెలుసుకునేదాన్ని. ఈ సినిమాలో నాది ఛాలెంజింగ్ రోల్. సినిమా ఫలితం ఎలా ఉన్నా మనసుకు చాలా సంతృప్తినిచ్చింది.

**రెమ్యునరేషన్ పెంచేశారంటారు నిజమేనా?**

సినిమా ఒప్పుకునేముందు కథ గురించే ఆలోచిస్తాను తప్ప రెమ్యునరేషన్ గురించి అస్సలు పట్టించుకోను. మంచి కథ, ఛాలెంజ్ రోల్ వస్తే రెమ్యునరేషన్ తీసుకోకుండా చేస్తాను. అయితే ఆ కథ నాకు బాగా నచ్చాలి. డిఫరెంట్‌గా ఉండాలి. అప్పుడే డబ్బు గురించి కాకుండా సినిమా గురించి, నా పాత్ర గురించి ఆలోచించి చేస్తాను.

**కొందరు దర్శకులు మిమ్మల్ని మోసం చేశారు అన్నారు నిజమేనా?**

నిజం కాకపోతే ఆ విషయం ఎందుకు చెబుతాను. తెరమీద ఇంటిమేట్ సీన్లు, లిప్ లాక్‌లకు సంబంధించి మోసం చేసేవారు. నాకు చెప్పేది ఒకటి, వాళ్ళు తీసేది ఒకటి. కొన్నిసార్లు చేయను అని చెప్పే వీలు కూడా ఉండేది కాదు. అలాంటి విషయాలు ముందుగా చెబితే చేయాలో లేదో నిర్ణయించుకునేదాన్ని. ముందుగా ప్రిపేర్ అయి వెడితే సెట్లో ఇబ్బంది పడడం, గొడవ పడడం ఉండదు. దర్శకనిర్మాతలు ఎందుకు అలా చేస్తారో అన్న విషయం ఇప్పటికీ నాకు అర్థం కాదు.

**అంటే గొడవ కూడా పడ్డారా?**

నాది పోట్లాడే మనస్తత్వం కాదు. కొంచెం గట్టిగా అడుగుతాను, అంతే! వాళ్ళు ఏదో సమాధానం
చెబుతారు. దాంతో
ఆ విషయాన్ని సెట్లోనే వదిలేస్తాను. కాకపోతే ఎప్పుడూ అలాంటి అనుభవాలే ఎదురవుతూ ఉండేవి. దాంతో ఎప్పుడూ గొడవపడుతున్నట్టే ఉండేది.

**ఈ రంగంలో మిమ్మల్ని ప్రభావితం చేసిన వ్యక్తులు?**

రాణీముఖర్జీ. 2005లో రాణి నటించిన 'బ్లాక్' సినిమా అంటే నాకు చాలా ఇష్టం. అందులో రాణి నటన సూపర్బ్ అని చెప్పినా తక్కువే! అంతకు ముందు బాలీవుడ్‌లో చాలా మంది ఫేవరెట్ హీరోయిన్లు ఉండేవారు. కానీ ఆ సినిమా తరువాత రాణీ ఫేవరెట్ అయిపోయింది. అప్పటికీ, ఇప్పటికీ తనే ఎవర్‌గ్రీన్ అనిపిస్తుంది నాకు.

**లేడీ ఓరియెంటెడ్ సినిమాల వైపు దృష్టి పెట్టలేదా?**

అలాంటి సినిమాలు చేయాలన్నది నా కోరిక. యాక్షన్ మూవీ అయి ఉండాలి. కానీ ఇప్పటివరకూ నా దగ్గరకు అలాంటి కథలు రాలేదు. ఎవరైనా అలాంటి కథతో వస్తే తప్పకుండా చేస్తాను.

**మొన్నటి దాకా కాజల్ పెళ్లి చేసుకోబోతోంది అన్న వార్తలు వచ్చాయి. ఎంతవరకు నిజం?**

నేను ఎక్కడా ఎవరితోనూ ఈ మాట అనలేదు. పెళ్లి అనేది రహస్యంగా చేసుకోవలసిన అవసరం లేదు కదా! అందరికీ చెప్పే చేసుకుంటారు. నేను అలాగే చేసుకుంటాను. దానికి ఇంకా టైముంది. అయినా టైమొస్తే ఏదీ ఆగదు. ఆ సమయమొస్తే తప్పకుండా అందరికీ చెప్పడమే కాదు, నా వెల్‌విషర్స్ అందరినీ ఆహ్వానిస్తాను కూడా!

**సినిమాల రేసులో వెనకపడినట్టున్నారు?**

ఇదేమీ రన్నింగ్ రేస్ కాదు వెనకా ముందూ కావడానికి. నా దగ్గరకు వచ్చిన సినిమాలన్నీ చేసే
యాలన్న కోరిక లేదు నాకు.
నచ్చినవి మాత్రమే చేస్తాను. చేస్తున్నాను.

**మిగతా హీరోయిన్లు మీకన్నా ముందు ఉన్నారు కదా?**

చెప్పాను కదా, ఇదేమీ పందెం కాదని. మిగతా వారు ఎలా చేస్తున్నారు? అన్నదానికి నేనేం సమాధానం చెబుతాను. అది వాళ్లనే అడగండి. ఎవరి అభిప్రాయాలు వారివి. అందరికీ ఒకే రూల్ ఎలా అప్లయ్ చేస్తారు?

**మీరు చేసిన సినిమాల్లో కూడా కొన్ని ఫ్లాపులు ఉన్నాయి కదా?**

కొన్నిసార్లు ఫ్లాపులు కూడా రుచిచూడక తప్పదు. నా సినిమాలు ఫ్లాప్ అయ్యాయంటే చాలా కారణాలుంటాయి. కొన్ని సినిమాలు మొహమాటానికి చేయాల్సి వచ్చింది. ఆ సినిమా ప్రేక్షకులకు నచ్చదు అని తెలిసినా కూడా చేశాను. మరికొన్ని మంచి సక్సెస్ సాధిస్తాయి అనుకుంటే బాక్సాఫీసు వద్ద బోల్తా కొడతాయి. సినిమా జయాపజయాలు నిర్ణయించేది మేం కాదు కదా? అందుకే ఈ ఫ్లాపులు, సక్సెస్‌లూనూ.

**దర్శకత్వంలో కల్పించుకుంటారా?**

అది నా పని కాదు. కాకపోతే క్యారెక్టర్ బెటర్‌గా రావడానికి ఏవన్నా ఐడియాలు వస్తే డైరెక్టర్‌గారితో చెబుతాను. నచ్చితే ఆయన ఇంప్లిమెంట్ చేస్తారు, లేకపోతే లేదు. అంతే తప్ప నా పాత్ర అలా ఉండాలి, ఇలా చూపించండి అంటూ ఎవరికీ ఎలాంటి సలహాలూ ఇవ్వలేదు. ఇవ్వను కూడా!

-చిన్ని

ఇంటర్వ్యూ

# తిరుగులేని మీడియా సినిమా

**-సుమన్**

**తరంగిణి చిత్రంతో తెలుగు తెరకు పరిచయమైన బహుభాషా నటుడు సుమన్. శివాజీ చిత్రంలో భిన్నమైన విలన్‌పాత్రతో ఎందరికో మార్గదర్శకుడైన 500 చిత్రాల నటుడు. నా సినీ జీవిత చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన చిత్రం అన్నమయ్య అని గర్వంగా చెబుతారాయన. ప్రజలకు ఏదైనా సందేశం అందించడంలో తిరుగులేని మీడియా సినిమా ఒక్కటే అంటున్న సుమన్ ఇంటర్వ్యూ....**

చెన్నై టి.నగర్‌లో జన్మించాను. నా పూర్తి పేరు సుమన్ తల్వార్. మా నాన్నగారు సుశీల్ చందర్. అమ్మ కేసరి తల్వార్. నా మాతృభాష తుళు. కర్ణాటకలో మంగుళూరు ప్రాంతం ఈ భాషకు ప్రసిద్ధి. ఐశ్వర్యారాయ్, దీపికాపదుకొనే, శిల్పాశెట్టి... వీళ్లందరూ తుళు భాషకు చెందినవారే.

చెన్నై చర్చ్ పార్క్‌లోని ప్రైమరీ స్కూలులో ఐదవతరగతి వరకు చదివాను. తమిళనాడు ముఖ్య మంత్రి జయలలిత, టి.చిదంబరం చదివింది కూడా ఇక్కడే. పచ్చయప్ప కాలేజీలో పి.యు.సి మొదటి సంవత్సరం చదువుతూ ఉండగానే నాకు సినిమాల్లో అవకాశం వచ్చింది. విద్యార్థిగా ఉన్నప్పటి నుండీ సినిమాలు బాగా చూసేవాణ్ణి.

### సినీభిక్ష పెట్టిన కార్ మెకానిక్

చాలా యాక్సిడెంటల్‌గా సినీరంగ ప్రవేశం చేశాను. సినిమా పరిశ్రమతో ఏ మాత్రం సంబంధం లేని ఒక కార్ మెకానిక్ నన్ను ఈ రంగానికి పరి చయం చేశారు. ఆయన పేరు కిట్టూ. ఆయన కార్ మెకానిక్ కావడంతో ఎందరో దర్శకులు ఆయన దగ్గరకు వచ్చేవారు. రామణ్ణి అనే తమిళ దర్శక నిర్మాత దగ్గరకు తీసుకెళ్లి నన్ను పరిచయం చేశారు కిట్టూ. కొత్త నటుల అన్వేషణలో ఉన్న రామణ్ణి నా ఫేస్‌కట్ చూసి ఎంతో ఇంప్రెస్ అయ్యారు. కరాటేలో బ్లాక్‌బెల్ట్ నాకు మరో ప్లస్ పాయింటైంది. ఎలాంటి స్క్రీన్ టెస్టులు లేకుండా వెంటనే నన్ను సెలెక్ట్ చేసి డైరెక్ట్‌గా నన్ను కెమేరా ముందుకు తీసు కెళ్లారు. ఆ విధంగా మొట్టమొదట 'స్విమ్మింగ్ పూల్' అనే తమిళ చిత్రం ద్వారా సినీరంగ ప్రవేశం చేశాను. ఈ చిత్రం ఎంతో విజయవంతంగా ఆడింది. ఈ చిత్రంలో అందరూ కొత్త నటులే.

### గాడ్ బ్రదర్ భానుచందర్

నటుడు భానుచందర్ నాకు మిత్రుడు. తెలుగు పరిశ్రమలో ఇంతపేరు తెచ్చుకుని ఈ రోజు నేను ఇంత మంచి పొజిషన్‌లో ఉండటానికి కారణం భానుచందరే. తెలుగులో ఇన్ని చిత్రాల్లో నటిస్తూ రాణిస్తున్నానంటే ఆ క్రెడిట్ భానుచందర్‌కే దక్కుతుంది. అతడే నా గాడ్ బ్రదర్. తెలుగు చిత్ర పరిశ్రమ నీకు బాగా సరిపోతుంది, తెలుగులో నువ్వు ఖచ్చితంగా హిట్ అవుతావు, గ్రేట్ హీరో అవు తావు అని ప్రోత్సహించి తమ్మారెడ్డి భరద్వాజ గారి దగ్గరకు తీసుకెళ్లి పరిచయం చేశాడు భాను చందర్. ఆ విధంగా 'ఇద్దరు కిలాడీలు' చిత్రంలో నటిం చాను. మేం ఇద్దరం కలిసి కొన్ని సినిమాల్లో నటించాం.

### తరంగిణి

తెలుగులో నేను అంగీకరించిన మొదటి చిత్రం 'ఇద్దరు కిలాడీలు'. కానీ విడుదలైన నా మొదటి చిత్రం 'తరంగిణి'. ఇది సూపర్‌హిట్ చిత్రం. ఇందులో భానుచందర్, పూర్ణిమ, తరం గిని తదితరులున్నారు. కోడి రామకృష్ణ దర్శకత్వంలో 1982లో విడుదలైంది. ఇక తర్వాత సితార, మెరుపు దాడి, పండంటికాపురానికి పన్నెండు సూత్రాలు, కల్యాణవీణ, కోడలు కావాలి...వంటి చిత్రాల్లో నటించాను.

### అన్నమయ్యకు బ్రహ్మరథం

నా సినీ జీవిత చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన చిత్రం అన్నమయ్య. వేంకటేశ్వర స్వామి పాత్రకు ప్రేక్షకులు బ్రహ్మరథం పట్టారు. ఆ వేంకటేశ్వరుని అవతారమే ఆ పాత్రలో చూశాం అని ఎందరో భక్తులు చెప్పారు. తెలుగులో నేను



అంతకుముందు నటించిన 20వ శతాబ్దం, ఖైదీ ఇన్‌స్పెక్టర్, బావా బావమరిది, కలెక్టర్‌గారి అల్లుడు, పెద్దింటి అల్లుడు వంటి చిత్రాలన్నీ విజయవంతమైనవే. కలెక్టర్‌గారి అల్లుడు, పెద్దింటి అల్లుడులో కామెడీ పాత్రలు చేశాను. నా చిత్రాల్లో ఫ్లాప్ మాటే లేదు. బావ బావమరిది చిత్రంలో నటనకుగాను ఉత్తమ నటుడుగా నాకు నంది అవార్డు లభించింది.

### రాష్ట్రపతి మెచ్చిన అన్నమయ్య

ఆనాటి రాష్ట్రపతి శంకర్‌దయాళ్‌శర్మగారు అన్నమయ్య చిత్రం చూశారు. త్రివిధ దళాధిపతులందరితో సహా సి.బి.ఐ చీఫ్ డైరెక్టర్ కార్తికేయగారు వచ్చారు. వీళ్లందరితో కలిసి కూర్చుని ఆ చిత్రం నేనూ చూశాను. వారితో కలిసి భోజనం చేశాను. ఇంతటి అదృష్టం ఎంతమంది నటులకు దక్కుతుంది చెప్పండి? అందుకే అన్నమయ్య నా జీవితంలో మరచిపోలేనిది. రాష్ట్రపతి చేతులమీదుగా ఆరోజు నాకు జరిగిన సన్మానం అదృష్టంగా భావిస్తాను. నా సినీ జీవిత చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన చిత్రం.

### శివాజీలో ఛాలెంజింగ్ పాత్ర

కెరీర్‌లో ఛాలెంజింగ్ చిత్రం శివాజీ. ఒక నటుడుగా, ఒక హీరోగా నేను విలన్ పాత్రను అంగీకరించి చేయడం, పైగా రజనీకాంత్ వంటి సీనియర్ నటుడికి ప్రతినాయకునిగా చేయడం చాలా కష్టం. ఇది కత్తిమీద సాములాంటిదే. షూటింగ్ జరుగుతున్నన్ని రోజులూ రాత్రిపూట రజనీకాంత్ నాకు ఫోన్ చేస్తూ, ఎంతో ఎంకరేజ్ చేసేవారు. ఆ చిత్రం విజయవంతం కావడానికి మెయిన్ రీజన్ ఆయనే.

### రజనీకాంత్ గొప్పగుణం

'శివాజీ' చేస్తున్నప్పుడు గ్లామర్ హీరో విలన్ పాత్ర ఎలా చేస్తాడు? అనుకున్నారు. విలన్‌గా నేను ఫెయిల్ అవుతాననుకున్నారు. కానీ దర్శకుడు శంకర్ విలన్‌గా నా పాత్రను ఎంతోబాగా తీర్చిదిద్దాడు. ఈ చిత్రం సంచలనం సృష్టించింది. రజనీకాంత్‌ను డామినేట్ చేసేవిధంగా నా పాత్ర ఉన్నప్పటికీ ఆయన ఎలాంటి రియాక్షన్ లేకుండా ఎంతో సంతోషంతో నాతో నటించారు. ఆయన స్థానంలో మరో హీరో ఉండి ఉంటే, విలన్‌పాత్ర నన్ను డామినేట్ చేస్తోంది, కట్ చెయ్యండి అనేవారు. రజనీ అలా చేయలేదు. అదీ ఆయన గొప్పగుణం.




### కరుణానిధి సన్మానం

శివాజీ చిత్రంలో ఉత్తమ ప్రతినాయకునిగా తమిళనాడు ప్రభుత్వ అవార్డు అందుకున్నాను. ఆనాటి ముఖ్యమంత్రి కరుణానిధి చేతుల మీదుగా రజనీకాంత్, కమల్‌హాసన్‌ల సమక్షంలో అవార్డు అందుకోవడం నాకు గర్వకారణం. ఇంత కంటే గొప్ప విషయం ఏదైనా ఉంటుందా?

### మూడు తరాలతో..

మూడు తరాల నటులతో నటించడం మరో గొప్ప అదృష్టం. 'రావుగారింట్లో రౌడీ' చిత్రంలో అక్కినేనితో నటించాను. ఆయన సెట్‌లో ఎంతో చమత్కారంగా, సంతోషంగా మాట్లాడేవారు. ఆయన తీరుతో షూటింగ్‌లో అలసటే ఉండేది కాదు. శోభన్‌బాబుగారితో 'దోషి నిర్దోషి'లో నటించాను. కానీ ఎన్టీఆర్‌గారితో, సావిత్రిగారితో నటించలేకపోయాను. అది నా దురదృష్టం. ఇక తమిళంలో ఎంజీఆర్, శివాజీగణేశన్ నాకు రెండు కళ్లలాంటివారు. వాళ్లని చూసే నేను నటనలో ఇన్‌వాల్వ్ అయ్యాను. డైలాగ్ డెలివరీ నేర్చుకున్నాను. మనదేశంలో నటుడుగా రాణించి రాజకీయపార్టీపెట్టి ముఖ్యమంత్రిగా పాలించి పదవిలోనే మరణించింది ఎం.జి.ఆరే. తమిళనాట ఆ తర్వాత జయలలిత తెరమీదకు వచ్చారు. ఇవన్నీ నాకు బాగా నచ్చాయి.

### తెలుగు నేర్పిన రేలంగి నరసింహారావు

ఈ రోజు ఇంత చక్కగా నేను తెలుగు మాట్లాడటానికి కారణం రేలంగి నరసింహారావుగారే. నా అభివృద్ధికి కృషి చేసిన దర్శకుల్లో ఆయన ఒకరు. ప్రత్యేక శ్రద్ధతీసుకుని ఒక కో డైరెక్టర్‌ను నియమించి నాకు తెలుగు నేర్పించారు. ఎలాంటి కోపం, చిరాకు లేకుండా ఎంతో మర్యాదగా ఉండేవారు. రైటర్ డైలాగ్ కష్టంగా ఉన్నా సరే మార్పులేకుండా యాజిటీజ్‌గా చెప్పించడం ఆయన గొప్పతనం. నో కాంప్రమైజ్ అనేవారు.

### అభివృద్ధిపథంలో తెలుగు రాష్ట్రాలు

రామ్మూర్తినాయుడుగారు నాకు క్లోజ్‌ఫ్రెండ్. అప్పట్లో టీడీపీలో చురుగ్గా పాల్గొన్నాను. చంద్రబాబుగారు మంచి పాలనాదక్షుడు. దార్శనికుడు. హైదరాబాద్‌ను ఎంతో అభివృద్ధిచేశారు. కేసీఆర్ గారు ముఖ్యమంత్రిగా ఎంతో అభివృద్ధి చేస్తున్నారు.

సినిమారంగంలో మొదట జై తెలంగాణ అని నినదించింది నేనే. రెండు రాష్ట్రాలూ అభివృద్ధి చెందాలని నేను కోరుకున్నాను. ఇప్పుడు రెండూ అభివృద్ధి చెందుతున్నాయి.

### నా తుది శ్వాస సినిమా

సినిమా పవర్‌ఫుల్ మీడియా. ఏ సందేశమైనా ఫాస్ట్‌గా ప్రజలకు చేరుతుంది. ఏ మెసేజ్ అందించాలన్నా సినిమాకు మించిందిలేదు. దీనికి తిరుగులేదు. నా తుదిశ్వాస వరకు సినిమా రంగాన్ని వదలను. సినిమా నా జీవితం, సర్వస్వం. 38 సంవత్సరాల సినీజీవితం పూర్తిచేశాను. ఇంగ్లీషుతో పాటు పలు భాషల్లో నటించాను. ఇంకా ఎన్నో అవకాశాలు వస్తున్నాయి. ఒకవేళ నేను రాజకీయాల్లోకి వచ్చినా పూర్తికాలం కేటాయించలేను. ఫుల్‌టైమ్ పాలిటిక్స్‌లోకి వస్తే ప్రజాజీవితంలో పూర్తిగా మమేకం కావాలి. పేదలకోసం, అట్టడుగు వర్గాలకోసం పనిచేయాలి. ఒకవేళ రాజకీయాల్లోకి వచ్చినా మరో రెండేళ్లు పడుతుంది. ప్రజల రక్షణ, ప్రయోజనాలకు ఉద్దేశించిన ఆకాంక్షలు నాకున్నాయి. నాకున్న ఉద్దేశాలు, అభిప్రాయాల్ని అంగీకరించిన పార్టీలోనే జేరతాను.

### తీర్చిదిద్దిన దర్శకులు

ఎంతోమంది దర్శకులు నన్ను తీర్చిదిద్దారు. ఏ పాత్ర ఇచ్చినా అవలీలగా చేయగలనన్న ఆత్మవిశ్వాసం ఉండటం, అందుకు తగ్గట్టు దర్శకులు అండగా నిలబడటం గొప్ప విషయం. ఆ విధంగా దర్శకుల నమ్మకాన్ని వమ్ము చేయకుండా పాత్రలకు న్యాయం చేశాను. నవరసాలొలికే విభిన్న పాత్రలు చేశాను. అది దేవుడు నాకిచ్చిన వరం. అభిమానుల కోరిక మేరకు చాలా చిత్రాల్లో పోలీస్ ఆఫీసర్ పాత్రలు చేశాను.

నా భార్య పేరు శిరీష. డి.వి.నరసరాజుగారి మనవరాలు. మాకు ఒక కుమార్తె. పేరు ప్రత్యూష.

-కె.హరనాథ్

**9703542598**

